

నా పేరు శ్రీనివాసరావు. అమ్మా నాన్న శీనయ్య.
నేస్తాలు శీనిగాడు, ఆస్తి దక్కవేదని దాయాదులు
దరిద్రప్పవెధవ అని రకరకాలుగా పిలిచేవారు.
నాగురించి చదివిన మీరేమంటారో?

# నేను శీనయ్య

నండూరు సుబ్బారావు

# మనశ్శాంతి యున్న

(సంసారం)

రచన:

వండూరు సుబ్బారావు
(ఆల్ ఇండియా రేడియో),
విజయవాడ.

సర్వోదయ పబ్లిషర్స్
ఏలూరురోడ్డు విజయవాడ-2
ఫోన్ 4645

సర్వోదయ ప్రచురణ-30
ప్రథమ ముద్రణ

వెల : రు. 6-00

సంపాదకులు :
'కొత్త సుబ్బారావు'

కృష్ణవేణి సచిత్రమాస
పత్రికనుండి పునర్ముద్రితం.

ముద్రణ :
కృష్ణవేణి ప్రింటర్స్,
విజయవాడ-2.

ఎవరెప్పుడయినా భార్యాభర్తల సరసం చూశారా! చూడలేదనుకుంటా... చూస్తే అంత తాపీగా చిరునవ్వు చిద్విలాసంగా కూర్చోరు. ఉప్పెన గాలికంటె వేగంగా, భూకంపంకంటె ప్రళయంగా వుంటుంది ఆ సరసం. బ్రహ్మదేవుడు, జగత్తులో ఇన్నిరకాల సరసాలుండగా ప్రత్యేకం అటువంటి సరసమే ఆ భార్యాభర్తలకు ఎందుకు సృష్టించాడో ఇంతవరకూ అర్థంకాలేదు. అటకమీదివి మూడు ఆవకాయ జాడీలు పగిలి, పచ్చళ్ళన్నీ, కూరలు, మొదలయినవి కురుక్షేత్ర యుద్ధానంతరం యుద్ధభూమిని మరపించేలా వంటిల్లంతా ఏకమయి, చంటిపిల్లవాడు ఝడుసుకుని, గుక్కపట్టిన ఏడుపుతో గుడ్లు తేలవేసే పర్యంతమై, ఇటు ఈ ఇంటినీ, అటు చుట్టుపక్కల ఇళ్ళను ఒక కొలిక్కి తెస్తేనేగాని వాటి సరసం పూర్తయ్యేది కాదు...

అదిగో ఆ సరసాన్ని మరపింప చేస్తుంది మన శీనయ్య సంసారపు సరసం. శీనయ్య అసలుపేరు శ్రీనివాసరావు. శ్రీనివాసరావు తల్లిదండ్రులకు ఎంతకాలానికి పిల్లలు పుట్టకపోతే, పోలేరమ్మ జాతరలూ, పోతురాజు కొలువులూచేసి, అప్పటికీ లాభంలేకపోతే తిరుపతి వెంకటేశ్వరస్వామికి ఒక పడని రూపాయి ముడుపుకట్టి, కొండమీదికి ఒక శుభముహూర్తాన

వెళ్ళివచ్చిన తర్వాత, శీనయ్య వాళ్ళ అమ్మ కడుపునబడ్డాడు. శ్రీనివాసుని దయవల్ల పుట్టాడు కాబట్టి తల్లిదండ్రులు ఆ పుత్రరత్నానికి శ్రీనివాసరావు అనే వాడుకనామం పెట్టుకున్నారు. సదరువాడుకనామం క్రమంగా శీనయ్య, శీనిగాడు, దరిద్రపు వెధవ అనే ముద్దుపేర్లుగా మారిపోయింది. వాళ్ళ అమ్మానాన్నలకు శీనయ్య, స్నేహితుల పిలుపుపేరు శీనిగాడు; దాయాదులకు ఆస్తి దక్కకుండా పోయినందుకు (ఇతను పుట్టటంవల్ల) దరిద్రపు వెధవ; ఈ వాడుకనామాలు ఏర్పడినాయి అన్నమాట... ఏమయితేనేం శ్రీనివాసరావు ఉరఫ్ శీనయ్య శుక్లపక్ష చంద్రుడిలాగ దినదినప్రవర్ధమానమై పెరిగి, తలిదండ్రులను పున్నామ నరకంనుంచి తప్పించాడు.

శ్రీనివాసుని భార్యపేరు పద్మావతి అనుకునేరు... కాదేంకాదు... నంబినాంచారి అంతకన్నా కాదు... సుబ్బలక్ష్మి అనబడే సుబ్బులు... సుబ్బులేమిటి సబ్బుబిళ్ళకుమల్లే అని తన పేరు లక్ష్మి అని పిలవమనేది ఊహ తెలిసినప్పటినుంచీ ఆ చిన్నది. కాని ఆవిడ మాట వినిపించుకునే దెవరు?... పైగా వాళ్ళ నాయనమ్మ తాను బ్రతికున్నంతకాలం "ఒసే సుబ్బీ" అని పిలిచేది. అలా పిలవవద్దనీ, పిలిస్తే అసలు తాను పలకనే పలకననీ అనేకసార్లు బుంగమూతి పెట్టుకు భీష్మించుకు కూర్చునేది గాని మామ్మ చేతిలో చేగోడీలో, కారప్పూస పొట్లమో చూడగానే అంతకోపం ఇట్టే అంతర్థానమయ్యేది. ఈ విధంగా సుబ్బులక్ష్మి అన్నిపేర్లతోపాటు 'సుబ్బి' అన్న పేరుకూడా నాయనమ్మ చచ్చిపోయేవరకూ శాశ్వతంగా ఉండిపోయింది. దీనినిగురించి ఒక వదంతికూడా వుంది. ఒకసారి

సుబ్బలక్ష్మి ఉరఫ్ సుబ్బి నాయనమ్మ దగ్గరకు పనివేళా వచ్చి "నాయనమ్మా నేనొకటి అడుగుతాను చెప్తుతావా" అని అడిగిందట... దానితో నాయనమ్మ సుబ్బి తబ్బిబ్బయి, ఇన్నాళ్ళకు తన మనుమరాలు తనవద్ద ధర్మసందేహం తీర్చుకోటానికి వచ్చిందనీ, మనుమరాలుకి ఇంతమంచి కోరుకు ఎప్పటి నుంచి వచ్చిందా అనీ, ముచ్చటగా మూడునాళ్లు మురిసిపోయి భగవద్గీతోపదేశం చేయబోయే శ్రీకృష్ణ పరమాత్మ పోజు పెట్టి "ఏమిటే సుబ్బీ" అని అడిగింది.

"అహా, ఏంలేదు. నీవెప్పుడు చచ్చిపోతావు" అని అడిగింది. దానితో నాయనమ్మ బోలెడు ఆశ్చర్యపోయి, పోజుతీసి గట్టునపెట్టి "ఓసి నీ యిల్లు నేలకట్టా. అదేం ప్రశ్నే" అని అడిగింది.

"నా యిల్లు నేలను కాకపోతే చెట్టుమీద కడతారా ఏమిటి?" అని తన మనసులో తానే సమాధానం చెప్పుకుని సుబ్బమ్మ ఇలా పైకి అంది.

"లేకపోతే ఏమిటి నాయనమ్మా! ఎన్నిసార్లు చెప్పినా నా మాట వినవు. లక్ష్మి అని పిలవమంటే అధమపక్షం సుబ్బలక్ష్మి అనికూడా అనకుండా సుబ్బీ-సుబ్బీ అని గావుకేకలు పెడతావు" అని చీదరించుకుంటూ గొంగళిపురుగు ముఖంపెట్టి లేచి చక్కాపోయింది. ఆ శాపంకొట్టో ఏమో, ఏ సుముహూర్తంలో మనుమరాలు ఆ చిట్టికోరిక కోరిందో! పాపం ఆ ముసలావిడ ఇది జరిగి వారం తిరక్కముందే టపా కట్టేసింది. ఇక తనను "సుబ్బీ" అని పిలిచేవాళ్ళు లేరుకదా అని ఆ కన్యకామణి ఎంతో మురిసిపోయింది. కాని తర్వాతర్వాత

ఆ పూబోడిని భర్త శీనయ్యా ఎవరూ లేకుండా చూచి "సుబ్బీ" అని ముద్దుగా పిలిచేవాడుట. అయితే ఒకటి. అది కాపురానికి వచ్చిన మొదటిలో కాబట్టి భర్తను ఏమీ చేయ లేక ఒకప్రక్క కోపం, ఒకప్రక్క సిగ్గు, ఒకప్రక్క ప్రేమ కలసి అట్టుడికినట్టు ఉడికి కొత్త ఆవకాయ కారంలా వుండేది ఆ యిల్లాలుకు. భర్త ఆ పిలుపు పిలిచినప్పుడల్లా సుబ్బలక్ష్మికి, తన భర్త శీనయ్యా అచ్చం చచ్చిపోయిన నాయనమ్మలా కనుపించేవాడు.

ఈ సందర్భంలో వెనకటి ప్రేమలూ, ఆదర్శాలూ, కూడబలుక్కోవటాలూ, ఒక తాటిమీద నడవటం, అలా నడవాలని అనుకోవటం ఇవన్నీ పోయి కొంచెం ఎడమొహాలూ, పెడమొహాలూ, ముక్కు చీదుకోవడాలూ, కళ్ళు అద్దుకోవడాలూ, ఇంటిలో సామానులు శూన్యంలో నాట్యంచేసి కింద పడి పగిలిపోవడాలువరకూ వచ్చింది.

శీనయ్యాకు కోపంవస్తే, పొరపాటున పచ్చిమిరపకాయ నమిలినట్లుగావస్తుంది. దానితో తారామండలానికి లేచిపోయి "వెధవకొంప, దరిద్రపుకొంప, నాపాలిటి శనిగ్రహం" ఇత్యాది పదజాలంతో అరుచుకుంటూ కాఫీగ్లాసువిసిరి నేలకేసికొట్టి (ఈ విధంగా బద్దలయిన గాజు గ్లాసుల కాతాకు ప్రతినెలా ఖర్చు అయిదు రూపాయల ఆరణాలన్నర) భోజనమయినా చేయకుండా ఆఫీసుకు మూడు అంగల్లో చేరుకుని యజమానిచేత ఆ రోజున ఆరుతిట్లు తినేవాడు. ఇది నాయక లక్షణం. ఇక నాయిక లక్షణం... ఆయన అటు వెళ్ళిన తరువాత పంటిక్రింద మెంతిగింజ పడినట్లు తుపుక్కునఉమ్మేసి యథాశక్తి చంటిపిల్ల

వాడి వీపుమీద నాల్గు చాచి అంటించి, తన తల్లినీ తండ్రినీ వరసవారీగా తనకి పెళ్ళిచేసి గొంతుకకోసిన సందర్భంగా బండ బూతులు తిట్టి, రెండు సత్తెప్పాలాలు పగలగొట్టి, నేతిగిన్నె కాలితో తన్ని, కరెంటు పోయినందుకు మధ్యలో మునసిపాలిటీవాళ్ళను కలగలిపి తిట్టి, నూతి దగ్గరకుపోయి గబగబా మూడు బిందెల చన్నీళ్ళు నెత్తిన గుమ్మరించుకునేవాడు.

ఝాము ప్రొద్దెక్కిన తర్వాత కోపం కొంచెం తగ్గి, పాపం భర్త కోపంతో ఆకలెక్కువయి ఎంత ఉసూరుమంటూ వస్తారోనని ఒక వేపుడు, మరికొంచం చిలగడదుంపలూ, రెండు ములక్కాడలూ ఎక్కువేసి పులుసుపెట్టి స్వాతివానకు ముత్యపు చిప్పలాగ ఎదురుచూస్తూ కూర్చునేది. పాతివ్రత్య సిద్ధాంతరీత్యా తాను భోజనంకూడా చేసేదికాదు. పన్నెండు... ఒంటిగంట... రెండు... నాలుగు... ఆరుగంట లయ్యేటప్పటికి అరిగాడు లాగిపెట్టి సిగరెట్టు దమ్ముకొడుతూ (కొండొకచో బీడీ దమ్ము) యింటికివచ్చి వాలుకుర్చీలో శేషశాయిమీద శ్రీ మహావిష్ణువులా శయనించేవాడు. లోపల ఆకలితోపాటు గుడగుడ... ఏంచేయాలి తను. పాపం తనమూలంగా తన భార్య భోజనంచేసి ఉండదు. పిచ్చిసన్నాసి. తనకుకోపంవస్తే వళ్ళూపై తెలియదు. అసలు ఇవాళ తప్పంతా ఆవిడదే. ఆవిడే ముందు తొందరపడితే తర్వాత తాను తొందరపడ్డాడు. అయినా పిల్లలతో చేసుకోలేక కొంచెం తొందరపడినా తాను సర్దుకుంటేపోలా... అనుకుంటూ కూర్చునేవాడు లోలోపల... కాని వంటింట్లోనుంచి ఆవిడ సణుగుడు అనే అరుపులు పైకే వినిపిస్తూ వుంటాయి... "వాళ్ళకేం మగ మహారాజులు

కాబట్టి హాయిగా ఏ హోటల్లోనో భోజనంచేసి వస్తాను. ఇంట్లో చచ్చేది ఆడవాళ్ళేగా... ఈ సంసారం చేసేబదులు ముక్కు—మూసుకుంటే మూడు ఘడియలు చాలదు...” ఈ విధంగా సాగేది వ్యవహారం. ఎంతకూ అతగాడినుంచి తిరుగు సమాధానం రాకపోయేసరికి మళ్ళీ ప్రారంభమయ్యేది స్వగతం. “పూట పూటకూ ఇన్నిన్ని బియ్యాలుపోసి అన్నం వండటం, పనిమనిషి మొహాన పొయ్యడం... దానివారు రానని చెప్పినా బాగుండును... పైగా నావల్ల ఖర్చు లెక్కువవుతున్నాయని అరుపులూ... ఉన్నారుగా కట్టుకున్నవాళ్ళు కొంపలో ఏ మాటలన్నా పడిఉండేందుకు...” ఈ విధంగా స్వగతం శృతి పెరిగేది. అప్పటికీ ప్రత్యర్థి దగ్గరనుంచి జవాబు ఉండేది కాదు.

ఇంతలో వంటింట్లోంచి చంటివాడి వీపు ఛెళ్ళుమనటం ఏమిటి, వాడు కొంప ఎగిరిపోయేలా గావుకేక పెట్టడమేమిటి ఒక్కసారి జరిగేవి... అప్పటికి నాయకుడిలో చలనంపుట్టేది. “ఛీ-ఛీ! దరిద్రపు కొంప... ఈ కొంపలో వుండటంకంటె సన్యాసుల్లో కలవటం మంచిది... ఏమొచ్చింది చంటివాణ్ని అలా చంపుకు తింటున్నావ్. నీకు ఇష్టంలేకపోతే చెప్పు నేను ఏ నూతిలోనో, గోతిలోనో దూకుతాను” అని సదరు దెబ్బలు తిన్న చంటివాడిని తాను తీసుకొని “నోరుముయ్యరా! భడవ ముండావాడా, నా ప్రాణానికి ప్రభవా విభవాలాగ పుట్టు కొచ్చారు... పీడిది మరీ రాక్షసి గొంతుక... ఊరుకోరా... మా నాన్నగా... మా తండ్రిగా... ఇదిగో బిస్కట్లు తెచ్చా తిను...” అని తాను తెచ్చిన అణా దాముబిస్కట్లు పొట్లాంలో నుంచి ఒకబిస్కట్టు తీసియిచ్చి మిగతావి జాగ్రత్తగా జేబులో

పెట్టుకునేవాడు... ఇంతలో మళ్ళీ లోపలనుంచి రికార్డు... "తినవమ్మా తిను... అబ్బడంగా అయ్యా తెచ్చిపెట్టాడు. ఇంట్లో వాళ్ళు తిండితినక చస్తున్నా వారికి అక్కర్లేదు... పోనీ తే కట్టుకున్నదానిమీద లేకపోయినా పిల్లలమీదనన్నా ఆ మాత్రం దయావుండదు. రేపు నేను చచ్చిపోయిన మర్నాడు గాని—" పిల్లలతో చెప్తున్నట్లు స్వగతం సాగిచ్చేది.

ఇంత అవాచ్యపు మాట భార్య నోటివెంట రాగానే పాపం భర్త సగం భయపడిపోయి "ఇంతలో ఏమొచ్చిందని... పట్టింట్లో కూర్చుని చాత్రిలా బ్రతుకుతేలూ. అప్పుడూ అదేం పాటు, ఇప్పుడూ ఆ సేవకులున్నా".

"నేనా— మీరా! అపార్థపడింది. 'పండగొస్తోంది పంటివాడికి కొత్త బొంకీ' అన్నా... అదేనా నేనన్న తప్పు మాట".

"అంత నెంపాదిగా అన్నావా... అలా నెంపాదిగా అంటే నాకు కోపంవచ్చేదే కాదు".

"ఏమో. మీకుమల్లే సుతారంగా మాట్లాడడం నాకు చేతకాదుమరి".

"చేతకాకపోతే నేర్చుకోవాలి".

"ఈ వయసులో నేర్చుకుంటూ... అరవై ఏళ్ళు వచ్చిన తర్వాత చదువుకోక మట్టికొట్టుకోమని. పోనీ... సుతారంగా అన్నీ తెలిసినవారు మీరు సర్దుకుపోకూడదూ".

"ఆడదానివి నీకే అంత కోపముంటే మగపురుషుడిని నాకెంత కోపం వుండాలి".

"మహా బయల్దేరారులెండి మగపురుషులు. దొడ్డిలో వేడినీళ్ళున్నాయి మొహం కడుక్కు రండి వడ్డిస్తాను".

"నీవుకూడ వడ్డించుకో వస్తాను".

"నేను తర్వాత తింటా, ముందు మీరురండి. పిల్ల లేస్తాడు".

"నీ దెబ్బతో సచ్చిసచ్చి సొమ్మసిల్లి వాడు ఎప్పుడో నిద్దరపోయాడు. ఇప్పుడిప్పుడే లేవడుగాని నీవుకూడా వడ్డించుకో. ఎన్నాళ్ళయిందో మనిద్దరం కలిసి కూర్చుని".

"అయ్యో సాహసం. అడగక్కర్లా. ఈ ప్రేమంతా పొద్దుటినుంచీ ఏమయింది".

"ఇదిగో నీకోసం పూలు తెచ్చాను".

"సిగ్గులేకపోతే సరి, ఇన్నేళ్ళొచ్చికూడా. ఉండండి నా జోలికి రాకండి".

"అయినా సుబ్బీ. నీకు మరీ కోపమెక్కువయిందే. అంతచేటా పిల్లాడిని కొట్టుకోవటం".

"ఇంకోసారి సుబ్బీ అంటే మీపని అంతకంటే ఎక్కువే అవుతుంది..."

ఈవిధంగా బావురు పిల్లుల—కాదుకాదు సుబ్బమ్మా శ్రీనివాసుల... సరసం ప్రార్త్తయ్యేది. చుట్టుపక్కలవాళ్ళు—మదురు గోడలమీద కుదురుగా కూర్చుని వింటున్నవాళ్ళు—క్రమంగా కథ కంచికి వెళ్ళిందని దిగులుపడుతూ తమ తమ గూళ్ళకు పోయేవాళ్ళు.

ఈ విధంగా, ఆ పవిత్ర దంపతులమధ్య ఎన్నోసార్లు, ఎన్నోనందలసార్లు జరుగుతూ వుండేది. ఎప్పటికప్పుడు అది

కొత్త కొత్తగా, మధురాతి మధురంగా... చేదాతిచేదుగా సరసంగా విరసంగా ఉంటూ ఉండేది. ఒకళ్ళమీద ఒకళ్ళకి ప్రేమలేక కాదు. చచ్చేటంతటి ప్రేమ. కాకపోతే వచ్చిన చిక్కల్లా ఒక్కటే. మామూలుగా మధ్యతరగతి కుటుంబాల్లో ఉండే కలిమిలేములే ఈ కుటుంబంలో కూడా ఉండి యీ యుద్ధాలకు కారణభూతాలయ్యేవి.

* * *

శీనయ్య పుట్టినప్పుడు 'అదృష్ట జాతకుడ'న్నారు. దానితోపాటే ఇతను పుట్టటంవల్ల ఎవరికో చావు మూడిందని కూడా అనుకున్నారు! కారణం, అతను మూలానక్షత్రంలో పుట్టటమే. మూలా నక్షత్రంలో పుడితే మూలనున్న ముసలి వాళ్ళ కెవరికో స్వర్గానికి ఉచితంగా పాస్‌పోర్టు వస్తుందని హిందూ జ్యోతిషశాస్త్రం ఘోషిస్తోంది.

అదృష్టజాతకు డవడానికి కొన్ని నిదర్శనా లున్నాయి. శ్రీకృష్ణదేవరాయలుకు మంత్రిగా వ్యవహరించిన తిమ్మరుసు ఉద్యోగంకోసం (మంత్రిగా ప్రమాణస్వీకారం చేయకపూర్వం) తిరుగుతూ తిరుగుతూ ఒక అడవిలో ఒక చెట్టుక్రింద పడుకున్నప్పుడు, నిద్రపోతున్న సమయంలో అతని ముఖంమీద ఎండ పొడ వచ్చిపడిందట. అప్పుడు ఎక్కడనుంచి వచ్చిపడిందో ఒక పెద్ద నాగుపాము వచ్చి అతని ముఖంమీద ఎండపడకుండా తన పడగవిప్పి, నిలబడివుందిట. ఈ విషయాన్ని ఎవరో చూసి తిమ్మరుసును లేపి "నాగుపాము నీ తలపై నాట్యం చేసి, పడగ

పట్టింది కాబట్టి నీకు త్వరలో మహాదృష్టం పట్టబోతోంది" అని చెప్పి అంతర్ధానమయ్యారట. అంటే వాళ్ళుదారిన వాళ్ళు వెళ్ళిపోయారూ అన్నమాట. సూచనగా త్వరలోనే ఆయన రాయలవారికి మంత్రి అయి పేరు ప్రతిష్ఠలు సంపాదించుకున్నాడని తిమ్మరుసోపాఖ్యానంలో అచ్చుగుద్దినట్లు ఉంది. అయితే మన శీనయ్య కథకూ దీనికీ సంబంధమేమిటి అని మీకు సందేహం కలగవచ్చు. చెప్తాను వినండి. శీనయ్య పురిటిలో వుండగానే ఒకరోజున అతని పక్కలో చచ్చిపోయిన తేలు పిల్ల పడివుంది. "అమ్మో, శీనయ్యను కుట్టి తేలు తనంతట తానే చచ్చిపోయింది కాబట్టి—ఖలునకు నిలువెల్ల విషము—" అనికొందరు, "అమ్మో, శీనయ్య చాలాగొప్పవాడవుతాడూ" అని కొందరూ సంతోషంతో నాపోయారు. "కాదులెండర్రా చచ్చిపోయిన తేలుపిల్లే వాడిని పక్కలో పడింది. ఈ యింట్లో ఇది ఆనువాయితీగా వస్తోంది" అన్నది శీనయ్య తల్లి అన్నమ్మ గారు కుర్రవాడికి దిష్టిదోషం తగలకుండా, అక్కడికి ఈ యింట్లో జనియించే ప్రతిప్రాణీ ఒక్కొక్క తేలుపిల్లను బలి కొంటోంది అన్నట్లుగా... ఏమయితేనేం ఈ రీత్యా శీనయ్య గొప్పవాడే అవుతాడని కొంతమంది నిర్ధారించారు.

శీనయ్య అదృష్టజాతకుడూ అనటానికి మరో నిదర్శనం వుంది. సుబ్బలక్ష్మికిమల్లేనే శీనయ్యకుకూడా ఒక నాయనమ్మ ఉండేది, ఉండాలిగా మరి. అందుకని ఉంది. సదరు నాయనమ్మకు బిడ్డలు లేమింజేసి (పుత్రకామేష్టియాగం చెయ్యలేదు కాని) శీనయ్య తండ్రిని దత్తత చేసుకుంది. ఆమెకు తనభర్త పోతూపోతూ దానదమన వినిమయ విక్రయాదుల హక్కులతో

క్షలు జేసి పోయిన అయిదెకరాల సుక్షేత్రమైన కాలువక్రింద మాగాణీ పొలం ఆమె హక్కు భుక్తాలలోకి వచ్చింది. సదరు అయిదెకరాల సుక్షేత్రమైన మాగాణీ భూమినీ విల్లు పూర్వకంగా ఎడమచేతి బొటనవ్రేలి ముద్రవేసి, సాక్షీ సంతకాలు జేయించి శీనయ్య తండ్రి చేతిలో అర్ఘ్యం వదలి ఆవిడకాస్తా హరీ అంది. ఆ హరీ అనటం వచ్చింది ఈ చిక్కు. హరీ అనక ఎన్నాళ్ళని ఆవిడ ఈ భూమిమీద ఉంటుంది చెప్పండి. అవతల స్వర్గంలోవున్న ఆవిడ భర్త ఈవిడకోసం పొలిమేరల దాకా రోజూవచ్చి చూసి నిరాశతో తిరిగి వెళ్ళిపోతున్నాడట. ఏదెకరాల మాగాణి ఇచ్చినవాడి నంత ఉసురుపెట్టటం బాగుండదని, అతగాడికోసమైనా "హరీ" అనాలి కాబట్టి ఆవిడ "హరీ" అంది. అది తప్పా! దానితో ఊళ్ళో దాయాదులు పేట్రేగిపోయారు. సదరు నాయనమ్మ శీనయ్య తండ్రికి వ్రాసిన విల్లు చెల్లదనీ, కాబట్టి ఆ అయిదెకరాలు తమకేవచ్చి ఆ శవానికి తామే సాముదాయకంగా దహన సంస్కారాలు చెయ్యాలీ అని పట్టుపట్టుకు కూర్చున్నారు. ప్రొద్దుటనగా పోయిన శవానికి సాయంత్రంవరకూ దహన సంస్కారాలు లేక అలా ఉమ్మడి సొత్తుగానే అట్టేపెట్టారు.

"ముసలమ్మ అయిదెకరాలూ ఎంత కొంపముంచాయిరా" అని కొందరూ "విల్లువ్రాసి తనప్రాణానికి తనే ముప్పు తెచ్చుకుంది" అని కొందరు.

అయినా వాళ్ళ బొందగాని ప్రాణానికి ముప్పు తెచ్చుకునేదేమిటి? ప్రాణం ఎప్పుడో పోయింది. మిగిలిన కట్టెకోసమేగా ఈ తగాదా... సూర్యుడు అపరాంభుధి క్రుంకబోతు

న్నాడు. చుట్టుప్రక్కల కాపురాలుఉండేవాళ్ళు శవం అక్కడ వుండగా చేసుకోకూడదని వంటలు చేసుకోలేదు. వాళ్ళ తాలూకు చంటిపిల్లలు అన్నంకోసం గగ్గోలు పెడుతున్నారు. పెద్దలు ముసలమ్మను ఆమె వారసుల్ని బూతులు తిడుతూ అంతవరకు ఉభయపక్షం అరవైసార్లు కాఫీ ఫలహారాలు చేసి ప్రాణాలు నిలుపుకుంటున్నారు. శవం అక్కడవుండగా వంటయితే చేసుకోకూడదుగాని కాఫీ ఫలహారాలకు దోషంలేదు అని మనుధర్మశాస్త్రం చూసి ఘంటాపదంగా సమర్థించుకొంటున్నారు కొంతమంది. ఇలా..వుండగా ముసలమ్మ తాలూకు దాయాద వారసులు ముసలమ్మ శవాన్ని నిలువునా సగం చేసయినా సరే, ఆమెను తాము దహనంచేసినట్లు సాక్ష్యం సేకరించుకోవాలని పట్టుపట్టుకు కూర్చున్నారు. అంత వెకరాలు పోయినా సరేగాని ముసలమ్మను సగంచేయటానికి మాత్రం వీలులేదని శీనయ్య తండ్రి గోలపెట్టాడు. చివరికి ఊరి పెద్దలంతా కలసి రాత్రి పన్నెండుగంటలకు ఉభయపక్షాల మధ్య తీర్పుచెప్పారు. ఆస్తి విషయంలో కోర్టు తీర్పుచెప్పసుంది కాబట్టి ఆ విషయం ప్రస్తుతానికి అప్రస్తుతమనీ, పోతే శవదహనం విషయంలో అసలుశవాన్ని శీనయ్యతండ్రి దహనం చేయటానికీ, ముసలమ్మను పోలిన పిండిబొమ్మను దాయాదులు దహనం చెయ్యడానికీ తీర్మానం చేశారు. ఇరుపక్షాలవారూ ఒప్పుకున్నారు. అసలు ఈ తీర్మానం ప్రొద్దుటే జరిగిపోవలసింది. మునసబు పెద్దయ్య సముఖానికి ఊళ్ళో లేదు కాబట్టి ఇంత ఆలస్యం అయింది. దాయాదులుకూడా ఆస్తి ముఖ్యం గాని ముసలమ్మ ముఖ్యంకాదుకదా అని ఈ తీర్మానానికి

పెద్దగా ఎదురుచెప్పకుండా కొంచెం ఆలోచించినట్లు నటించి ఒప్పేసుకున్నారు... మిగిలిన ఆ రాత్రి, శవందగ్గర శీనయ్య కుటుంబమే కాపలా ఉన్నారు. ఎంకొంచెం తీర్మానం అనుసరించి ముసలమ్మ శవం పెళ్ళి వాటాకే వచ్చింది కాబట్టి.

ఉదయం ఇరుపక్షాలవారూ మేళతాళాలతో సప్తకట్ల సవారీలను లేవదీశారు. ఒక సవారీపై ముసలమ్మ శవం. ఈ సవారీ శీనయ్య తండ్రి తాలూకుది. ఒక సవారీపై ముసలమ్మకు ప్రత్యామ్నాయంగా పెండిబొమ్మ. ఈ సవారీ ముసలమ్మ దాయాదుల్ది. రెండుసవారీలు బయలుదేరాయి. ఒకళ్ళు సన్నాయిమేళం పెడితే ఒకళ్ళు బ్యాండుమేళం పెట్టారు. ఒకళ్ళు కానులు శవంమీద విసిరితే ఇంకొకళ్ళు అణాలు విసిరేయటం మొదలుపెట్టారు. ఒకళ్ళు టపాకాయలు కాలిస్తే ఒకళ్ళు తారాజువ్వలు ఎగరేయటం మొదలుపెట్టారు. ఈ విధంగా ముసలమ్మ అంత్యక్రియాది మహోత్సవం బ్రహ్మాండంగా కొనసాగింది. తెలియనివాళ్ళంతా ఊళ్ళోకి ఏదో పెద్ద సర్కసు కంపెనీ రావడంగానీ, బ్రహ్మాండమైన సినిమా షూటింగ్ జరగటంగానీ అయిందనుకున్నారు. తెలిసినవాళ్ళు "ఇన్నా ళ్ళూ శవరూపంలో మురిగితె మురిగిందిగాని మొత్తంమీద ముసలమ్మ చేసుకున్న అదృష్టం యింతా అంతా కాదు. ఏ మహారాజుకూ జరగని వైభవం ఈ ముసలమ్మశవానికి జరుగు తోంది" అనుకున్నారు. ఫోటోగ్రాఫర్లు ఇరుపక్షాల అనేక పంగిల్సులో ఫొటోలు తీశారు (సాక్ష్యాలకోసం). ఈవిడ ఏదో మామూలు ముసలమ్మ అయిపోయిందిగాని లేకపోతే అంతర్జాతీయ రంగంవాళ్ళొచ్చి సినిమా తీయాల్సిన విషయం ఇది.

స్మశానం కళకళలాడుతూ కోలాహలంగా తయారయింది. ఒకే సుముహూర్తంలో రెండు చితులు ఆకాశాన్ని అంటు కున్నాయి. ఈవిధంగా ముసలమ్మ అంత్యక్రియాః ప్రథమదివసే ప్రథమ ఖండే సమాప్తః.

రెండవరోజునకూడా ఊరు ఉమ్మడి చెరువు రేవుల్లో నిత్యకర్మలు ప్రారంభమయి క్రమంగా అన్నిరోజులూ సశాస్త్రీ యంగా పూర్తిచేసుకుని ఆఖరురోజున అటునుంచిఅటే కోర్టుకు చక్కాపోయారు అందరూ.

ఇదంతా ఎందుకు చెప్పాల్సివచ్చిందంటే ఇంత పట్టు దలతో ప్రారంభమయిన ఆ కోర్టు పర్యవసానం శీనయ్యపుట్టిన మర్నాడు శీనయ్య తండ్రి పక్షమయి ఆస్తి వీరిపక్షమయింది. హైకోర్టులో సదరు అయిదెకరాలభూమినీ ఖర్చులక్రింద వెయ్యి రూపాయల్ని శీనయ్య తండ్రికి జడ్జీగారు ఇప్పించారు. ఇలా ఇప్పించినందుకు, కేసు వీరిపక్షం చేయించేందుకు శీనయ్య తండ్రి, జడ్జీగారు చేరదీసిన ఆడమనిషికి అయిదువందలరొఖ్ఖం అరకాసు మేలిమిబంగారం పెట్టిచెప్పారు. ఈ అయిదారు వందలతో కలిసి మొత్తం యీ దావాక్రింద శీనయ్యతండ్రికి అన్ని కోర్టులకు కలిసి ఆరువేలయింది. పోతేపోయాయి ముష్టి ఆరువేలు, దావా నెగ్గాడు ఆయన. ఈ సందర్భంలోనే శీన య్యను వాళ్ళ నాన్నగారు తనివితీరా ముద్దాడి "నా తండ్రి— నా బాబు, నా శీనయ్య అదృష్టవంతుడు" అని మురుస్తుంటే అవతల ఓడిపోయిన దాయాదులు "దరిద్రపు వెధవ... పుట్టాడు" అని నామకరణం చేశారు.

ఆ రాత్రి శీనయ్యను వాళ్ళ నాన్న ముద్దుపెట్టుకుంటున్న సమయంలో గుండెలో పోటొకటి కలుక్కుమంది. పిల్లవాడిని మంచంమీద పడుకోబెట్టి ఆయన సర్దుకు కూర్చోబోయాడు. మరికొంచెం నొప్పి ఎక్కువయింది. క్షణాలలో "ఊపిరాడటం లేదు" అన్నాడు శ్రీనివాసుని తండ్రి. అక్కడికీ పేరునెయ్యి, వంటాముదం ఎదుర్రొమ్ముకు, వీపుమీద రాయించి తోమించుకున్నాడు. సూర్యాస్తమయం అయిన తర్వాత పట్టిన నొప్పి సూర్యోదయం కాకపూర్వమే శీనయ్య తండ్రిని పొట్టన పెట్టుకుంది. "మూలానక్షత్ర ప్రభావం" అన్నారు కొందరు జ్యోతిష్కులు.

"దాయాదులు చేతబడి చేయించారు" అన్నారు మరికొందరు సాక్షులు.

"హార్టు కంప్లైయింటు" అన్నాడు నేటివు డాక్టరు. ఏదయితేనేం అతగాడు శీనయ్యకు కాకుండా వెళ్ళిపోయాడు.

అసలు దావా గెలిచి వచ్చేటప్పుడే స్మశానం పక్కగా కాలిదారిన నడిచి వచ్చేటప్పుడు చిన్న కాలువ—అంటే పంటబోదె—దాటేటప్పుడే వీపుమీద ఝల్లుమని గుండె గుభిక్కుమన్నదట. "దావా గెలిచినందుకు తన పెంపుడుతల్లి ఆశీర్వదించింది గాబోలు"నని సరిపెట్టుకున్నాడు ఆ మాతృభక్తి సంపన్నుడు. ఆ ఆశీర్వాదన చాలదో అన్నట్లు ఇరవైనాలుగు గంటలు తిరక్కుండానే తనవద్దకు దత్తత కుమారుడిని రాబట్టుకొంది శీనయ్య నాయనమ్మ. అయితే ఆవిడ పోయినప్పుడు అలండొలత్తులతో అంత్యక్రియలు జరుపుకుంది. ఈయన ఏ

చప్పుడు లేక, తీసుకెళ్ళేవారే లేక గుట్టుచప్పుడుగా చచ్చి పోయారు.

"శీనయ్యా అదృష్టవంతుడు. ఇక అతనికి తండ్రిపోరు లేదు" అనుకున్నారు ఊళ్ళోని కొంటె కోణంగులు.

శీనయ్యా తల్లిమాత్రం "ఇక తనకీ జన్మలో పిల్లలు పుట్టే యోగం లేదుకదా" అని శీనయ్యానే ఆడపిల్లగానూ, మగపిల్లవాడుగానూ చూసుకుంటూ అటు అయిదేకరాలనూ, ఇటు శీనయ్యాను అపురూపంగా చూసుకుంటోంది. తన దిన వారపు ఖర్చులు తానకుతనే సంపాదించుకున్నాడా అన్నట్లుగా కోర్టువారు ఖర్చులక్రింద యిచ్చిన వెయ్యిరూపాయలలో జడ్జీ గారి ఇలాకా మనిషికి యిచ్చిన అయిదువందలుపోను మిగతా అయిదువందలూ ఆయన దినవారాలకే ఖర్చయ్యాయి. గో దానంతోసహా బొటా బొటిగా సరిపోయాయి ఆ అయిదు వందలూ.

శీనయ్యామాత్రం శుక్లపక్ష చంద్రుడిలాగ పెరుగుతూనే ఉన్నాడు. రోజుకు నాలుగుసార్లు దిష్టితీసేది వాళ్ళమ్మ... కొడుకు విద్యలూ, మాటలూ చూచి మురిసిపోయేది ... ... అత్తా, తాతకు బదులు శీనయ్యా నోటినుంచి మొదటి మాటలు. "తంతా ... తంపుతా" అని ... అమ్మను తన్నేకాలేదిరా అంటే పిడికాలు ఝూడించి చూపెట్టేవాడు. ఆ విద్యలన్నీచూసి వాళ్ళమ్మ ఎంత మురిసిపోయేదో ... "వాళ్ళ నాన్నే వుంటే ఎంత సంతోషించేవారోకదా" అని మధ్యమధ్య చనిపోయిన భర్తను తలచుకుని ఊరికే ఇదయిపోయేది.

* * *

అన్నమ్మగారికి అన్నీ కష్టాలే అయ్యాయి. అన్నమ్మ గారంటే శివయ్యగారి తల్లి. ఇప్పటి రోజులులాగ కాదుగా అప్పటిరోజులు. అప్పటి రోజులు సత్యకాలపు రోజులు. అన్నమ్మగారు సత్యకాలపుమనిషి. ఆడవాళ్ళూ, మగవాళ్ళూ ఒకటేననీ, సమానహక్కు లుండాలని పాపం ఆమె ఎప్పుడూ కోరుకోలేదు. ఎంత చెడ్డా ఆడవాళ్ళు ఆడవాళ్ళే; మగవాళ్ళు మగవాళ్ళేనని ఆవిడ అభిప్రాయం. గృహిణిగా ఆవిడకు మహా మంచి పేరే వుండేది. అర్థరాత్రి, అపరాత్రి, అతిథి అభ్యాగతి ఎవరువచ్చినా విసుక్కోకుండా కసురుకోకుండా ఓపిగ్గా వండి పెట్టేది. ఈ కాలపువాళ్ళకుమల్లే "హోటలుకు పొమ్మందురూ నా నడ్డి నిన్నటినుంచి నములుతోంది" అని ముక్కు చీదుకు నేది కాదు. కాని సంలాభం, అటువంటి ఇల్లాలుకే వచ్చాయి కష్టాలు. ఇక ఆయింటికి మగదిక్కు ఆడదిక్కూకూడా ఆవిడే. ఆ యింటిలోవున్న మగ మహారాజు పదాదివయసు శివయ్య ఒక్కడే. అతగాడు బతికి బట్టగట్టి మైనారిటీ తీరితేనేగాని అన్నమ్మగారి కష్టాలు ఒడ్డుకెక్కవు.

భర్త పోయిన మొదటి సంవత్సరం వ్యవసాయం కామాటం తనకు తెలియక క్రొత్తగా విధవరాలయిన కారణం వల్ల పాపం ఆవిడ ఈ బాదరబందిపడలేక పొలాలు కట్టుబడికి యిచ్చింది. దాని తస్సదియ్య ఆ సంవత్సరమే సకాలానికి వర్షాలు కురిసి చుట్టుప్రక్కల వాళ్ళకు పాతిక బస్తాలు కాడికి పండితే కౌలుదారులు కౌలు తీసుకున్న అన్నమ్మగారి అయి దెకరాలుమాత్రం ఎకరానికి ఆరుబస్తాలు మాత్రమే పండా యట. ఈ విషయం కౌలుదారు స్వయంగా ఒప్పుకున్నమాట.

సరే ఏమయితేనేం ఖర్చులు, శిస్తులూ పోనూ అన్నమ్మగారి వాటాకు వచ్చినవి పదిహేను బస్తాలు అనబడే పదిబస్తాలలో తప్పాతాలూ తీసివేయగా నికరంగా తేలినవి అయిదుబస్తాలు. ఇందులో ఒకటిన్నర ప్రాణులూ—అన్నమ్మా, శీనయ్యాలూ—అతిథీ అభ్యాగతీ బ్రతకాలి.

ఈ బాధ పడలేక మరుసటి సంవత్సరం అన్నమ్మగారు తానే స్వయంగా నడుంకట్టి స్వంతంగా చేయించడానికి వ్యవసాయరంగంలోకి దిగింది. గవర్నమెంటు కొత్తగా పెట్టిన చట్టం ప్రకారం రైతులు ఆ పొలంలోనుంచి లేవమని పట్టు పట్టారు. పాపం అన్నమ్మ యేం చేస్తుంది.

ఆ వూళ్ళోకల్లా ఆశ్రితజన వత్సలుడు అనాథులపాలిటి కామధేనువూ, కల్పవృక్షమూ అయిన మునసబు పెద్దయ్య దగ్గరకు అన్నమ్మగారు స్వయంగా వెళ్ళి "నీవేతప్ప నితఃపరం బెరుగ మన్నింపం దగున్ దీననున్" అని శరణు పొందింది. ఆయన అన్నమ్మగారి రైతుల్ని వరసవారీగా రావించి బోలెడు పూకలేసి ఆవిడపొలం ఆవిడకిప్పించాడు. "ఆయనగారు బ్రతికుంటే తనకీ తిప్పలుండేవి కావుకదా" అని అన్నమ్మగారు అనేకసార్లు చాటుకుతిరిగి కళ్ళద్దుకునేది... "యేం చేస్తాం! కష్టాలు మనుష్యులకు కాక మానులకొస్తాయా" అని మళ్ళీ తానే సమాధానం చెప్పుకొని ధైర్యంతో ముందంజ వేసేది.

పాపం! చచ్చి ఏ స్వర్గాన వున్నాడో ఆ మునసబు పెద్దయ్య వ్యవసాయానికి పెట్టుబడి పెట్టాడు. (పెట్టుబడిపెట్టిన పదాదిలోగా పాము కరచి చచ్చిపోయాడాయన) దానితో బండీ, ఎడ్లూ కామాటం యేర్పరచుకుని వొక నమ్మకమయిన

పాలేరును పెట్టుకుని స్వయంగా రాత్రనకా, పగలనకా పొలాలకు పోయి, కుప్పల్లో కాపలా పడుకుని వ్యవసాయం చేయించింది. ఏ మగవాడూ చేయించని విధంగా చేయించింది. విత్తులు స్వయంగా దగ్గరుండి చల్లించేది. కోతలకు, ఊడ్పులకు స్వయంగా కూలీలను మాట్లాడుకుని దగ్గరుండి పని చేయించి డబ్బు లెక్కకట్టి యిచ్చేది. కుప్ప నూర్పిళ్ళలో కళ్ళందగ్గరే మడికట్టుకుని బండి క్రింద అడ్డు కట్టుకుని అన్నం వండుకుని తిని కాపలావుండి స్వయంగా బస్తాలతోపాటు తాను యింటికి వచ్చేది. ఆ సంవత్సరం అయిదెకరాలమీద వంద బస్తాలు కళ్ళచూసింది. అప్పటినుంచీ ఆవిడ ఎవరినీ నమ్మకూడదని ఒట్టువేసుకుని తన పనులన్నీ తానే స్వయంగా చూచుకోవటం ప్రారంభించింది.

ఈ సందర్భంలో ఆవిడ కొన్ని చిక్కులు యెదుర్కోక తప్పలేదు. ఎప్పుడూ యిల్లు వదిలి బజారుల్లో ఏదో పనిమీద తిరుగుతూ వుండేదేమో, ప్రయాణాలు చేయటానికి బయలుదేరేవాళ్ళకు, జబ్బు నిమిత్తమై ఆసుపత్రికి వెళ్ళేవాళ్ళకూ, అమ్మాయిని తొలిసారిగా అత్తారింటికి పంపేటప్పుడు యీవిడ ఎదురుగా రావటం వాళ్ళు కొంతమంది పైకీ, కొంతమంది లోలోపల తిట్టుకోవటం జరిగేది. ముఖ్యంగా కోర్టులకెళ్ళే వాళ్ళూ, పరీక్షలకెళ్ళే విద్యార్థులూ ఆవిడను ఎదురుగుండానే తిట్టేవారు.

"ఏం చేస్తాం. కష్టాలు మహామహా సినిమా తారలకే తప్పలేదు" అనేది ఆవిడ. అంటే ఆవిడ ఉద్దేశ్యం తాను సినిమా తారలతో సమానమని కాదు. ఆవిడ— రోజులు

బాగున్న రోజుల్లో—భర్తతో కలిసి సినిమాకు వెళ్ళింది... అంటే పెళ్ళయి కాపురానికి వచ్చిన కొత్తలో... ఆ సినిమాలో ఒక తార జుట్టు పీక్కోసుకుని "దేముడు లేడూ... సత్యం జయించదూ" అని బజారుల వెంట పడింది. ఆ దృశ్యం చూచి అన్నమ్మ కడుపు చెరువయ్యేటట్లు వెక్కి వెక్కి ఏడుస్తుంటే ప్రక్కనున్న భర్త "ఊరుకోవే. అదంతా ఉత్తుత్తి పిచ్చిలే. ఆవిడ నటిస్తోంది. అట్లా నటిస్తే ఆవిడకు వేలకువేలు ఇచ్చిస్తారు" అని సముదాయించి, ఓపలేనిమనిషిని బుద్ధితక్కువయి ఇటువంటి సినిమాకు తీసుకువచ్చానని పక్కవాళ్ళు చూడకుండా చాటుగుండా లెంపలేసుకున్నాడు. అప్పటినుంచీ ఆవిడకు ఒక పిచ్చినమ్మకం. సినిమా తారలు ఏడిచో, పిచ్చిపట్టించుకునో వేలకువేలు డబ్బు సంపాదిస్తారనీ అయినా వాళ్ళకుకూడా కష్టాలుంటాయనీ... అందుకనే ఎవరయినా, ఏమయినా కష్టాలగొడవ తనవద్ద తెచ్చినప్పుడల్లా అమాయకంగా "మహామహా సినిమాతారలకే కష్టాలు తప్పవు" అని తననుకూడా ఆ సినిమా తారలతో పాటు పోల్చుకుంటుంది.

ఏమయితేనేం తన కడుపున కాసినకాయ శీనయ్యాను వృద్ధిలోకి తీసుకువస్తోంది అన్నమ్మగారు. శీనయ్యాకు వొక శుభ ముహూర్తంచూచి అక్షరాభ్యాసం చేసింది. ఆనాడు శీనయ్యా చేసిన భాగోతం ఇంతా అంతాగాదు. మొదటిలో మామూలుగా కొత్తబట్టలు కట్టుకొని, జల్తారుటోపీ పెట్టుకుని, పూర్వాచారం ప్రకారం పంగనామాలు తీర్చిదిద్దుకుని, మరమరాలు, శనగపప్పూ, పచ్చిమిర్చరు జేబులో పోసుకుని, ఎగపీల్చుకుంటూ తోటి విద్యార్థులతో ఉపాధ్యాయుల్తో బడికి

వెళ్ళటం చాలా బాగుందతనికి. అతనొక యువరాజుగానూ, చుట్టూవున్న విద్యార్థులు తుపాకీబ్రోతలుగానూ, ముందు నడిచే ఉపాధ్యాయులు అంగరక్షకులుగానూ కనిపించారు అన్నమ్మ దృష్టికి. నాయనకు ఒక జోడుగుర్రాల బగ్గీ వుంటే అచ్చం రాజకుమారుడు (సినిమాలో రాజకుమారుడు) గానే ఉంటాడనుకుంది. "ఈ ఏడు పంటల్లో గుర్రపుబగ్గీకి బదులు మూడు చక్రాల సైకిలన్నా కొనిపెట్టాలి" అనుకుంది. అంత ఆనందంలోనూ భర్త జ్ఞాపకానికి వచ్చి "ఆయనేవుంటే ఎంత సంతోషించేవారోగదా" అని కొంగుతో ముక్కు తుడుచుకుని కళ్ళ నద్దుకోకపోలేదు. కళ్ళు పూర్తిగా తెరిపినపడలేదు గావుకేకలు పెట్టుకుంటూ కొడుకు వాయువేగంతో పరుగెత్తుకొస్తున్నాడు. కొత్తపలక క్రిందపడి వెయ్యిబద్దలైంది. బలపం కేరాఫ్ ఎడ్రసు తెలియనే తెలియదు. జల్తారు టోపీ దారిలో ఎక్కడో పడిపోయింది. నామాలరంగు మొహమంతా పూసుకుని అనాకరకంగా కనుపిస్తున్న కొడుకు, శివలింగాన్ని కౌగిలించుకునేందుకు యమధర్మరాజు దగ్గరనుంచి పారిపోయివచ్చే మార్కండేయుడులాగ కనుపించాడు. పిల్లవాడి వెనక పేకబెత్తంతో కేవలం యమధర్మరాజులాగ అంగరక్షకులలో ఒకడైన మాష్టరు వగర్చుకుంటూ వస్తున్నాడు. "ఏమిటండీ! ఏం జరిగింది?" అడిగింది అన్నమ్మ. ఆ అడగటంలో శంకరుడులాగ కోపమూ లేదు, చేతిలో త్రిశూలమూ లేదు. తాపీగా, నాఫీగానే అడిగింది. ఆ మేష్టరు మాత్రం ఉక్రోషం పట్టలేక శివాలు తొక్కుకుంటూ "చూడండి మీవాడు నా చెయ్యి ఎలాకొరికాడో. ప్రక్కనున్నవాడిచేతిలోనుంచి అణాడబ్బులు

లాక్కున్నాడట. వాడు లబోదిబోమనిగోలకెత్తుతుంటే 'అలా చెయ్యొచ్చునా, తప్పుకాదూ' అని చెయ్యి పట్టుకున్నా. అంతే. నా చెయ్యి గట్టిగా కొరికి పట్టు తప్పించుకుని అదే పనిగా తూనీగలాగా పారిపోయి వచ్చాడు" అని తన నిర్దోషిత్వాన్ని, పిల్లవాడి దోషిత్వాన్ని నిరూపించుకుంటూ ఉపన్యసించాడు అంగరక్షకుడు.

అన్నమ్మ చిన్న చిరునవ్వు నవ్వి "తప్పుకాదు నాయనా! అలా చేయొచ్చా?" అని తాపీగా "చూడండి మేస్టారూ! వాడు చిన్న సన్నాసి. మొదటిలోనే వాడలగొట్టకండి. మా వంశానికి వాడొక్కడు. వాడు చదువుకుని పెద్దవాడై మా వంశాన్నుద్ధరించాలి. ఇదిగో ఈ రెండు రూపాయలూ తీసుకుని వాడిజోలికి ఎవరూ రాకుండా చూడండి. వాడికి గురువైనా మీరే, తండ్రయినా మీరే" అంది యథాలాపంగా.

రెండు రూపాయలూ ఆనందంతో తీసుకుంటున్న పూస్టారు, చివరిముక్క 'తండ్రయినా మీరే' అనేది విని కంగారుపడి, గ్రుడ్లు తేలవేసి గ్లాసెడు మంచినీళ్ళు త్రాగి కుర్రవాడిని తీసుకుని అదే పరుగు పాపం! అన్నమ్మగారు కూడా ఏదో యథాలాపంగా మాటవరసన అన్నముక్క అది.

మొదటిలో శీనయ్య బళ్ళోకివెళ్ళటానికి ముప్పుతిప్పలు పెట్టేవాడు. పోలేరమ్మ జాతరకు మేకపోతును తీసుకెళ్ళినట్లే వుండేది. పిలుచుకు వెళ్ళడానికి వచ్చిన పిల్లల వీపుమీద పిడిగుద్దులు పడేవి. బలవంతాన చేతులమీద అయిదారుగురు కలసి మోసుకు వెళుతుంటే కొంతమందికి మొహంమీద,

కొంతమందికి వీపుమీద, కొంతమందికి కళ్ళమీద, దెబ్బలు, రక్కులు, కొరుకుళ్ళు ఇత్యాది అనేకం జరిగేవి. కారణం ఏమిటంటే శీనయ్యకు మేష్టర్ను చూసినా, బడిని చూచినా ఏదో చెప్పరాని భయం. అందుకుకూడా కారణం లేకపోలేదు. అతను చూస్తూవుండగా ఒక కుర్రవాని వీపుమీద మాష్టారు చేతిలోని ఈతచువ్వ ముక్కలు ముక్కలు అయింది. పనిలో పనిని అప్పుడే ఆ సమయంలోనే శీనయ్యకుకూడా మాష్టారు వార్నింగు ఇచ్చాడు "ఒరే శీనయ్యా! అక్షరాలు సరిగ్గాదిద్దక పోతే తల్లక్రిందుగా కోదండం తీయించి క్రింద ఎండు మిరప కాయల పొగ పొడతా" అని. మొదటిలో శీనయ్యకు కొంత అర్థమయి కొంత అర్థంకాలేదు. పక్కవాడిని రహస్యంగా చాటుకు పిలిచి ఒక పిప్పరమెంటు బిళ్ళ లంచం ఇచ్చి అడి గాడు, "కోదండంఅంటే ఏమిటి?" అని. వాడు దానినిగురించి బాగా అనుభవం వున్నవాడిలా వన్నెచిన్నెలుగా, భయంక రముగా విడమర్చి చెప్పి పర్యవసానముగా కోదండం తీయిస్తే తీసుకుతీసుకు చచ్చిపోతాడని చెప్పాడు. అంతే ఆ క్షణంను నుంచీ శీనయ్యకు ఎక్కడలేని భయం పట్టుకుంది. బ్రతికుంటే బలుసాకు తినవచ్చుననీ, అక్షరాలు రాకపోయినా అయ్యా యిచ్చిపోయిన అయిదెకరాలూ ఉన్నాయి కాబట్టి ఫరవా లేదనీ, తన తల్లికి తాను ఒక్కడే కొడుకని ఆలోచనపుట్టి స్కూలుకు రావటానికి ససేమిరా అని మూడంకె వేసుక్కూ ర్చున్నాడు. పైగా ఆ బళ్ళో చదువుచెప్పటం కంటే మేస్టారు భార్య ఆజ్ఞ ఇచ్చినప్పుడల్లా బాదంచెట్టుఎక్కి ఆకులుకోయడం వగైరా పనులు చేయాల్సివచ్చేది. మొత్తంమీద ప్రతిరోజూ

కొడుకుపడే యమయాతన చూసి, నెలరోజులయినా రెండక్షరాలన్నా రాకపోవటం చూసి అన్నమ్మ ఆ స్కూలు మాని పించి యింకో స్కూలులో చేర్పించింది.

ఆ స్కూలులో అంతా బాగానే వుంది. పిల్లవాడిని ఏడిపించటం లేదు. బాగానే ఉందనుకుంది అన్నమ్మగారు. కొన్నాళ్ళు గడిచిపోయిన తర్వాత పిల్లవాడి చదువు ఎంతవరకూ వచ్చిందో పరీక్షించాలని బుద్ధిపుట్టింది ఆవిడగారికి. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడిని పిలిపించినట్లు పుత్రరత్నాన్ని రప్పించి, పరీక్షించడం ప్రారంభించింది. ప్రహ్లాదుడి పలుకులు విని హిరణ్యకశిపుడు మూర్ఛపోయాడో లేదో తెలియదుగాని అన్నమ్మగారు "హా... హతోస్మి" అని మూర్ఛపోయింది. కారణం పుత్రరత్నం ఉపయోగించేమాటలు... లెగిసి, కూకుని, డబ్బియ్యాలు, ముప్పయ్యిరెండు, యాంటుండి అమ్మగారూ— ఇత్యాది పదజాలం. "స్వచ్ఛమైనభాష వదిలి ఇదేంరోగంరా నీకూ" అంది. "అదంతేలే. మా పంతులమ్మ అలాగే చెప్తారు. ఆవిడకంటే ఎక్కువ తెలుసా నీకు" అన్నాడు పుత్రరత్నం. అన్నమ్మగారికి మతిపోయింది. ఏం చేయాలో తోచలేదు. ఇంకా కొన్నాళ్ళు వీడిని ఇలాగే చదివిస్తే ఏనుగుల చేత త్రొక్కించినా, పాములచేత కరిపించినా ఆ పదజాలం ఉపయోగించడం మానడని వెంటనే ఆ స్కూలునుంచి మాన్పించివేసింది. అయ్యగారికి అప్పుడే రెండు స్కూళ్ళయ్యాయి.

ఆ ఊళ్ళోనే పాతపద్ధతి ఇంగ్లీషు మీడియం స్కూలు ఉందని తెలిసి అందులో చేర్పించింది. స్కూలుకు ప్రొద్దున

వెళ్ళిన పిల్లాడు సాయంకాలానికి తిరిగివచ్చి "అమ్మా, ఏభయి రూపాయలు ఉంటే ఇయ్యి. స్కూలులో కట్టాలి" అన్నాడు.

అన్నమ్మగారికి మతిపోయింది. "నాలుగో క్లాసుకు ఏభయి రూపాయలు జీతం ఏమిట్రా?" అని అడిగింది.

"అది కాదమ్మా, స్పెషలు డ్రస్సుకు ముప్ఫయి రూపాయలూ, పుస్తకాలకు ఇరవై రూపాయలూ. జీతం యింకా నాలుగురోజులు పోయినతర్వాత కట్టవచ్చుట" అని చెప్పాడు.

"ఈ ఏభయి కాక ఇంకా జీతంకూడా ఉంది. అది ఎంత నాయనా" ఆవిడగారు విస్తుపోయి అడిగింది.

"ఏమో నాకేం తెలుసు. నోటీసుబోర్డులో ఉంటుంది. చూసుకో" అన్నాడు ప్రయోజకుడైన కొడుకు.

ఆ నోటీసుబోర్డు అంటేఏమిటో, అది ఎక్కడుంటుందో ఆవిడకేం తెలుసు. "నోటీసుబోర్డు" అన్నపదం ఒకటి ఒక సారి తాలూకా ఆఫీసులో చూసింది. "ఏడి స్కూలుకూ, దానికీ సంబంధమేమిటో" ఎంత ఆలోచించినా ఆవిడకు అంతు పట్టలేదు. అదీకాక తన చిన్నతనంలో పెద్దబాలశిక్ష, సుమతీ శతకం, పలకా, బలపం అన్నీకలిపి ఒక రూపాయలో వచ్చేవి. అప్పటి చదువా బ్రహ్మాండంగా వుండేది అయిదోక్లాసు చదివిన తాను వడ్డీలెఖ్ఖలుకూడా కట్టేది. ఈ నాలు[illegible] వాడికి ఇరవై రూపాయల పుస్తకాలేమిటో, అ[illegible] కెళ్ళడానికి ఒక [illegible] లేమోనని అన్నమ్మగారు హడలి[illegible]

ఈవిధంగా శీనయ్య చదువు అంచెలవారీగా సాగుతూ వచ్చింది. కొంతకాలమయిన తర్వాత సీనయ్య బాగా చదువు మీద మనస్సు లగ్నంచేసి చక్కని ఫస్టుమార్కులు సంపాదిస్తూ వచ్చాడు. చదువు వృద్ధిఅయినకొద్దీ ఖర్చు ఎక్కువయి చదివించడానికి అన్నమ్మగారు అవస్థపడుతూ ఉండేది. పిల్లవాడుకూడా బుద్ధి కుదిరి చదువుతున్నాడు. అటువంటివాడిని చూస్తూచూస్తూ మాన్పించడం ఆవిడకు యిష్టంలేకపోయింది. ఎవరో సలహా యివ్వడంవల్ల గవర్నమెంటువారు బీదవారికి స్కాలర్‌షిప్పు యిస్తారని తెలిసి అడ్డమైనవాళ్ళ కాళ్ళు పట్టి ఆ దరఖాస్తు పెట్టుకుంది. ఆ స్కాలర్‌షిప్పువస్తే ఈ బీదతనంలో కొంత కలసివస్తుందనీ, పిల్లవాడి చదువు నిరాఘాటంగా సాగిపోవచ్చుననీ ఆశపడింది పాపం ఆవిడ. కాని దైవం ఇంకోవిధంగా తలచి వారం రోజులలో తిరిగి సమాధానము వచ్చింది, "మీ పిల్లవాడు షెడ్యూలుక్యాష్టుకు చెందినవాడు కాదు గనక యివ్వటం లేదనీ, ఆ స్కాలర్‌షిప్పు మరొక షెడ్యూలుక్యాష్టు కుర్రవాడికియివ్వబడిందనీ", ఆ షెడ్యూలు క్యాష్టు కుర్రవానిది ఆ ఊరే. వాళ్ళకు యాభయి ఎకరాలపొలం వుంది. తండ్రి కాంట్రాక్టులు చేసి బాగా సంపాదిస్తున్నాడు. ఇదంతా తెలిసి అన్నమ్మగారు "తన కుమారుడు షెడ్యూలు క్యాష్టులో పుట్టనందుకు" విచారించింది. అప్పటికీ షెడ్యూలు క్యాష్టుకు, బీదరికానికి సంబంధం ఏమిటో ఆవిడకు ఎంత ఆలోచించినా అర్థంకాలేదు......

* * *

ఇంత మనిషి శీనయ్యకూడా శ్రీనివాసరావయ్యాడు. శ్రీనివాసరావుల్లో అటువంటి ఇటువంటి శ్రీనివాసరావుకాదు, డొక్కపగిలే శ్రీనివాసరావయ్యాడు. శ్రీనివాసరావు పేరు చెపితే కాలేజీ కుర్రాళ్ళందరికీ హడలే. ఫుట్‌బాల్ ప్లేయరు, బాడ్‌మింటన్ ఛాంపియన్: చెస్‌కూడా వస్తాడు. ఇన్నివుండీ చదువు లేదనుకునేరు. ఒకటోరకం మార్కులతో స్కూలు ఫైనలు ప్యాసయి, కాలేజీలో చేరాడు. ఒకనాడు ఒక సందర్భమొచ్చి స్టేజీమీద ఒక దేవనాతరం వేసేసరికి జనం “ఆహా శ్రీనివాసరావూ” అన్నారు. తత్ఫలితంగా అతను కాలేజీ డ్రామెటిక్ శాఖకు సెక్రటరీ అయ్యాడు. సెక్రటరీ అయినరోజున రాత్రి అతనికి చిన్నప్పుడు తన వూళ్ళో జరిగిన ఒక విషయం జ్ఞాపకమొచ్చి విరగబడి నవ్వుకున్నాడు...

వాళ్ళ ఊళ్ళో కుర్రవాళ్ళంతా కలిసి ఒక నాటకం వెయ్యాలని పట్టుదలపట్టారు. ఇరవైమంది శిష్యులుచేరి చందా వేసుకున్నారు. పద్యాలు బాగా వుంటాయనీ, గిలకరించి రాగాలు తీయొచ్చనీ ఆలోచించి ‘పాండవ ఉద్యోగవిజయాలు’ తీశారు. నెలజీతంమీద ఒక హార్మనిస్టును ఏర్పాటు చేసుకున్నారు. కాని ద్రౌపదిపాత్ర ఎవరు వెయ్యాలా అన్న ప్రశ్న వచ్చింది. ఎవరూకూడా “నేను వెయ్యను అంటే నేను వెయ్యను” అని భీష్మించుకు కూర్చున్నారు. చివరికి, చందాడబ్బు కట్టక్కర్లేని షరతుమీద ఒకడిని ఏర్పాటు చేసుకున్నారు. అతని విగ్రహం మంచి విగ్రహమే; వేషంకూడా బాగానే నప్పుతుంది. వచ్చిన చిక్కల్లా కొద్దిగా నత్తి. “ఫరవాలేదు చిన్న దోషమే

కదా, హోర్లను కొంచెం తగ్గిస్తే సరి" అని సరిపెట్టుకుని అతన్ని చేతనే ద్రౌపది వేయించడానికి నిశ్చయించుకున్నారు. అంతకు తప్ప గత్యంతరం లేకపోయింది. అలా రెండు, మూడు నెలలు, ఇంకా నిజం చెప్పాలంటే నాలుగునెలలు, రిహార్సల్సు చేసి నాటకం "తయారు" అనిపించుకున్నారు. ఈ నాల్గు నెలలలో హార్మనిస్టు అవస్థ పరమాత్మకు తెలుసు. ఒక్కడి గొంతుక హార్మనీతో కలిస్తే ఒట్టు. ఎలాగయితేనేం నాలుగునెలలకు ఒక దారికి వచ్చినట్లనిపించారు. నటకులసంగతి ఏమోగాని ఊళ్ళో ప్రతి పశువుల కాపరికి వచ్చేశాయి పద్యాలు. ఆ నాలుగు నెలలూ ఊళ్ళోవాళ్ళకు— ముఖ్యంగా రిహార్సల్సు రూముకు దగ్గరగావున్న ఇళ్ళవాళ్ళకు— కంటిమీద కునుకుంటే ఒట్టు. ఈ నాటకాన్నిగురించి నాటకం వెయ్యకుండానే జనం అంతా విసిగిపోయారు కాబట్టి ఇక ఆ వూళ్ళో నాటకంపడే యోగం లేకపోయింది. అదీ కాకుండా ఆ వూరిలోని వారంతా ఏదో విధంగా ఆ ఇరవైమంది నటకులకూ చుట్టాలే కాబట్టి వాళ్ళ పేర్లు చెప్పుకుని ఎప్పుడో ఒకప్పుడు రిహార్సల్సుకువచ్చి నాటకం చూసేశారు. ఎంతసేపు చూసినా కృష్ణపాత్రధారిలో కృష్ణుడు కనిపించటంలేదు; వెంకటసుబ్బయ్యే కన్పిస్తున్నాడు వాళ్ళకు. నాటకం పూర్తయింది కాని, ఊళ్ళో ప్రదర్శించి చూపెడదామంటే గ్రామస్థులు "ససేమిరా వీల్లేదు" అంటున్నారు. ఎలామరి?... ఇంతలో వీళ్ళ అదృష్టం బాగుండి ఆ ఊరి సమీపంలో ఒక లారీ ఏక్సిడెంటయి ఆ డ్రైవరు కాస్తా గుటుక్కుమన్నాడు. ఈ శుభవార్త తెలియటంతోటే ట్రూపు ఆర్గనైజరు ఎగిరి గంతేసి సరాసరి అతని కొడుకు దగ్గరకువెళ్ళి

కొంచెంసేపు సముదాయింపు మాటలు చెప్పి తర్వాత అసలు విషయం బయటపెట్టాడు. "చూడు నాయనా! మీ నాన్న ఇన్నాళ్ళు లారీసర్వీసుచేసినా ఇంటిలో తన దినవారపు ఖర్చుల కయినా అణా డబ్బులు మిగల్చకుండా చనిపోయాడు. ఇప్పుడు ఆ దినవారాలు చేయాల్సిన పని ఎలాగూ నీమీద పడింది కాబట్టి ఒకపని చెయ్యి. ఎక్కడయినా ఒక ఏభయి రూపా యలు అప్పు తీసుకొచ్చి ఖర్చులకుగాను మా చేతికి యిస్తే మేము మీకు బెనిఫిట్ నాటకం ఆడిపెడతాము. టిక్కట్లు నీవు కాన్వాసుచేసి అమ్ముకో. వచ్చినదానిలో నీ ఏభయి రూపా యల అప్పుతీర్చి హాయిగా దేవేంద్ర వైభవంగా మీ నాయన దినవారాలు పూర్తిచేసుకో" అని సలహా ఇచ్చాడు. దానితో ఒకే దెబ్బకు రెండు పిట్టలు పడతాయని అతని ఉద్దేశ్యం. ఒకటి తమ ఖర్చులతో కాకుండా మంది ఖర్చుతో నాటకం వేసి మగవాళ్ళ మనిపించుకోడం, రెండోది బీదపిల్లవానితండ్రి అంత్యక్రియా మహోత్సవానికి సాయపడ్డట్టుండటం. ఆ కుర్ర వాడికికూడా అది నచ్చి తలతాకట్టుపెట్టి ఏభయి రూపాయలు అప్పుతెచ్చి వాళ్ళ చేతుల్లో పోశాడు...

ఆనాడే నాటకం ఆడేరోజు. ప్రతి లారీ తాలూకు డ్రైవరూ, క్లీనరూ రావడం, "పాపం, మీ నాయన పోయా డటగా, ఎంత మంచివాడు. స్టీరింగు చేతపడితే చక్రంపట్టిన శ్రీ మహావిష్ణువులాగా ఉండేవాడు" అని అంటూనే లోపలికి వెళ్ళి హాలులో కూర్చోవటం మొదలుపెట్టారు అందరూ. ఎరిగినవాళ్ళు కావటంవల్ల ఎవళ్ళనీ టికెట్టు లేకపోయినా,

నిక్కచ్చిగా కాదనలేకపోయాడు. తండ్రిపోయిన దుఃఖం కన బరుస్తున్న టైములో ఎలా నిక్కచ్చిగా అడుగుతాడు. హాలు నిండిపోయింది. కలెక్షను మూడు రూపాయల అరణాలు వచ్చింది.

ఇది ఇలా ఉండగా కృష్ణపాత్రధారి లాస్టు బస్సుకు వస్తానన్నవాడు రాత్రి పదయినా రాలేదు. ఇన్నాళ్ళనుంచీ ఊరుకుని అవాళే వాడి నాయనమ్మకు జబ్బు ఎక్కువయింది. "మసిమీని ఆ వరస పెట్టుకుని నాటకాలు కావలసివచ్చాయా" అని తండ్రి తిట్టడంవల్ల వాడు "మిగతావాళ్ళను పొమ్మనీ, తాను సాయంత్రం చేలోకి వెళ్ళినట్లు వెళ్ళి, పారిపోయి వస్తాననీ" చెప్పి మిగతావాళ్ళని ముందు పంపించాడు. మరి ఆ నాయనమ్మగతి ఏమయిందోగాని, ఇక్కడ వీళ్ళ అవస్థ మాత్రం పరమాత్ముడికి తెలుసు. రాత్రి పదిదాటినా ముఖాలకు రంగు పూసుకోలేదు. జనం వెర్రికేకలేసి, హాలుదద్దరిల్లేటట్లు ఈలలు వేస్తున్నారు. పదకొండు కూడా దాటింది. అసలు కంట్రాక్టరు మూడూ అరణాలు కలెక్షను చూసి ఉసూరుమంటూ నెత్తిన చెంగు వేసుకుని ఎప్పుడో ఇంటికి వెళ్ళాడు. అప్పు తెచ్చిన ఏభయి చేతిలో వున్నా దినవారాలు తేలికగా వెళ్ళిపోయేవి అని అతడు ఒకటే గోల. తీరా ఏంచేస్తాడు చేయి జారిన తర్వాత.

కొంతమంది పెద్దలు స్టేజీలోకి వచ్చి కర్టెను వెనక బీడీలు తాగుతున్న నటకావతంసులను "ఏమయ్యా! మీరు ఆడేది వుందా లేదా?" అని నిగ్గతీసి అడిగారు. "ఇదిగో అర

గంటల్లో ప్రారంభిస్తున్నామని" అర్జనైజరు బీడీలు అవతల పారేసి వాళ్ళను ముందుసాగనంపారు. లేకపోతే వాళ్ళందరూ కలసి తలా ఒక నటుణ్ని తీసుకుని నంచుకు సేటట్లున్నారు. చివరికి వీళ్ళల్లో వీళ్ళు అంటే నటకులు తీర్మానించుకుని అర్జున పాత్రధారి కృష్ణుడు వేసేటట్లు, ధర్మరాజు పాత్రధారి అర్జునుడు వేసేటట్లు నిర్ణయించుకున్నారు. ఈవిధంగా ఒక్కోళ్ళకు ప్రమోషన్లు వచ్చాయి. మొత్తం నాటకం ఈ నాల్గు నెలల్లో అందరకూ వచ్చేసింది. అర్జునపాత్రధారికి కృష్ణవేషం వేసి, 'ఒన్సుమోరు' కొట్టించుకోవాలని చిరకాలపు వాంఛ. ఆ వాంఛ ఈ విధంగా తీరినందుకు భగవంతుడు తనయందున్నాడనీ, కాబట్టే, కృష్ణపాత్రధారి నాయనమ్మకు అకస్మాత్తుగా జబ్బు వచ్చిందనీ, ఈ పాత్ర జయప్రదంగా నెరవేరితే ఇంటికి వెళ్ళిన పర్మిలా డబ్బు చూసుకొని సత్యనారాయణ వ్రతం చేసుకోవాలని లోపలలోపల అనుకున్నాడు.

ఎలాగయితేనేం పన్నెండు గంటలు దాటిన తర్వాత తెర ఎత్తారు. అర్జునుడు ప్రవేశించాడు "అదిగో ద్వారక" అంటూ. జనంలోనుంచి ఒకడు లేచి "ఎక్కడరా వెంకటప్పయ్యా, నాకు కనిపించడం లేదే ద్వారక" అని అరిచాడు. జనం ఘొల్లుమన్నారు. దానితో అర్జున పాత్రధారి కొత్త గణాచారిలాగ గజగజ వణకటం ప్రారంభించాడు. ఇంకా కొంచెం నాటకం జరిగింది. తర్వాత సీనులో కృష్ణుడు పడుకుని వుండగా ఒకపక్క దుర్యోధనుడూ, మరొకపక్క అర్జునుడూ కూర్చుంటారు. తెర ఎత్తబడింది. అర్జునుడు తలఎత్తి ప్రేక్షకులవైపు చూస్తే ఒట్టు... ఇంతలో ఇంకో ప్రమాదం.

కృష్ణుడు పడుకున్న హంసతూలికాతల్పం అనబడే బెంచీబల్లు ఎత్తు పల్లాలలో వేయబడి ఉండటం మూలంగా కృష్ణుడు ముందుకు జరిగితే వెనక లేచిపోతోంది. పోనీకదాఅని వెనక్కు జరిగితే ముందు లేచిపోతోంది. ఒక చెయ్యి తలక్రింద అన్చి (పక్షను ప్రకారం ఆ చెయ్యి అలా వుండాలి కనక) రెండో చేత్తో బెంచీబల్ల అంచు గట్టిగా పట్టుకుని సెంటర్ ఆఫ్ గ్రావిటీ కుదరక తీగమీద నడిచే దొమ్మరిలాగ అటూయిటూ ఊగు తున్నాడు కృష్ణ పరమాత్మ. జనం దానికనుగుణంగా తాళం ఈలలు వేయటం ప్రారంభించారు. చివరికి అటు ఊగి ఇటు ఊగి శ్రీ కృష్ణపరమాత్మ "ఢాం"మని క్రిందపడ్డాడు. కర్టెను మూశారు. జనం ఈలలు, చప్పట్లు... బైట ఈ అల్లరి అయితే లోపల సంగతి వర్ణనాతీతం.

"ఇక నేను నాటకం వెయ్యను. నాకు భయమేస్తోంది" అంటాడు శ్రీ కృష్ణపరమాత్మ.

"నీవు వేషం వెయ్యకపోతే ఏక్సిడెంటులో లార్డ్ బైరన్ చావటంమాట అబద్ధమేమోగాని ఈ ఏక్సిడెంటుతో మనమంతా చస్తాం" అంటాడు ఆర్గనైజరు. బయటనుంచి ఈలలు చప్పట్లూ... పది నిమిషాల తర్వాత మళ్ళీ తెర ఎత్తారు. ఎలాగోలా కుంటుతూ కుంటుతూ నాటకం సాగు తోంది... ...

ఒకచోట దుర్యోధనుడు సందర్భం లేకుండా కటికిన పద్యం ఎత్తుకున్నాడు. అక్కడ పద్యంలేదుగదా అని హార్మోనిస్టు తాపీగా బీడీ కాల్చుకుంటున్నాడు. ఉప్పెన గాలిలా సందర్భము లేకుండా దుర్యోధనుడు పద్యం ఎత్తుకునేసరికి

హార్మనిస్టు బీడీ కుప్పక్కన ఉమ్మేసి ఎగిరి హార్మనీమీద పడ్డాడు. ఎక్కడ వాయించినా దుర్యోధనుడి శృతి దానిలో కలవటంలేదు. ఇంతలో ఒక చరణం అవగానే మిగతా మూడు చరణాలూ మరచిపోయి, నట్టుకొట్టటం ప్రారంభించాడు. ప్రాంప్టరు ఆ పద్యం ఎక్కడిదా అని వెనకపేజీలూ, ముందుపేజీలూ తెగ తిరగేస్తున్నాడు. అతనికి అంతపుస్తకంలోనూ ఆపద్యం ఎక్కడుందో కనిపించలేదు. మిగతాపద్యం దుర్యోధనుడికి జ్ఞాపకం రావటంలేదు. కారణం అది అసలు అతనిపాత్ర కాదుగా, ప్రమోషనుమీద వచ్చిన బాపతయ్యె. అతను పాడితేనేగాని హార్మనిస్టువాయించడానికి వీలులేదయ్యె. ఈ అవినాభావపు సంబంధంలో తమతమ పాత్రల పరిస్థితి ఏమిటో తెలియక మిగతా పాత్రధారులు పాఠాలురాని బండ బడుద్ధాయిలులా అలాకూర్చున్నారు. స్టేజీఅంతా నిశ్శబ్దం. రెండు నిమిషాల తదనంతరం తెర నెంపాదిగా మూసుకుంది.

తర్వాత ఒక ఘట్టం మరీ గమ్మత్తుగా సాగింది. భీమసేనుడికి కోపంవచ్చి లాగిపెట్టి శ్రీ రాగంలో పద్యంపాడి "గదతో నా తల ప్రయ్యలు చేసుకొనెద" అని తనచేతిలోని గదపెట్టి తాను తన తలపైన బాదుకోవాలి. అప్పుడు కొట్టుకోకుండా ప్రక్కనున్న ద్రౌపది వారించాలి. అదీ అసలు కథ. అలాగే పాపం జాగ్రత్తగా పద్యంపాడి గదచేత తన తలమీద బాదుకోబోయాడు భీముడు. ఆప్పుడు ద్రౌపది వెళ్ళి ఆ గద పట్టుకోవాలిగా. అసలే కంగారు పడిపోతూ, తరువాత తన పోర్షనేకదా వచ్చేది, అప్పుడు కొంపతీసి నత్తి వస్తుందేమోననే భయంతో మునిగివున్న ద్రౌపది ఆ గద

పట్టుకోవాలనే విషయం మరచిపోయింది. భీముని అవస్థ చూడండి; గదతో కొట్టుకున్నాడా నాటకం సంగతి దేవుడెరుగు తలకాయ నాలుగు చెక్కలవుతుంది. కొట్టుకోకపోతాడా నాటకం రసాభాస మవుతుంది. ఎంత సేపటికీ ద్రౌపదివచ్చి గద పట్టుకోదు. తెలివిగలవాడు కాబట్టి ఎవరూ వన్స్‌మోరు కొట్టకపోయినా మళ్ళీ ఆ పద్యం తిరగతోడటం ప్రారంభించాడు. ఎన్నిసార్లు తిరగతోడితే ఏంలాభం, ద్రౌపది అడుగు ముందుకువేస్తేకదా. అక్కడికీ ప్రస్తుతం ధర్మరాజు, మోచేతితో ద్రౌపది గూడులు విరిగేటట్లు పొడుస్తూనే వున్నాడు. కాని ఏంలాభం, కాడి క్రింద పారేసిన గానుగ ఎద్దులాగ ద్రౌపది కదిలితేఒట్టు. గజగజలాడిపోతూ తన పోర్షను ప్రారంభించాడు ద్రౌపదిగాడు. ఏది రాగూడదని వేయి దేవుళ్ళకు మొక్కుకుంటున్నాడో ఆ దిక్కుమాలిన నత్తి అప్పుడే వచ్చింది. "నానానానానాథా, భీభీ భీమసేనా! మున్ను మీమీమీమీరు అడవులలో వున్నప్పుడు సైసైసై ఐంధవుడు..." అని ఇంకాఏమేమో అంటూండగా జనంలో నుండి ఏవేవో పదార్థాలు స్టేజీమీద పడటం మొదలెట్టాయి. కర్టెను మూసేశారు... జనం సద్దుమణిగారు... అయిదు నిమిషాలు... పది నిమిషాలు... పావుగంట అయింది; మళ్ళీ తెర ఎత్తరే... చూసిచూసి ముందున కూర్చున్న ప్రేక్షకులు స్టేజీమీదకెక్కి లోపలికిపోయి చూశారు. ఏరీ ఏక్టర్లు?... పంచపాండవులూ, కౌరవులూ కలసి రాజీపడి అదేపనిగా పారిపోయారు. పాపంవాళ్ళకు ఈ విషయంలోనన్నా ఒకఒప్పందం కుదిరింది. అదే సంతోషం... ...

ఈ విషయాలన్నీ జ్ఞాపకానికివచ్చి శ్రీనివాసరావు పగలబడి నవ్వుకున్నాడు తాను డ్రామా శక్రటరీ అనగానే. అంతేకాదు, తాను హైస్కూలులో చదువుతున్న సమయములో ఒకసారి పేరుపొందిన పెద్దపెద్ద యాక్టరులు "హరిశ్చంద్ర" నాటకం వేస్తుంటే టిక్కెట్లు బ్లాకులోకొని నాటకానికి వెళ్ళాడు. నాటకం నిర్విఘ్నంగా సాగుతూనేవుంది. దర్భలకు వెళ్ళిన లోహితాశ్యుడు పాము కరచి చచ్చిపోయాడు. ఎంతసేపటికి కుమారుడు ఇంటికి రాకపోయేసరికి చంద్రమతి గుండెలు బాదుకుంటూ కర్యంలో ఏడుస్తోంది. ఇంతలో కాలకౌశికుని శిష్యులు ప్రవేశిస్తారు. "చాలా సీరియస్ గా వెళ్ళి, అమ్మతల్లీ మీ కుఱ్ఱవాడు అడవుల్లో దర్భలు కోస్తూండగా పాము కరచి చనిపోయాడు" అని చెప్పమని డైరెక్టరుగారు ఆ బాలలతో చెప్పాడు కాబోలు. ఆ బాలకులు అతి సీరియస్ గా రావాలి కాబట్టి తాళం ప్రకారం అడుగులు వేసుకుంటూ తెచ్చిపెట్టుకున్నట్లు మూతి బిగించి పీర్ల పండుగనాడు పెద్దపులి వేషగాళ్ళనుమల్లే స్టేజీమీదికి వచ్చారు. చంద్రమతి ఏడుస్తూనే కొడుకు విషయం అడిగింది. శిష్యులు అంత సీరియస్ గానే "నీ కుమారుడు దర్భల్లో అడవులు కోస్తూ..." అని అరరరే అని చటుక్కున వేళ్ళు కరచుకుని (అంత సీరియస్ నెస్ ఏమయిపోయిందో) అడవుల్లో దర్భలుకోస్తూ అని వాక్యం పూర్తిచేశారు. జనం గొల్లుమన్నారు. జనంతోపాటు అంత ఏడుపులోవున్న చంద్రమతికూడా ఫక్కుననవ్వేశింది... పోనీఇది భ్రమప్రమాదమనుకుందాం. అంతకుముందు సీనులో చంద్రమతిని, హరిశ్చంద్రుడు కాలకౌశికునకు అమ్మజూపుతూ

వుంటాడు. చంద్రమతి ముఖారి రాగంలో వెక్కి వెక్కి ఏడుస్తూ సీసపద్యం పాడుతూ వుంటుంది. పద్యం చాలా సేపు వుంటుంది కాబట్టి, హరిశ్చంద్రుడూ, కాలకౌశికుడూ ఆ చంద్రమతి నటనతో తమకేమీ సంబంధం లేదన్నట్లుగా కొద్దిగా ముఖం ప్రక్కకుత్రిప్పి "కాంట్రాక్టరు అంతసొమ్మూ పూర్తిగా యిచ్చాడా లేదా తరువాత నాటకాలకు ఎక్కడెక్కడి డేట్లు (తేదీలు) యిచ్చింది" మాట్లాడుకుంటున్నారు. అంతటి యిల్లాలు నమవిడిచి వెళ్ళిపోతోందే అన్న బాధగానీ, రియాక్షనుగానీచూపని ఆ హరిశ్చంద్రపాత్రధారి ఎలా ఉత్తమ నటుడో శ్రీనివాసుడికి ఎంత ఆలోచించినా అంతుపట్టలేదు. ఇవన్నీ అతనికి జ్ఞాపకం వచ్చాయి.

శ్రీనివాసుడు అకస్మాత్తుగా ఇంత తెలివిగలవాడెట్లా అయ్యాడా అని మీకు సందేహం కలగవచ్చు. చిన్నప్పుడు, పెరిగి పెద్దవాడై స్కూలుకు వెళ్ళేటప్పుడు, దాదాపు. ఆటు వంటి పరిస్థితులు— పరిస్థితుల ప్రభావంబట్టిగాని ఆనాటి పాఠశాలల స్థితినిబట్టిగాని కలగటం చాలామందివిషయంలో మనం చూస్తూనే వుంటాము. అంతమాత్రంచేత వాళ్ళు సమాజమంతటినీ... లనడానికి ఆస్కారం లేదు. తర్వాత తర్వాత, వాళ్ళు ప్రపంచంలో పడ్డతర్వాత, ప్రపంచం చూసయినా సరే తెలివితేటలను అభివృద్ధి చేసుకోగలుగుతారు. అటువంటిదే జరిగింది మన శ్రీనివాసుల విషయంలోకూడా. మొత్తంమీద శ్రీనివాసుడు కొంతవరకూ ప్రయోజకుడయ్యాడనే చెప్పొచ్చు. శ్రీనివాసుడు కాలేజీలో చదువుతున్నప్పుడు కాలేజీలో ఒక విషయం జరుగుతూ ఉండేది. అన్ని కాలేజీల్లోనూ అలా

జరుగుతోందాలంటే ఆ విషయం మనకు తెలియదు. మొత్తం మీద శ్రీనివాసుడి కాలేజీలో జరుగుతుండేది.

కాలేజీలో లెక్చరర్లు పాఠాలు చెప్పటం చాలా తక్కువ. చదువు చెప్పటంకంటే గోకదంపుడు ఎక్కువ. అథవా ఏ బుద్ధిమంతుడో ఉండి "కాస్త పాఠం చెబుదామా" అని ఉపక్రమించబోయే సమయంలో వెనక బెంచీనుంచి ఒక పిల్లి కూతా, ఆరు నక్కకూతలూ వినిపించేవి. దానితో ఆ ముందు బెంచీమీదనుంచి నామనామ సంకీర్తన ప్రారంభమయి, అరగంటలో ఆ క్లాసంతా చిలకలపూడి పాండురంగ భక్తులయి, ఆధ్యాత్మికచింతలో మునిగిపోయేవారు. ఇంతలో ప్రిన్సిపాలు రావటం క్లాసంతటికీ తలా వొక అర్ధరూపాయి, జిజినూటున్నలాగ జరిమానా వేయడం, వాళ్ళు స్ట్రయికుచేయడము జరిగి క్రమంగా అది ఇంతింతయి, వటుడింతయి అన్న సామెతగా పెరిగి ఊళ్ళో అద్దాలమేడలు పగిలి, కాలేజీలో బల్లలు, కుర్చీలు విరిగి, రాష్ట్ర ముఖ్యమంత్రులు జోక్యం కలుగజేసుకోవడంవరకూ జరిగేది. అంతేకాదు ఆ ప్రిన్సిపాలు "అప్రయోజకుడని" ఆయనను మరొక మారుమూల ప్రాంతం వరకూ ట్రాన్సుఫరు చేయడంకూడా జరిగేది...... ఇదంతా జరగడం ఇష్టంలేకనో ఏమో లెక్చరర్లంతా పాఠాలు మానేసి క్లాసులో సినిమా కబుర్లే ఎక్కువ చెప్పేవారు. అలా కబుర్లు చెప్పిన ఆ లెక్చరర్లుకు మంచి పేరు ప్రఖ్యాతులు వచ్చేవి... ఈ పరిస్థితంతా నచ్చక చదువుకుని బాగుపడాలనే అభిలాష గల పుస్తకాల పురుగులు నూటికి కోటికి వొకళ్ళు ఉంటే వాళ్ళు లెక్చరర్లకు ఎత్తుకుఎత్తు డబ్బుపోసి ట్యూషన్లు పెట్టుకు

చదువుకోవలసివచ్చేది. ట్యూషను ఫీజు ఎంతా? అని ప్రశ్న వస్తే హరిశ్చంద్ర నాటకంలో "దంతావళముపై" అన్న పద్యం జ్ఞాపకానికి వచ్చేది.

ఇటువంటి పరిస్థితిలో ఇటు ట్యూషనుఫీజు కట్టుకోలేక, అటు కాలేజీలో చదువురాక యిబ్బందిపడే శీనయ్యలాటి వాళ్ళకు భలేకష్టంగా ఉండేది. చివరికి శీనయ్య ఒక ఉపాయం కనిపెట్టి ట్యూషను చదువుకునేవారి దగ్గర సబ్ ట్యూషనుకు కుదిరి, వాళ్ళ పుస్తకాలతోనే చదువుకుని మంచి మార్కులు తెచ్చుకునేవాడు.

మొత్తంమీద శీనయ్య 'కాలేజీ ఫిగర్' అయ్యాడు. కాలేజీ యానివర్సరీకి ఒక నాటకంకూడా వేశారు. నాటకం చాలా బాగానే ఉందిగాని, అందులో ఒక పాత్రధారిమాత్రం ఎంత వద్దంటున్నా వినక ఏడుపు బాగా రావాలని, కళ్ళకు కొంచెం అమృతాంజనం డోసు బాగాతగిలించడం, దాంతో కళ్ళు మండి, కళ్ళు తెరిపినబడక, తుమ్ములూ వగైరాలతో నం చేస్తున్నాడో, ఎక్కడున్నాడో తెలియక అందరినీ కంగారు పెట్టడం జరిగిందనుకోండి. అదితప్ప మిగతా నాటకం బాగానే సాగింది. మొత్తంమీద శ్రీనివాసుని చిన్నప్పటి చరిత్రకుండా కొంత తెలుసుకోవడం అవసరం గాబట్టి ఈ విషయాలన్నీ తెలుసుకోవాల్సి వచ్చింది. ఇక గృహస్థుగాకూడా కొన్ని విషయాలు తెలుసుకోవడం ముఖ్యంకాదూ ?

* * *

అందరికీ వచ్చినట్లు శీనయ్యకుకూడా సంబంధాలు రావడం మొదలుపెట్టాయి. అన్నమ్మగారుకూడా పెద్దదయి పోతోంది. రోజులు గడిచినకొద్దీ వయసు పెరుగుతోందిగాని, తరగటం లేదుకదా. ఏదో తన కన్నూ కాలూ బాగా వుండ గానే కోడల్నికూడా కొడుకు పక్కన నట్టింటచూస్తే అంతే కంటే తనకు కావలసినదేముంది. కుర్రవాడు బి.యే. చదువు తున్నాడు. చదువుక్రింద ఒకటి రెండు ఎకరాలు అమ్మినా. మిగతా మూడెకరాలవరకూ ఆస్తి పోకుండా ఆవిడ సంసారం గడుపుకొస్తోంది. కుర్రవాడు బుద్ధిమంతుడు; వెనకా ముందు బాదరబందీ లేదు. సంబంధాలు రావడానికేం, బోలెడు సంబం ధాలు. అన్నమ్మగారుకూడా ఉబలాట పడుతోంది, ఏదో మంచి సంబంధం ఒకటి చూసి ముడిపెట్టెయ్యాలని. తన పుట్టింటి తరపునగానీ, అత్తింటి తరపునగానీ కలుపుకోవడానికి ఎవ్వరూ లేరు. తప్పనిసరిగా పై సంబంధమే కలుపుకోవాలి. కాని శీనయ్యకు ఏమయినాసరే ఇప్పుడు పెళ్ళిచేసుకోవాలసి లేదు. మిగతా మూడెకరాలూ అమ్మయినాసరే ఇంకా పెద్ద చదువు చదువుకోవాలనే అతని ఉద్దేశ్యం. పెళ్ళి చేసుకుంటే ఇక చదువు సాగదని అతనికి గట్టినమ్మకం. కాబట్టి ప్రస్తుతం పెళ్ళివిషయం తలపెట్టగూడదని, ఏలాగోలాగు ఎవరికాళ్ళ యినా పట్టుకునైనా సరే స్కాలర్‌షిప్పులు సంపాదించుకుని, విదేశాలవరకూ పోయి చదువుకోవాలని ఉద్దేశ్యపడుతు న్నాడు.

ఇక్కడనుంచీ ప్రారంభమయింది తల్లీ కొడుకు మధ్య వాద ప్రతివాదాలు. ఇంతవరకూ ఎప్పుడూ కూడా తల్లి

కొడుకుమాట కాదనటంగానీ, కొడుకు తల్లిని వ్యతిరేకించడం గానీ జరగలేదు. కాలం ఖర్మం కలిసివచ్చి ఈ పెళ్ళి విషయములో ఇద్దరూ ఘర్షణపడటం ప్రారంభించారు. కాస్త సందు దొరికితే "ఏమిరా నాయనా? ఇవాళ వాళ్ళెవరో సంబంధానికి వారొచ్చారు. అయిదువేలు కట్నం ఇస్తారట, పిల్లను చిదిమి దీపం పెట్టవచ్చుట" అని ప్రారంభించేది తల్లి. బెల్లంకొట్టిన రాయిలాగ మాట్లాడకుండా భోజనంచేసి "చదువుకోవాలని" వంక చెప్పి బయటకు వెళ్ళిపోయేవాడు కొడుకు. ఇలా ఎన్నాళ్ళని తప్పించుకుంటాడు. అస్తమానం తల్లి పోరుపెట్టడంతో మనస్సు చెడి అసలు చదువుకూడా సాగటంలేదు. "ఇప్పుడు మనిద్దరికే ఇల్లు గడవక నానా అవస్థా పడుతున్నాం, ఇంకొకళ్ళనుకూడా తీసుకువచ్చి, నెత్తిన కూర్చోపెట్టుకుంటానంట వేమే" అన్నాడు ఒకరోజున తల్లితో.

"అది ఎప్పటికైయినా తప్పదు కదరా. ఎన్నాళ్ళని రాయల్లే నేను పెట్టినికట్టుకు ఊరేగుతాను. బ్రతికినన్నాళ్ళూ, నాకీ వంటా, ఇంటి కాడిబండీ తప్పదా ఏమిటి; ఈ మధ్య కళ్ళుకూడా సరిగా కనుపించటంలేదు. నీ పెళ్ళాంవస్తే దానికి ఈ యింటి బాధ్యత నప్పచెప్పి, నేను కాస్త కృష్ణారామా అనుకుంటాను" అనేది తల్లి.

"నీవు చేయలేకపోతే నేనే నీకు చేసిపెడతాను సరేనా... అంతేగాని నాప్రాణానికి అప్పుడేవొక గుదిబండను తగిలించి నా ప్రాణం తియ్యకు. ఏమయినా సరే నా చదువు పూర్తయితేగాని చేసుకోను."

"నీ కడుపున ఒక కాయయినా చూడకుండా, ఇంట ఆడపిల్ల తిరగటం ఒక ముద్దూముచ్చటా చూడకుండా ఏమి టిరా నాకీ శిక్ష. బ్రతికినంతకాలం ఇలా ఏకాకిలాగ మోడల్లే బతికి చావవలసిందేనా".

"చాలావరకూ వుందే వ్యవహారం. కోడలు ఒక్కతే కాదు, అప్పుడే సంతానం పంజాటంకూడా చూడదామని కోరు కుంటున్నావన్నమాట. నీ కోరికలకు వేయి నమస్కారాలు గాని నన్ను అట్టే వాగించి చంపకు. ఇదే ఆఖరుసారి నీతో చెప్పటం" అని మారుమాట్లాడకుండా లేచి చక్కాబోయే వాడు.

శీనయ్య యింటికి వచ్చేసరికి అన్నమ్మగారు ఒకసారి భోజనం చెయ్యకుండా కూర్చుంది. మడికూడా కట్టుకోకుండా మైలతోనే శీనయ్యకు కుంపటిమీద పాలగొట్టం బియ్యంపోసి ఊరుకుంది. శీనయ్య యింటికివచ్చి అసలు సంగతి తెలుసు కున్నాడు. తాను పెళ్ళి చేసుకోనిదే ఇక తల్లి ఆ యింట్లో పచ్చిగంగ పుచ్చుకోనని కూర్చుంది. నిజం చెప్పాలంటే ఆవిడ ఆరోగ్యంకూడా సరిగ్గా ఉండటము లేదు. ఏమో ఏ వేళప్పుడు ఏం జరుగుతుందో. అదీ కాకుండా తోటి కుటుం బాలవాళ్ళు కొడుకులూ-కోడళ్ళూ, మనుమలూ - మనుమ రాళ్ళతో పచ్చపచ్చగా కళకళ్ళాడుతుంటే తన ఖర్మమేం కాలింది ఒంటరిగా. మోడుపడ్డ చెట్టులా బ్రతకటానికి. తనకు మాత్రం ఆ ముద్దూముచ్చటా తీర్చుకుందామని ఉండదూ. ఏదోవిధంగా పట్టుపడితేనేగాని కొడుకు పెళ్ళి చేసుకోడు. పోనీ, గంతకుతగ్గ బొంత ఎవరోఒకరు తమ తాహతుకు తగిన

వాళ్ళనే... "నీకంత కుటుంబంజరగటం కష్టమనుకుంటే పెళ్ళి చేసుకుని నీ భార్యను తెచ్చుకో. నా దారిననేను ఏ కాశీకో, గయకో వెళ్ళిపోతాను. నా ఒక్క పొట్టా ఎలాగోలా గడవక పోదు, నూరు బజాల్లో ముష్టెత్తుకున్నా నా ఒక్క పొట్టా గడిచిపోతుంది" అని కళ్ళనీళ్ళు ఒత్తుకుంటూ కొడుకు ఎదుట నిలబడింది తల్లి.

తల్లి నిచూసి శీనయ్య చాలా బాధపడిపోయాడు. అంతే కాదు ఆమెడ లోలోపల ఎంతో కుమిలిపోతోందని ఊహిం చాడు. తనకోసం చిన్నప్పటినుంచీ ఎన్నో అవస్థలుపడి, పెంచి పెద్దచేసింది. తన సుఖంకోసం కష్టకష్టాలూ పడింది. ఇక తన జీవితం ఏమయినాసరే. తన భవిష్యత్తును బలిచేసయినా సరే తల్లి కోరిక తీర్చటం తన కర్తవ్యమని భావించాడు. జరగవల సింది జరుగుతుంది. ఎలా రాసిపెట్టిఉంటే అలా జరుగుతుంది. దానికోసం తన తల్లిని, తనకోసం సర్వస్వాన్నీ ధారపోసిన తల్లిని, రేపోమాపో చావుకు సిద్ధంగా వున్నదానిని బాధ పెట్టటం యిష్టంలేకపోయింది.

"సరేనమ్మా నీ కంత కోరికగా ఉంటే నీ యిష్టప్రకా రమే కానియ్యి. ఏదో చదువుకుని పైకి రావాలనే తలంపు తప్ప, నీ మాట వినకూడదని నాకేం లేదమ్మా. నీకు నచ్చిన సంబంధం నిశ్చయం చెయ్యి. చేసుకుంటాను" అన్నాడు.

ఆ మాటలు అన్నమ్మగారికి అమృతపు జల్లులుగా అనిపించాయి... ఇన్నాళ్ళకు తన దేముడు— శ్రీ వెంకటే శ్వరస్వామి— కరుణించాడు. తను కట్టిన ముడుపులు, మొక్కులూ ఫలితానికి వచ్చాయి. తన కొడుకు పెళ్ళి చేసు

కుంటూ నన్నాడు. అదే కావలసింది. అది జరిగితే తనకిక కావలసింది ఏదీలేదు. జీవిత పరమార్థం సాధించినట్టే... అప్పుడే ఆ రాత్రే తన కోడలు చిట్టిచిట్టి పాదాలతో, కాళ్ళ గజ్జెలు చప్పుడుచేస్తూ, లక్ష్మీదేవిలా నట్టింట నడుస్తున్నట్లు కలలు కన్నది...

ఆ మర్నాటినుంచీ శీనయ్య సంబంధాలు చూసిరావటానికి బయలుదేరటం మొదలుపెట్టాడు. ఒకనాటి ఒక పెళ్ళికూతురును— అంటే తనకు యిస్తానన్న అమ్మాయిని— చూడటానికి వెళ్ళాడు. సర్కసులో జంతువులను చూడటానికి వచ్చినట్లు ఊళ్ళోవాళ్ళు ఆత్రామగా అనేకమంది, పెళ్ళికూతురు గారింటివద్ద మూగి తననూ, తన తల్లినీ చూడటం మొదలుపెట్టారు. అసలు తను పెళ్ళికూతురును చూడటానికే యిష్టపడలేదు. తన తల్లికి నచ్చితే తనకు నచ్చినట్లే అన్నాడు. కాని ఆడపిల్ల తరఫువారు కుర్రవాడుకూడా రావాలని పట్టుబట్టారు "పిల్లవాడుస్వయంగా పిల్లను చూడటం మంచిద"ని. కాని అసలు ఆంతర్యం—పిల్ల, పిల్ల తరఫు ఆడవాళ్ళూ పిల్లవాడిని చూడాలికదా—అదీవిషయం.

శ్రీనివాసరావుకు ఇదొక కొత్త అనుభవం. అసలు కాలేజీ ఆడపిల్లలతో మాట్లాడటమే అతనికి బెరుకుగాఉండేది. అత్యవసర మయితేగాని, ఒక్కముక్క మాట్లాడేవాడు కాదు. కన్నెత్తి అసలు చూసేవాడు కాదు. ఇప్పుడలా కాదే, ఆ పిల్లను కన్నెత్తి చూడాలి; పన్నెత్తి పలకరించాలి. తాను ఎంత నాటకాల రాయుడయినా, స్టేజీమీద బ్రహ్మాండంగా నటించగలిగినా, విడిగా నలుగురిమధ్య మాట్లాడటానికీ, నిల

బడటానికే కొంచెం కంగారుపడేవాడు. అదిఅతని మనస్తత్వం! ఎవరేం చేస్తారు. మరి అటువంటిది—ఏదో గుట్టుచప్పుడు కాకుండా, తాను పిల్లను చూసిపోదామనివస్తే యీ ప్రేక్షకు లంతా ఎందుకో అతనికి అర్థంకావటంలేదు. అది పల్లెటూరు. వారి రివాజు, వారిఆచారం అది. పెళ్ళికూతురుతోపాటు వాళ్ళంతా యీ పిల్లవాడిని చూసి ప్యాసు చెయ్యాలి. అంటే పెళ్ళి కొడుకుకూడా ఒకవిధంగా అక్కడ బేరానికి నిలబడ్డ జంతువు లాటివాడే. ఇంతమంది ప్రేక్షకులమధ్య యీ రెండు జంతువు లను ఒకదానికొకటి అంటగట్టడానికి ఇంతమంది చూడటము, ప్యాసుచేయడము, ఆమోదముద్ర వేయడము జరగాలి. తన తరఫున తనతల్లి ఒక్కతే. కాని ఆ అమ్మాయి తరఫు అధమ పక్షం అరవై మందయినా ఉంటారు. శ్రీనివాసరావు అవస్థ పరమాత్ముడికి తెలుసు. ఈ పల్లెటూరిజనమంతా తనను రకి రకాలుగా ప్రశ్నలువేసి చంపుతున్నారు. కొంతమంది "కుర్రా డుకేం బాగానేఉన్నాడు" అని ఆమోదముద్రవేశారు నోట్లో పొగాకు ఉమ్మి బయటకు వదులుతూ... "ఏళ్ళొచ్చినా ఖర్మ గాలి నన్ను పరీక్షచేయడం" అని కుంచించుకుపోయాడు ఆ కాలేజీ చిన్నవాడు. పదిమందిలోపడ్డ పాములాగ వుంది అతని పని. ఆ పెళ్ళికూతురు లోపల ఎంత బాధపడుతోందో అనుకుంటూ, ఎప్పుడు యీ గండంగడిచి బయటపడతానా అని పది దేముళ్ళకు మొక్కుకుంటున్నాడు. ఇదంతా లేకుండా చేసుకోడానికే "కాలేజీల్లో పిల్లలు ప్రేమ వివాహాలు చేసుకుంటున్నారేమో" అనికూడా అనుకున్నాడు. అలా తాను చేసుకుంటే తనతల్లి ఉరిపోసుకు చచ్చిపోదూ.

సరే, వచ్చినవాళ్ళల్లో కొంతమందికీ, తనతల్లికీ, తనకూ, కాఫీ ఫలహారాలు యిచ్చారు. తరువాత ఇప్పు జరుగునో, జరగక పోనోగాని ముందు ఆ బీద కుటుంబీకుడికి పాతిక, ముప్ఫయి రూపాయలు వదలిపోయి వుంటాయి. ఈ విధంగా యింత వరకూ ఆ పిల్లకు ఎన్ని సంబంధాలుచూశారో, పాపంకోసు స్తే యింకా ఎన్ని చూడాలో. ఇప్పటికి పాతిక, ముప్ఫయిలు చొప్పున ఖర్చుపెడితే యీ బీద కుటుంబీకుడి గతి ఏమిటి? ఆయన అవస్థ చూసయినా తాను ఆపిల్లను చేసుకోవాలా... ఏమిటో... ఎరక్కపోయి ఈ సుడిగుండంలో పడ్డాను... యీ విధంగా శీనయ్య లోలోపల ఇదయిపోతున్నాడు.

ఇంతలో ఆ పిల్ల తాతగారు—అంటే తల్లి తండ్రి— ఆయన రిటైరుడు ఎలిమెంటరీ స్కూలు హెడ్మాష్టరుగారు— లేచి ఉపన్యాసం ప్రారంభించాడు. "మాఅమ్మాయి ఆరోక్లాసు ప్యాసయింది. ఇంగ్లీషుకూడా కొద్దిగా అక్షరాలు గుర్తు పడు తుంది. ఇక సంగీతమంటారా, ప్రత్యేకంగా మేము నేర్పించ లేదుగాని మంగళహారతులూవచ్చు..." అని వాక్యం పూర్తి చేయకముందే ఆ వూరిలోవుండే మరో చుట్టకాల్చుకునే పెద్ద మనిషి అందుకుని "ఈ రోజుల్లో ఆడదానికి పెద్ద సదుకూ, చంగీతాలూ ఎందుకండి. సాకలిపద్దు రాసుకుంటే నాల్దా అంట" అని తన అభిప్రాయం వెలిబుచ్చాడు, చేసుకునేద తనే అన్నట్లు.

పిల్ల తాతగారు ఒక పత్రిక తీసి, పిల్ల చేతికిచ్చి చదవ మన్నాడు. తెలుగుదే అనుకోండి పత్రిక, ఆ పిల్ల సిగ్గుచేతో. మరే కారణంచేతో, బ్రతిమాలించుకుని బ్రతిమాలించుకుని

రెండు బంతులు చదివింది. "మా అమ్మాయికి నిజంగా చద
వటంవచ్చు" అని నిరూపించేందుకు తాతగారు ఎవరూ తనను
అడగకపోయినా చేసినపని అది. అక్కడితో వూరుకోలేదు,
ఒక పాటకూడాపాడమని కూర్చున్నాడు అయనే... శీనయ్యకు
యిదంతా వెగటుగాకనిపించింది. అసహ్యంగా ఇంతమందిలో
యీ పరీక్ష ఏమిటని. ఆ అమ్మాయి పాలిటి ఆ తాతగారు
సర్వీసు కమీషను ఆఫీసరులాగ తయారయ్యాడుపాపం. ఆ పిల్ల
లోలోపల పడుతున్న అవస్థచూసి జాలిపడి "ఎందుకులేండి
ఆ అమ్మాయిని యిబ్బంది పెట్టటం" అని తెగించి అనేశాడు.
కాని ఆ తాతగారు ఊరుకుంటేనా... "ఏం తెగులు తీసింది
పాడటానికి. ఉత్సాహంతో ఇల్లు ఎగిరిపోయేటట్లు అరవగలవ్వా,
పాడమంటే ఏమిటే ఆ బిగింపు. ఎలా వస్తాడనుకున్నావు
మొగుడు" అని తన హెడ్ మాష్టరుగిరీలో, కాస్త తాతగారి
సరసము కలిపి రంగరించి జోకులాటేది విసిరాడు. జనం కాస్త
గొల్లుమన్నారు. ఎవరూ లేనప్పుడు ఆ అమ్మాయి సరదాగా
బిగ్గరగా పాడుకోటానికీ, యీ పెళ్ళి జరగటానికీ సంబంధము
ఏమిటో అర్థంకాలేదు శీనయ్యకు... కొంపతీసి అట్లా ఆ
అమ్మాయి పాడినతర్వాత తాను 'ఒద్దూ' అనకుండా చేసుకు
తీరాలేమో ననుకున్నాడు. "పాడమ్మా, ఒక్కపాట పాడు"
అని తల్లి నింపాదిగా అన్నది. ఆ పాటకోసం వాళ్ళంతా
ఎందుకు యింత పట్టుదలపడుతున్నారో తెలియడములేదు.

"ఏం పాడమంటే అంత సాగదీయించుకుంటావేం.
పాడు" అని ఉరుము ఉరుమినట్లు ఉరిమాడు రిటైర్డు హెడ్
మాష్టరుగారు. అసలే ఆపిల్ల సదరు ఆరోక్లాసువరకూ చదువు

ఉంది ఆ తాతగారి దగ్గరే కాబట్టి, దానితో పాటుపోయి సంగీతాన్ని ఎత్తుకుంది 'మాంపాహి-నిరామయీ సుగో' అంటూ. పాట సంగతి ఏమోగాని, ఆ పాట సైపద్ధుమన్సులోకి వెళ్ళే సరికి ఆపిల్లకు పుట్టినకు భయంతో ఏమొచ్చి బావురుమని ఏడ్చేసింది. శీనయ్యకు తల తిరిగినంత పనయింది. తనకోసమేగా యీ పరీక్ష. ఇదేం పరీక్షరా భగవంతుడా అనుకున్నాడు... ఇంతకూ అసలు విషయం తాతగారుమాత్రము అంతటితో ఊరుకోలేదు. "చింత పెరికె పుచ్చుకుంటే ఏమున్న సీమపు పరుగెత్తాలి. ఎందుకా వెధవ ఏడుపు, పాటపాడమంటే తీపరమా..." అని కసురుకున్నాడు.

"అమ్మా మళ్ళీ మనకు బస్సు అందదు, లేద్దామా" అన్నాడు శీనయ్య. పాట వినకుండా, ఆ పిల్ల సరిగ్గా పాడనందుకు కోపంవచ్చి వెళ్ళిపోతున్నాడేమో అనుకున్నాడు తాతగారు. "మళ్ళీ పాడిస్తా ఉండండి" అన్నాడు.

"అబ్బే అందుకు కాదు, ఫరవాలేదు, విన్నానుగా" అన్నాడు హెడ్ మాష్టరునుచూసి వణికిపోతూ శీనయ్య. ఆ హెడ్ మాష్టరులో తన చిన్నప్పటి 'కోదండం తీయిస్తానన్న' మాష్టరు కనుపించాడు శీనయ్యకు...... అంతే ఇక తనకా సంబంధం వద్దన్నాడు. ఒకసారి మరో సంబంధం చూడటానికి వెళ్ళాడు. వాళ్ళు శీనయ్యా, తల్లి వస్తుంటే రైలు దగ్గరకు కారు పంపించారు. కారుతోపాటు రైలు దగ్గరకు రిసీవు చేసుకునేందుకు ఒకసూటువేసుకుని, టైకట్టుకున్నాయనకూడా వచ్చాడు. అతని వెనక ఒక యూనిఫారం డ్రస్సుతో నౌకరు కారు తలుపు తీయడానికీ, కారు తలుపు వేయడానికీ, హాజ

రుగా నిలబడేందుకూ వెంటవచ్చాడు. ఈ మర్యాద చూసి శీనయ్యా అదిరిపోయాడు.

బహుశా అన్నమ్మగారు యీవిధంగా చిన్న కారులో కూర్చోటం జీవితంలో ఇదే మొదటిసారేమో. వెనకసీటులో కొడుకుతోపాటు కూర్చున్న అన్నమ్మగారు ఆ భోగానికి ఉబ్బి తబ్బిబ్బయి యీ సంబంధం కొడుక్కు తప్పక చేసుకోవాలనీ, దైవం రక్షించి పెళ్ళయితే కొడుకుతోపాటు తానుకూడా ఈ కారులో ఎక్కవచ్చని కలలు కన్నది. ఇంతలో యీ కలలు కూడా ఇంత బరువెక్కాయేం ఏమిటన్నట్లు డ్రస్సు జవాను కారుతలుపు తెరిచి దిగమన్నాడు. కారు దిగి చూస్తే ఎదు రుగా యింద్రభవనంలాటి భవనం వుంది. అన్నమ్మగారికి ఆ యిల్లు చూసేటప్పటికి మతిపోయింది. ఆ యింటివారు కొంప తీసి తమ విషయంలో పొరపాటు పడలేదుకదా అనుకున్నది. శీనయ్యాకుకూడా అదేమాదిరిగా వుంది.

"కమిన్ ప్లీజ్" అన్నాడు సూటు దొర.

"ఏమిటి అంటాడు?" అంది అన్నమ్మగారు చాటుగుండా కొడుకును.

"లోపలికి రమ్మంటున్నారు" అన్నాడు కొడుకు తెలుగులో.

"అయితే ఆలోచిస్తావేం పద" అన్నది తల్లి.

ముందు హాలంతా అత్యాధునిక ఫర్నిచరులోనూ, డోర్ కర్టెన్‌లతోనూ, సోఫాలతోనూ నిండివుంది. "ఇది సినిమాతీసే స్థలమేమో" ననుకుంది అన్నమ్మగారు మన స్సులో. వియ్యంకుడికి సినిమాల్లోపనేమో? తాము వస్తున్నా

మని గొప్పకోసం అక్కడివన్నీ తెచ్చి ఇక్కడ పెట్టుకున్నా రేమో! సంబంధముకుదిరితే తన కొడుకునుకూడా సినిమాలో ప్రవేశపెడితే బాగుంటుంది. వడిచో, పిచ్చెక్కించుకునో నాల్గు డబ్బులు సంపాదించుకుంటాడు" ఇలా అన్నమ్మగారు రకరకాలుగా ఊహించుకుంటోంది.

ఆ హాలులోనుంచి మెట్లమీదుగా పై అంతఃపురములోకి తీసుకెళ్ళారు. తన బంతిపువ్వు రంగుపెట్టె, ఉంగటాలు తెగిన వాటర్‌ప్రూఫ్ చేతిసంచీ, అందులో అరడజను ఆరముర్గిన అరటిపళ్ళూ వెనక జవాను తెస్తున్నాడు. ఆ అరటిపళ్ళలో ఒకటీ అరా ఆ జవాను కాజేస్తాడేమోనని ఆమెభయం. ఉండుండీ వెనక్కి ఒకసారి తిరిగిచూస్తూ మొత్తంమీద తమకు విడిదికిచ్చిన గదిలోకి వెళ్ళి కూర్చున్నారు. డన్‌లప్ పరుపులతో వున్న మంచాలు రెండు దగ్గరదగ్గరగా వేసున్నాయి. రేడియో, ఫాను, ట్యూబులైట్లు లోపల అంతా చక్కగా, చల్లగా ఉంది. "ఈగదికి కిటికీలులేవేం!" అన్నది అన్నమ్మ.

"ఎయిర్ కండిషన్డు గది" అన్నాడు నింపాదిగా శీనయ్య.

"రాత్రి తిన్న పాడు రొట్టెముక్క అరిగి చావలేదు. కడుపులో గుడగుడలాడుతోంది, వెళ్ళాలంటే దారి ఎటో?" అంది తల్లి.

"చచ్చాం. అదీ యిప్పుడే వచ్చిందీ" అన్నాడు కొడుకు. ఆ దారి అతనికిమటుకు కేంతెలుసు! ఇలా తల్లీకొడుకులు అవస్థ పడుతుండగా ఒక నౌకరు అదృష్టవశాత్తూ లోప

లికి వచ్చి "ఏమున్నా కావాలంటే నాతో చెప్పండి" అన్నాడు.

"నాయనా! అవతలికి వెళ్ళాలంటే ఎటు వెళ్ళాలి?" అంది అన్నమ్మ. వాడికి అర్థంకాలేదు. అవతలికి అంటే ఎవతలికో...

"అదే లావెట్రీ ఎటు ఉంది?" అన్నాడు ఇంగ్లీషు తెలిసిన కొడుకు.

"ఓ, అదా. ఇలా రండి సార్. ఇక్కడ ప్రతి గదికి ఆ గది ఎటాచిడు బాత్‌రూమ్, సెప్టిక్ లావెట్రీలు ఉన్నాయి" అంటూ ఒక గదిలోకి తీసుకువెళ్ళి "సార్ ఇది హాట్‌వాటర్ పైపు, ఇది కోల్డు వాటర్ పైపు... ఇదిగో స్నానం చెయ్యాలంటే సోప్పు, టవల్సూ... ఇదిగో ఈ తలుపు తీస్తే సెప్టిక్ లావెట్రీ..." అని అన్నీ చూపించి "నేను బయట కూర్చుంటాను. అవసరమైనప్పుడు ఇక్కడవున్న యీ కాలింగుబెల్లు నొక్కండి" అనిచెప్పి అద్దాలతలుపు తీసుకుని వెళ్ళిపోయాడు. వాడిని వెళ్ళనిచ్చి "ఎవ్వరూ లేరుకదా" అని అటు ఇటూ చూచి శీనయ్య ఒకసారి గట్టిగా శ్వాస పీల్చుకున్నాడు.

"ఒరే యీ ఇంటికి అద్దె ఎంత ఇస్తున్నారో" అంది అన్నమ్మగారు.

"నీ బొంద. నీనికి అద్దె ఏమిటీ. ఇది వాళ్ళ సొంత యిల్లే" అన్నాడు కొడుకు.

"అట్లా" అనుకుంది తల్లి.

తల్లిని లావెట్రీలోకి తీసుకువెళ్ళి... వచ్చేటప్పుడు ఆ గొలుసు లాగమని చెప్పి తలుపువేసి వచ్చేశాడు...

"ఇంతవరకూ అసలువారు ఎవరూ రాలేదేం?... ఆ సూటువేసుకు స్టేషనుకు వచ్చినాయన ఎవరూ?... ఒకవేళ పీళ్ళ పిల్లను తనకిస్తే తను నిభాయించుకోగలడా? ఆ వచ్చిన పెళ్ళికూతురు తన తల్లికి అన్నం వండి పెడుతుందా! అసలు ఆవిడకు అన్నం వండిపెట్టడం వచ్చునో రాదో!... యిన్ని సుఖాలకు అలవాటుపడ్డ ఆ అమ్మాయిని తాను చేసుకుని ఇంత వైభోగం ఎట్లా సమకూర్చగలడు..." అని శీనయ్య లోలోపల అనుకుంటున్నాడు.

ఇంతలో "కెవ్వు"మని ఒక్క గావు కేక వినిపించింది. తల్లి తలుపు తీసుకు పారిపోయి వస్తోంది.

"ఏమిటే, యేం జరిగింది?"

"నువ్వు చెప్పినట్లు గొలుసు లాగాను... ...దడదడమని భూమంతా కదిలి లోపలనుంచి నీరు చిమ్ముకుంటూ వస్తోంది. కొంపతీసి మేడ కూలిపోతుందో యేమో, పరిగెత్తిపోయి వచ్చాము యీ సంబంధానికి" అన్నది అరేబియన్ నైట్సు వింతలు చూస్తున్న తల్లి.

"హమ్మయ్య. అంతేకదా... అది అంతేలే. మరేం ఫర్వాలేదు" అన్నాడు కొడుకు. తర్వాత తాను లోపలికి వెళ్ళాడు.

"ఈ పాచి గుడ్డలతో ఎంతసేపు కూర్చోను? ముఖం కడుక్కుంటూ. కాస్త కచ్చికా, తాటాకు వుంటే బాగుం డునే" అనుకుని "ఇందాక వాడు చెప్పి వెళ్ళాడుగా" అని అక్కడ గుండీ నొక్కింది. వెంటనే అద్దాల తలుపు తీసుకుని ఒక మహమ్మదీయ నౌకరు లోపలికి వచ్చాడు.

"ఇదేమిటి? ఇక్కడ యీ గుండీనొక్కితే అక్కడున్న వాడికి ఎలా తెలిసింది బ్బా... అయినా నాకెందుకు? ఇదేదో సినిమాలో ఘాటోత్కచ గృహం లాగుంద"నుకుని "కాస్త కచ్చిక, తాటాకు తెచ్చిపెట్టునాయనా" అన్నది. వాడికి అర్థమయ్యి చావలా ఆ భాష. అలాగే నిలబడ్డాడు.

"కచ్చికయ్యా... కచ్చిక"

"కచ్చిక?... బోలేతో క్యాహై?..." అన్నాడు వాడు.

"నా సింధాకూడు" అని బారెడు పొడుగున నోరు చాచి నాలిక గీసుకుంటున్నట్లు అభినయించి చూపెట్టింది అన్నమ్మగారు. "కచ్చిక... కచ్చిక... కచ్చిక..." అని ఇంపోజిషన్ విద్యార్థిలాగ వాడు కూడబలుక్కుంటూ బయటకు వెళ్ళిపోయాడు. మరి ఎవరితో ఏం చెప్పాడో ఏమో అయిదు నిమిషాల తర్వాత టూత్ పేస్టు, టంగ్ క్లీనరూ తెచ్చి అక్కడ పెట్టాడు. అవి ఎందుకు తెచ్చాడో ఆవిడకు అర్థం కాలేదు. "నీయమ్మ కడుపు కాలా. కచ్చిక తేరా అంటే ఈ మందు గొట్టాం తెచ్చావెందుకురా?" అన్నది అన్నమ్మగారు. వాడు ఏదో తెలిసినట్లు చిరునవ్వుల్తో మెలికలు తిరిగిపోతున్నాడు. ఇంతలో అక్కడికి శీనయ్య వచ్చి "ఏమిటే హడావుడి" అన్నాడు తల్లితో. ఆవిడ జరిగిందంతా చెప్పి వాడు తెచ్చినవి చూపించింది.

"ఇక్కడ కచ్చికా తాటాకులు ఎక్కడ దొరుకుతాయి. నీవంతా తొందర. కాస్త నేను వచ్చేవరకూ ఆగ

లేవూ. నా సంచీలో పండుంపుల్ల లున్నాయిగా తీసుకో పోయావూ".

"పండుంపుల్ల నమిలితే ఈ మిగిలిన రెండు పళ్ళుకూడా రాలిపోతాయి" అన్నది తల్లి.

ఎలాగోలా ముఖం కడుక్కున్నాడు. "ఏరా! అబ్బాయి! ఇక నేను స్నానం చేసి మడికట్టుకుంటా" అంది

"నీ మడి మంటగలవా... ఇక్కడ మడిమాటెత్తకు ముందు స్నానంచెయ్యి. మడిమాట తర్వాత చూసుకుందాం" అన్నాడు కొడుకు.

"ఇంత బతుకూ బతికి మడి కట్టుకోకుండా ఎలా భోజనము చెయ్యనురా?"

"నీ భోజనం మండా. అప్పుడు చూసుకుందాంలే! ముందు స్నానం కానియ్యి".

సరే అన్నమ్మగారు స్నానానికి లోపలకి వెళ్ళి తలుపు వేసుకుంది. అటు వెళ్ళిందో లేదో ఇటు లోపలినుంచి మళ్ళీ "కెవ్వున" అరచింది. మళ్ళీ ఏంకొంప మునిగిందోనని శీనయ్య. శీనయ్య వెనక డవాలీ బంట్రోతూ అంతా పరుగెత్తుకెళ్ళారు. సగం పైన పంచ చుట్టుకున్న అన్నమ్మగారు తేలుకుట్టినట్లు చిందులు తొక్కుతోంది.

"ఏమిటమ్మా? ఏం జరిగింది?"

"మామూలు కుళాయికింద స్నానం చేసినట్లు యీ కుళాయికింద కూర్చుని మరతిప్పా. అబ్బా ఏమి వేడి నీళ్ళురా. వీపు పొప్పర వూడిపోతేనూ. అయినా ఈ వూళ

పంపుల్లో వేడినీళ్ళు వస్తాయా ఏమిటిరా!" అన్నది అంతబాధ లోనూ ఆశ్చర్యంగా.

సాయబు చాటుకు తిరిగి ఒకటే నవ్వు.

"అది వేడినీళ్ళ పంపు అమ్మగారూ, ఇద్గో హిది చన్నీళ్ళ పంపు. మీకు ఎందుకువచ్చిన తంటా చెప్పండి. మేము ఉన్నది మీ నౌకరీకేగా. మాతో చెపితే సమపాళంగా వచ్చేలా చేద్దునుగా... అమ్మగారూ ఈ విషయము బహానాబ్ కు తెలియనీయకండి. తెలిస్తే మా ఉద్యోగము పోతుంది" అని లబలబా కొట్టుకున్నాడు.

ఎలాగోలా తల్లీకొడుకుల స్నానం అయింది. శీనయ్య ఎంత ఇన్ షర్టు వేసినా, మామూలు చెప్పులు (ఉంగరాలు మళ్ళీకుట్టించినవి) వేసుకోవటంచేతో ఏమో అదొకరకంగానే ఉన్నాడు. తీరా చూస్తే ఆ తెల్లటి ఇస్త్రీ చొక్కాకు చాకలి నీలిరంగు ఎక్కువ పెట్టాడు. పాంటుకు బకీల్సులేక దానికోసం నియమించబడ్డ తోకలు పక్కలకు నిక్కపొడుచుకు ఉన్నాయి. చొక్కగుండీ వొకటి ఊతుకులో పగిలిపోతే శీనయ్య దానిని కనిపించకుండా లోపలినుంచి పిన్నీసు పెట్టాడు.

ఇంతలో తలుపు తీసుకుని ఒక బట్టతల పెద్దమనిషి మంచి సిల్కు సూటులో, చేతికర్ర ఊపుకుంటూ పైపు పీలుస్తూ లోపలికి ప్రవేశించాడు. ఆతని ప్రక్క ఇద్దరు నౌకర్లు చేతులు కట్టుకుని నిలబడ్డారు. వారిలో ఆ సాయబు నౌకరు కూడా ఉండి అన్నమ్మగారిని చూసినప్పుడల్లా ప్రక్కకు తిరిగి ఒకటే నవ్వుకుంటున్నాడు. ఆ బట్టతల ప్రక్కనున్న ఆయన అసలు సంబంధం కుదిర్చిన పెద్దమనిషి. ఆయన శీనయ్యకు

తెలుసు. ఆయనే ఈ బట్టతల ఆయన్ను పరిచయం చేశాడు. ఇంతకూ ఆయన పెళ్ళికూతురు తండ్రి. ప్రక్కనున్న ఆవిడ పెళ్ళికూతురు తల్లి... వియ్యపురాళ్ళిద్దరూ వొకరినొకరు చూసుకుని పలకరించుకున్నారు. పెళ్ళికూతురు తల్లి ముఖానికి పౌడరు రాసుకుని, లిప్‌స్టిక్ వేసుకుని బర్మాముడి చుట్టపై నల్లటి సన్నని వలకట్టుకుని, ఎత్తుమడమల చెప్పులతో హేండు బ్యాగు పట్టుకు నిలబడి వుంది. పెళ్ళికుమారుని తల్లి బర్మా ముడికి బదులు ముసుగు, పౌడరుకు బదులు నుదుట విభూతి రేఖలూ, ఎత్తుమడమల చెప్పులకు బదులు రైరు చెప్పులు (అయితే ఒకటి, బజారు చెడుమట్టి వేసుకుని ఆ రైరుచెప్పుల మడమలుకూడా ఎత్తుగానే ఉన్నాయి. ఇదిఒక్కటే వియ్యపు రాళ్ళ కామన్ పోలిక) అన్నమ్మగారి చేతిలోనూ హేండు బ్యాగు ఉంది. వాటర్‌ప్రూఫు వుగాకు రంగు బ్యాగు దానికి ఉంగటాలు తెగటంవల్ల కలిపి ఉచ్చుపోసి చేత్తో పట్టుకోవలసి వచ్చింది. దాని తాలూకు చిల్లుల సందునుంచి మాగిన అరటి పళ్ళు కనిపిస్తున్నాయి. పెళ్ళికూతురును చూడటానికి ఉత్త చేతుల్తో రాకూడదు కాబట్టి ఒక డజను అవి తీసుకొచ్చింది. దూరదృష్టిగల అన్నమ్మగారు.

"బ్రేక్‌ఫాస్టుకు డైనింగ్‌రూముకు వెళ్దామా" అన్నాడు వియ్యంకుడు... పార్వతీ పరమేశ్వరులులాగా కనుపించే ఆ దంపతుల్ని చూసిన అన్నమ్మకు తన భర్త జ్ఞాపకానికివచ్చి ఆయన యీ వైభవంచూసి ఎంత సంతోషించేవాడో కదా అని లోలోపల ఊ ఊ ఊ ఇదయిపోతోంది.

ముందు నౌకర్లు దారిచూపుతున్నారు. వెనక వియ్యం కుడు, వియ్యపురాలూ వయ్యారంగా నడుస్తున్నారు. ఆ వెనక, బుష్‌షర్టు వేసిన నీలిమందు చొక్కా శీనయ్యా, సంచీ చేతబట్టి వాళ్ళ అమ్మా నడుస్తూ డైనింగురూముకు వచ్చారు. ఆ డైనింగు టేబిల్ దగ్గర ముందుగానే ఒక అప్సరసలాంటి పదహారేళ్ళ అమ్మాయి— అందులోనూ రెండుజడల అమ్మాయి- ఖరీదైన సిల్కుబట్టలు వేసుకుని కూర్చుని ఉంది.

"ఏం డాడీ, వాళ్ళు రాలేదా?..." అని అడిగింది. మరి శీనయ్యా, వాళ్ళమ్మలను చూసికూడా అట్లా ఎందుకు అడిగిందో... పెళ్ళికొడుకంటే ఆవిడ దృష్టిలో ఎంత ఉన్నతంగా ఊహించుకుని ఉన్నదోమరి... ...లేక శీనయ్య ఆవిడ దృష్టిలో ఎలా కనిపించాడో.

"వచ్చారమ్మా. వీళ్ళే వచ్చింది. ఇతను శ్రీనివాస రావు, వీరు వారి అమ్మగారూ... మిష్టర్ శ్రీనివాసరావు, ఈమె నాకు ఒక్కగాని ఒక్కకుమార్తె... అఫ్‌కోర్స్ ఇంకా ఒక కొడుకు ఉన్నాడనుకో. వాడు ఏడింటికే కాన్వెంటుకు వెళ్ళిపోయాడు" అని వాకళ్ళకొకళ్ళను పరిచయం చేశాడు. ఆ అమ్మాయే పెళ్ళికూతురు అని తెలిసి తల్లి, కొడుకులకు మతులు పోయాయి.

"ఇదేమిటిరా బాబూ ఇంత అందమైన అమ్మాయిని తాను పంచేసుకునేట్టు... ఆ అమ్మాయి కట్టుకున్న చీర ఖరీదుచెయ్యాదు తన అయిదెకరాలలో మిగిలిన మూడెకరాలు ... ఇటువంటి అవస్థ తెచ్చిపెట్టావేమిరా భగవంతుడా" అనుకున్నాడు శీనయ్యా. "ఇదేమిటి నా బొంద, యీ పిల్ల ఇంత

బరి తెగించి ముందే వచ్చి కూర్చుంది. ఒక పల్లె సంప్రదాయాలు తీసుకు రావటంగానీ, సిగ్గుపడుతూ వచ్చి కూర్చోటం గానీ ఏమీ లేకుండా తగుదునమ్మా అని తానే వచ్చేసింది. ఇక రేపు యీ పిల్ల నాకేం వండి పెడుతుంది" అనుకుంది అన్నమ్మ గారు.

ఇక పెళ్ళికూతురు దృష్టిలో ఆవిడ అంటే అన్నమ్మ గారు— ఒక వంటమనిషిగానూ, అతగాడు అంటే శీనయ్య ఒక వారాల పిల్లాడుగానూ కనుపించారు. ఎందుకంటే ఆ పిల్ల బుద్ధి తెలిసినప్పటినుంచీ ఆమె తిరిగిన సర్కిల్ అంతా తనకు సమాన హోదాలో ఉన్నవారితోనే. తనయింట్లో పనిచేసేవాళ్ళే శీనయ్యా అన్నమ్మలకంటె కొంచెం నాగరికంగా కనుపించారు.

టేబుల్ మీద తెల్లటి గుడ్డలు పరచి అందమైన ప్లేట్లలో ఖరీదయిన బిస్కట్లూ, పళ్ళూ పెట్టబడివున్నాయి.

"పెళ్ళి పిండివంటలు కూడదు; కాఫీ, ఉప్మాలు లేకుండా గోరుస్టి వాళ్ళకు పెట్టినట్లు ఈ బిస్కట్లూ, పళ్ళూ ఏమిటిః" అనుకున్నది అన్నమ్మ.

వెంటనే "ఇవన్నీ నాకు అలవాటు లేవు" అని నిష్కర్షగా చెప్పింది.

"పోనీ పాలు తీసుకోండి".

"పాలు నా వంటికి పడవు".

"పోనీ చిక్కటి మజ్జిగ తీసుకోండి".

"పరగడుపున మజ్జిగ తాగితే నాకు వాంతులు పట్టుకుంటాయి. అసలే నా వంట్లో బాగుండలేదు. రాత్రి తిన్న

రొట్టెముక్క అరిగి చావలేదు. అజీర్తి చేసినట్లుంది" అని తెగేసి చెప్పింది. అప్పుడు శీనయ్యముఖం చూచితీరాలి. కేవలము అనుమానం తాగినముఖం పెట్టాడు. వాళ్ళముందు కన్నతల్లి చద్ది రొట్టెముక్క సంగతి ఎత్తటం ఏమీ బాగాలేదు అతనికి. ఎలా చెప్పటం తల్లితో... చచ్చినట్లు నోరుమూసుకు కూర్చున్నాడు, పచ్చి వెలక్కాయ తిన్న పసిపిల్లాడిలాగ.

"పోనీలేవాడీ. లెటజ్ బిగిన్" అంది ఆ మిఠాయిపొట్లం లాంటి ఆ పెళ్ళికూతురు.

"చూశావా ఎంత పొగరో ఆ పిల్లకు" అనుకుంది అన్నమ్మ.

వాళ్ళంతా స్పూనుల్తో సుతారంగాచిదుపుకుని తింటున్నారు. శీనయ్య అవస్థ పరమాత్ముడికి తెలుసు. గట్టిగా పొడిస్తే ఆ ప్లేట్లు ఎక్కడ ఎగిరి కిందపడతాయో...

"ఫరవాలేదు. స్పూన్ను అక్కడపెట్టి చేతితో తీసుకు తినండి" అన్నాడు పెళ్ళి కుదిర్చే పెద్ద, అతని అవస్థ చూసి. అనటమే తడవుగా ఆ స్పూన్నుకు స్వస్తి చెప్పి, చేతులకు పని చెప్పాడు శీనయ్య...

ఎలాగోలా ఫలహారాదులయ్యాయి. ప్రత్యేక డ్రస్సులతో వచ్చిన సర్వర్లు వచ్చి వడ్డిస్తుంటే వాళ్ళంతా ఎవళ్ళో ఆఫీసర్లనుకుని అన్నమ్మగారు పమిట సర్దుకుని, లేచి నిలబడబోయింది. కొడుకు ఎవరూ చూడకుండా తల్లి చేతులు గిల్లి కూర్చోపెట్టాడు.

"గ్రాడ్యుయేషను అయిన తర్వాత ఏం చేద్దామను కుంటున్నారు?" అని అడిగాడు పెళ్ళికూతురి తండ్రి.

"ఏమీ అనుకోలేదు" నిర్లిప్తంగా చెప్పాడు శీనయ్య.

"పై చదువులకు వెళ్ళాలనుకుంటున్నారా?".

"డబ్బు చూసుకొని— మా అమ్మ చెప్తేనే వెళ్ళాలి వుంది."

ఇంతలో పెళ్ళికూతురు తల్లి కల్పించుకుని "మీ అమ్మ చెప్పించకపోతే మా యింటికి వచ్చేసెయ్యండి. ఇక్కడ మావారే చదువు చెప్పిస్తారు. ఆపైన మీరు ఆయనకు నచ్చితే ఏ మినిష్టరుకో చెప్పించి ఉద్యోగం విషయంకూడా చెప్పిస్తారు" అన్నది.

వెంటనే అన్నమ్మగారు అందుకుంది. అదేనమ్మా నా ఆలోచనకూడా. వాడికి వెనకా ముందూ ఎవ్వరూ సపోటా (సపోర్టు ఇంగ్లీషు పదానికి ప్రత్యామ్నాయం) లేరు. మీరే కడుపులో పెట్టుకుంటే"—

పెళ్ళికూతురు ఫక్కున పగిలబడి నవ్వింది కాబోయే అత్తగారి ఇంగ్లీషు పాండిత్యానికి. దానితో బట్టతలాయనా ఉత్సాహంగా నవ్వేశాడు... పెద్దలూ నవ్వేశారు. శీనయ్య మాత్రం నవ్వలేదు. కోపంతో, సిగ్గుతో అతని ముఖంఎర్రగా జేవురించింది. అసలు యీ ముసిలిదాన్ని మాట్లాడమన్న దెవరు. తెలియనిది తెలియనట్లు పడుండదు. వాళ్ళు అంత హోదాగా మాట్లాడుతుంటే తాను ఎంత నీచంగా హీనంగా

తమకుతామే కించపరచుకుంటూ, తక్కువగా ఇన్‌ఫీరియారిటీ ఫీలవుతూ మాట్లాడుతోంది. తల కొట్టేసినంత పనయింది శీనయ్యకు. ఆవిడ ఉద్దేశ్యం ఏమిటో తెలుసు. ఆంతగల వియ్యంకులు దొరికితే భవిష్యత్తులో పుత్రరత్నం సుఖపడతాడుగదా అని ఆవిడ తలంపు... "ఈ సంబంధం అవ్వనీ, కాకపోనీ తర్వాత విషయం. వారిముందు తమ ఆత్మగౌరవం పోగొట్టుకుని తనకు తానే హీనపరచుకుని మాట్లాడటమేమిటి" అని శీనయ్య అనుకున్నాడు. వెంటనే తానందుకుని "అవేమీ యిప్పుడు తేల్చి చెప్పలేమనీ... అవన్నీ తర్వాత తేలవలసిన విషయాలనీ" చెప్పాడు. మనసులో అతనికి యీ సంబంధం చేసుకోవాలని లేదు. అంత పెద్ద ఎత్తుగల వారిలో వియ్యమందడానికి తన అంతస్థుకుమించిన విషయమని అతని ఉద్దేశ్యం. వియ్యానికయినా, వైరానికయినా సమానవృద్ధిలుండాలంటాడతను...

పర్యవసానం యేం జరిగిందంటే... శీనయ్య ఆలోచించి కబురు చేస్తానని వాళ్ళతో అన్నాడు... పిల్ల అభిప్రాయం కనుక్కుని తర్వాత కబురంపిస్తామని వాళ్ళన్నారు... అంతే ఇద్దరికీ యిష్టంలేక సంబంధం పెడిసికొట్టింది. ఇంకొకళ్ళయితే యీసంబంధానికి ఎగిరిగంతేసేవారేమోగాని, ఆత్మాభిమానం గల శీనయ్య అనేకవిధాల ఆలోచించి తాహతుకు మించిపోవటము మంచిదిగాదని తానేతప్పుకున్నాడు. అయినా అన్నమ్మగారు వూరుకోలేదు, తిరిగివచ్చిన మర్నాటినుంచీ కొడుకును సతాయించడం మొదలుపెట్టింది "సంబంధం విషయం ఏమి చేశావూ" అని.

"నీవు అరచి గోలపెట్టినా ఆ తెల్లపసుగను తెచ్చి నా వాకిట్లో కట్టేసుకోలేను" అని కొడుకు తెగేసి మరీ చెప్పాడు.

*　　　　*　　　　*

పిల్ల కాయ విషయంలో అన్నమ్మగారు బోలెడు బెంగ పడిపోతోంది. ఏ సంబంధం వచ్చినా యేదో సాకుచెప్పి తప్పించుకుంటున్నాడని ఆవిడ అభిప్రాయం. ఒక సంబంధం పిల్ల తాతగారు నచ్చలేదంటాడు! ఒక సంబంధం 'అమ్మో వాళ్ళు పెద్ద ఎత్తువాళ్ళు, వాళ్ళతో మనము తూగలేము' అంటాడు. ఇంకోదానికి యింకో కుంటిసాకు... తన పోరు పడలేక నోటితో లేదనకుండా చేతల్తో లేదని చెబుతున్నాడు. "ఇక వీడు కొడుకూ కాదు, నేను తల్లినీకాదు" అని పరవళ్ళు త్రొక్కటం ప్రారంభించింది అన్నమ్మగారు.

ఇక శీనయ్య అవస్థ... ఏదో గంతకుతగ్గ బొంత వస్తే చేసుకుందాంగదా అని. అదేం ఖర్మమో వొకటి తనకంటె తక్కువ స్టేటసుకలది... అంటే అతని ఉద్దేశ్యంలో పల్లెటూరి రకం... చదువు సంధ్యలు తక్కువ... మేనర్సులేవు ఇత్యాది గుణాలు కలది. రెండోది... అత్యాధునికం. ఆ సంబంధమే చేసుకుంటే ఆ యింట్లో కూరగాయలు తీసుకురావటం దగ్గర నుంచి, ఆవిడకి చీరలు జేరవెయ్యటంవరకూ పనులన్నీ తన వంతే అవుతాయి. వాళ్ళమీద ఆధారపడి, వాళ్ళ డబ్బుతో చదువుకుని, వాళ్ళ ప్రాపుమీద వుద్యోగం తెచ్చుకుని వాళ్ళ

చెప్పుచేతల్లో వుండవలసివచ్చినప్పుడు ఆ యింట్లో అందరికీ లోకువే అవుతాడుగా తను. చంటి బావమరిదిని ఎత్తుకున్న పాకెట్లో "కాకి"ని చూపెట్టడంకూడ తనవంతే అవుతుంది. తనకు వ్యక్తిత్వం వుండదు.

"అయ్యగారి అల్లుడు", "పెద్దమ్మాయి మొగుడు" ఇవే అతని వ్యవహారిక నామాలవుతాయి... అందుకని ఆ సంబంధాలు వద్దన్నాడు... ఈతని బాధ తల్లి గ్రహించదు. ఇంతకీ ఆ తెరచాటు సుందరి ఎవరో, ఎక్కడుందో, ప్రపంచమంతా గాలిస్తే ఏమూల దొరుకుతుందో... ఇవేఅతని ఆలోచనలు!

ఇలా వుండగా వొక శుభ ముహూర్తాన శీనయ్య యింటికి ఒక పెద్దమనిషి వచ్చాడు. బంతిపువ్వురంగు పాంటులోకి నీలంరంగు క్రేపుచొక్కా ఇన్‌షర్టు వేసుకుని నల్లద్దాల కళ్ళజోడు పెట్టుకుని మాసికలు వేసిన హాఫ్‌బూటు వేసుకుని చేతిలో గోల్డుఫ్లేకు పెట్టె, అగ్గిపెట్టె నాజూగ్గా పట్టుకుని వచ్చాడు. క్రాపింగు మధ్యలో ఒకదుబ్బు వెంట్రుకలు ముడి పెట్టబడి వున్నాయి.

"ఏమండీ అన్నమ్మగారియిల్లు ఇదేనా? ఇక్కడ శ్రీనివాసరావు అనే బి. ఏ. చదువుతూన్న పిల్లకాయ ఉన్నాడట" అంటూ. అన్నమ్మగారు గానంచా కట్టుకుని మడితో వంట చేసుకునేదల్లా తలుపు దగ్గరవేసి క్షణంలో మడివిప్పి మల్లు పంచ కట్టుకువచ్చింది. "ఎవరండీ మీరు. ఏంపనిమీద వచ్చారు" అంటూ. ఆవిడఉద్దేశ్యంలో ఇంటికి ఎవరువచ్చినా కొడుకుకు పిల్ల నివ్వటానికి వచ్చినవాళ్ళే అయివుంటారని.

బాకీలకోసం ఎవరూ తన యింటికి రారు. కొడుకుకూడా ఇంతవరకు బీడీలఅలవాటు లేదు. కనుక కిళ్లీబడ్డీలవారుకూడా రారు బాకీలకోసం. ఇంతకూ యీ వచ్చినాయన కిళ్లీబడ్డీ తాలూకు అయివుండడు. కారణం అన్నమ్మగారి దృష్టిలో అతను సూటు వేసుకున్నాడు గనక. కాళ్ళు కడుక్కునేందుకు, దాహం తీర్చుకునేందుకు విడివిడిగా చెంబులతో నీళ్ళిచ్చి "ఏమిటండీ పని? మావాడు యిప్పుడే అలా క్రాపింగు వేయించుకువస్తానని వెళ్ళాడు, ఇప్పుడే వస్తాడు" అని అన్నది. శ్రీనివాసరావుకూడా వచ్చాడు. చిరిగిపోయి, మాసిపోయిన చొక్కా-లాగూ, దానినిండా అంగుళం, అరఅంగుళం, పాతిక అంగుళాల కొలతలు క్రాపింగు వెంట్రుకలు మొహంనిండా క్షవరం. తాలూకు రజను, ఆయనా సిద్ధం...

"ఇతనేనండీ మా అబ్బాయి శీనయ్య".

"ఆయన శ్రీనివాసరావూ అంటుంటే ఈవిడ శీనయ్యా —శీనిగాడు అంటుందేమిటి చెప్మా. ఈవిడకు బొత్తిగా మతి లేదు" అనుకున్నాడు శీనయ్య మదిలో...

ఆ వచ్చిన సూటుగార్కు ఆ గోల్డుఫ్లేక్ పెట్టెలోనుంచి చార్మినార్ సిగరెట్టు తీసి శీనయ్యదగ్గర అగ్గిపెట్టె ఉందేమోనని అడిగాడు. తనదగ్గర పెట్టెలో పుల్లలు అయిపోయాయి. నాజూకుకోసం ఖాళీపెట్టె పట్టుకున్నాడు. శీనయ్యకు పొగ త్రాగే అలవాటుందేమో తెల్సుకునేందుకు అలా అడిగాడు ఆ వ్యవహర్త. పొగత్రాగే అలవాటు వుంటే జేబులోనుంచి తీసియిస్తాడుకదా... శీనయ్య ఇంటిలోకివెళ్ళి అడిగితే అక్కడా అగ్గిపెట్టె నిండుకుంది. వెంటనే కొరకంచు నొకటి తీసుకుని

స్మశానం సీనులో హరిశ్చంద్రుడులాగ పొగలు వెళ్ళగ్రక్క కుంటూ చుట్టందగ్గరకు అంగలు వేసుకుంటూ వచ్చాడు. ఆ చుట్టం వెంటనే ఆ సిగరెట్టు వెలిగించుకొని అసలు విషయం బయటపెట్టాడు.

"అన్నమ్మగారూ! మీ అబ్బాయి శ్రీనివాసరావుకు మా మేనగోడలు సుబ్బులునిచ్చి వివాహం చేద్దామని తలంపు. ఆ విషయమే మాట్లాడి పోదామని వచ్చా" నన్నాడు.

"ఏం మీరు వచ్చారు. ఆమ్మాయికి తల్లీ తండ్రీ లేరా" అన్నది అన్నమ్మ.

"ఛా-ఛా. అవేం మాటలండీ! మా బావగారూ, అక్కగారూ నిక్షేపంలావున్నారు. ఇది మా పెద్దమేనకోడలు. వాళ్ళకు వ్యవహారాలు అంతగా తెలియవు. అందుకని నేను వచ్చాను" అన్నాడు ఆయన చాలాపెద్ద వ్యవహర్తలాగ... అంతేకాదు... "పిల్ల నాకుమల్లే బాగానే ఉంటుంది. మీరు వచ్చి పిల్లను చూసుకుంటే, కట్నం కానుకలవిషయం అక్కడ మాట్లాడుకోవచ్చు"నని తేల్చిచెప్పాడు. అన్నమ్మ ఎగిరి గంతేసింది. "అసలు యిక తన కొడుక్కు సంబంధాలు రావేమో, వీడు ప్రతి సంబంధం ఏదో సాకుచెప్పి వద్దంటున్నాడు" అనుకుంది. శీనయ్య ప్రసక్తి లేకుండానే తల్లీ, ఆ వచ్చినాయన ఎప్పుడు ఇక్కడ బయల్దేరాల్సిందీ, ఎప్పుడు అక్కడికి చేరేదీ, ఎప్పుడు పిల్లను చూసేదీ, పంచాంగంచూసి నిర్ణయం చేసుకున్నారు. మధ్యలో వర్జ్యం ఉందిగాని, ప్రయాణంలో దాటిపోతుంది కాబట్టి ఫరవాలేదు అని సరిపెట్టుకున్నారు.

ఇంతకీ ఆయన చెప్పిన ఆ పెళ్ళికూతురుగారి ఊరు వెళ్ళాలంటే ఒక్క విమాన ప్రయాణం లేదుగాని తతిమ్మా ప్రయాణాలు అన్నీ చేయాలి.

అనుకున్నరోజుకు తల్లీ కొడుకులు మళ్ళీ అరటిపళ్ళూ, పూలూ కొనుక్కుని వెనకటి సంచీలోనే పెట్టుకు బయలుదేరారు.

"ఒరేయ్ ఈ ఆరణాలూ తీసుకువెళ్ళి యింకో సంచీ కొనుక్కురారా" అంది అన్నమ్మగారు ఆరణాలు డబ్బులు కొడుకు చేతిలో పెట్టి.

"ఎందుకూ ఈ సంచీ వుందిగా".

"నీకు తెలియదు వెళ్ళిరారా. ప్రతి మాటకూ ఎదురు చెప్పటం నేర్చుకున్నావు యీమధ్య...... ఆ సంచీ అచ్చి రాలేదు. కొత్త సంచీ అయితే కలిసొస్తుందేమోనని" అని అంది నవ్వుతూ.

"ఆరణాలకు సంచీ ఎవడిస్తాడే".

"ఇస్తాడురా. సైను బట్టమీద అద్దకం వేసినవి వస్తున్నాయి".

"పెళ్ళికి వెళ్తూ సైనుబట్ట ఏమిటే".

"అద్దకం అద్దారు కదా ఫర్వాలేదు".

ఇంకా తల్లికి ఎదురుచెపితే కోపం వస్తుందని శీనయ్య వెళ్ళి ఏదోసంచీ తెచ్చాడు. ప్రయాణమయ్యారు.

మొదట రైలుమీద వెళ్ళి, అక్కడినుంచి కారుమీద వెళ్ళి, ఒకచోట దిగాలి. అక్కడినుంచీ బండి మీదయితే చుట్టూ తిరిగి రెండుగంటలలో వెళ్ళొచ్చు. అడ్డదారిన నడచి

వస్తే ఒకగంట ప్రయాణం. సైకిలుమీద వెళ్ళేమార్గం ఉంది కాని కాలవదాటాల్సి వచ్చినప్పుడు బల్లకట్టుమీద కొంచెం అవస్థ పడాలి. అయినా ఆ ప్రాంతంలో సైకిళ్ళు దొరకటం కూడా కష్టమే. శీనయ్యాను కాబోయే అత్తగారి వూరికీ, బయట ప్రపంచానికీ ఏమీ సంబంధం ఉండదు. రాజులు మారినా, రాజ్యాలు మారినా, వాళ్ళకు తెలియదు. ఆ వూరికి పత్రికలు రావు. రేడియో అసలు లేదు. ఆ వూరివాళ్ళకల్లా తెలిసింది మకుటంలేని మహారాజు, శీనయ్యకు అయితేగియితే మామగారు ఆ కర్ణంగారుఒకరే... అవాశీల్దారులూ, రెవిన్యూ ఇన్సపెక్టరులుకూడా బుర్రలోపడి ఆ వూరు రాలేక కాలవ గట్టున నిలబడే అన్నీ సంతకాలుపెట్టి పోతూవుంటారు. ఆ మహారాజుకుఅల్లుడు మనశీనయ్య (అయితేగియితే). ఆ మహారాజు పేరు పరంధామయ్యగారు.

పరంధామయ్యగారి కుటుంబం పెద్దదే... ఆయన, ఆయన భార్యా, పెద్దకూతురు సుబ్బలక్ష్మికాక మరినలుగురు కూతుళ్ళూ, ఇద్దరు కొడుకులూ, సుబ్బలక్ష్మి నాయనమ్మా ...వీళ్ళుకాక తరుచు సుబ్బలక్ష్మి మేనమామ (సూటు బోరు) వచ్చిపోతూ ఉంటాడు. ఆయన ఒక బీడీల కంపెనీలో అసిస్టెంటు మానేజరు. అంటే అందరు కూలీలూ సరిగ్గా పనిచేస్తున్నారా లేదా, కట్టలు సరిగ్గా కడుతున్నారా లేదా అజమాయిషీ చేస్తూవుండటం. ఖాళీ దొరికినప్పుడు కోర్టులదగ్గరా, రిజిష్టరాఫీసులదగ్గరా వుండి దస్తావేజులూ, కోర్టు పిటీషనులూ వ్రాసి, సాక్షి సంతకాలు చేసి పావలా, పరకా సంపాదిస్తూ వుంటాడు. పరంధామయ్యగారుకూడా

బావమరదికి తన వ్యవహారాలు బస్తీలో చూసిపెడుతున్నం దుకు సంవత్సరానికి నాలుగు మానికెలు కెసలూ, నాలుగు మానికలు మినుములు కొద్దిగా కందులూ పంపిస్తూ ఉండటం అలవాటు. అంతేకాదు సంవత్సరానికొకసారి తన తోటల్లోని ఊరగాయకాయ అంటే, మాగాయకూ, ఆవకాయకూ సరిపడ మామిడికాయలుకూడా సప్లయిచేస్తూ ఉంటాడు. ఈ సదు లాయలన్నీ వున్నాయి కాబట్టి పెళ్ళికి పిలవటానికి సుబ్బలక్ష్మి తండ్రి తరఫున మేనమామ పక్షీశ్వరరావు బయలుదేరాడు. పక్షీశ్వరరావు పేరు మీకు కొత్తగా కనిపించవచ్చు. పరం ధామయ్య మామగారికి ఎన్నాళ్ళయినా పిల్లలు లేకపోతే ఒక నాడు ఒక పకీరు వచ్చి ఏదో హితోపదేశం చేశాడట. ఆ మంత్రోచ్చారణ నలభైరోజులు చేసి పదమంది పకీరులకు అన్న దానం చేసినతర్వాత పక్షీశ్వరరావు వాళ్ళ అమ్మ కడుపున బడ్డాడు. కొడుకు పుడితే తమపేరు పెట్టుకోవలసిందని పకీరు మొదటనే ఆదేశించాడు కాబట్టి, పేరులో ఏముందని అతని తల్లిదండ్రులు శ్రీ సీతారామాంజనేయ, వెంకట, నాగ, శివ కుమార, పక్షీశ్వరరావు అని బారసాలనాడు పెట్టుకున్నారట. అంత పేరుతో ఎవరు పిలుస్తారు? చివరిపేరు పక్షీశ్వరరావు ఒక్కటే శాశ్వతంగా నిలిచిపోయింది. ముద్దుపేరుగా కొంత మంది "బకే పకీరూ" అనికూడా అనేవారు. సదరుపక్షీశ్వర రావే యిప్పుడు బావగారికి లీగల్ ఎడ్వయిజర్‌గానూ, బీడీల కంపెనీకి జమాయిషీదారుగానూ, రిజిష్ట్రారు ఆఫీసులో శాశ్వత సాక్షీదారుడుగానూ (ఒక్కొక్క సాక్షీ సంతకానికి పావలా రివాజు) సవ్యసాచిగా పనిచేస్తున్నాడు.

అనుకున్నరోజుకు అన్నమ్మా, శ్రీనివాసులు—అల్లంత దూరంలో వెలిసిన సుబ్బలక్ష్మి దర్శనార్థం—ప్రయాణమయి బయలుదేరారు. శ్రీనివాసుకు యీసారి కొంచెం డ్రస్సు మార్చాడు. వెనక వెళ్ళిన భాగ్యవంతుల సంబంధంతో కొంచెం అనుభవమయింది. ఈసారి సింపుల్‌గా, బాగానే కనిపిస్తున్నాడు. కాని ఏం లాభం... ...

రైలు ఎక్కేటప్పుడు పడ్డఅవస్థ ఇంతాఅంతా కాదు. ఆ స్టేషనులో బండి ఆగేది అరనిమిషం. ముందు తాను, వెనుక అన్నమ్మగారూ అరటిపళ్ళసంచీపుచ్చుకుని ప్లాటుఫారం ఈ చివరినుంచి ఆ చివరివరకూ పరుగుపందెం పెట్టినట్లు పరుగెత్తారు. ఒకపెట్టె రిజర్వు చేయించుకున్నది... ఒకపెట్టెలో మిలిటరీవాళ్ళు... ఇంకో పెట్టెలో తపాలాశాఖవారు... మరో పెట్టె ఫస్టుక్లాసు... ఇంకొకటి సెకండుక్లాసు... మిగిలినవి ఒక ఇంజను, గార్డుపెట్టె, పక్కలకూడా వేళ్ళాడుతున్న మూడో తరగతి పెట్టె ఒకటి. దానిలోకి పాల కావిళ్ళవాళ్ళు, వాళ్ళ బిందెలూ, కావిళ్ళూ అన్నీముందు ఎక్కించి, తర్వాతచుట్టలు వెలిగించి, చతుర్లాడుకుంటూ, వాళ్ళుకూడా ఎక్కారు. వెనక పెరుగు బుట్టలు... ఆవెనక శీనయ్య, వాళ్ళఅమ్మ అన్నమ్మా ... ... ఇంతలో పైన వెళ్ళిన పెరుగుబుట్ట ఎవరో తోసేసరికి కొంచెం వరిగింది. ఆ పెరుగు శీనయ్య చొక్కామీదనుంచి జారి అన్నమ్మ నెత్తినిండా పడింది. అది తుడుచుకుంటూ కూర్చుంటే రైలు దాటిపోతుంది. ఎలాగో ఆగేట్లలోవాళ్ళను తప్పించుకుని శీనయ్య లోపలికి జేరి తల్లిచేయి పట్టుకుని గుంజటం మొదలుపెట్టాడు. జనంమధ్య ఆవిడ మొదటిమెట్టుమీదే

ఇరుక్కుపోయింది. అది తెలియని శీనయ్య తల్లి చెయ్యిపట్టు వదలకుండా తలుపుకు తన్నిపట్టి లాగుతున్నాడు... బయట అన్నమ్మగారు "నా చెయ్యా, నా చెయ్యో" అని అరుస్తోంది. ఆ హడావుడిలో ఆత్రానికి తల్లి రోదన ధ్వని వినిపించడంలేదు... రైలు కదిలింది... ఇంతలో ఎవరికో రైలు పాగపడని సందర్భంలో వాంతులు. కాఫీగ్లాసులు బయటకు యిస్తుంటే మిగిలిన కాఫీవర్షం, తిని విసిరివేసే వేరుశనక్కాయ తొక్కలూ, వీటన్నిటిమధ్య అన్నమ్మగారు పక్కవాళ్ళ సాయంతో లోపలికి జేరవేయబడింది.

"ఎందుకు మామ్మగారూ! ఈ వయస్సులో మీకీ అవస్థ. ఇంటిపట్టున హాయిగా కూర్చోలేక" అన్నాడు బీడీ కాలుస్తూ వయ్యారంగా వేళ్ళాడుతున్న బటాణీలవాడు... లోపల ఖాళీ ఏదీ?... ఒక కాలు క్రిందమోపి, రెండో కాలు ఎక్కడ పెట్టాల్సిందీ తెలియక, ఖాళీ ఉండకదా అని పాల కావిడిమీద పెట్టింది. దానితో వాడు—ఆ పాలకావిడివాడు —తారామండలానికి లేచి అన్నమ్మగారినీ, ఆవిడ వారసుల్నీ వరసవారీగా విభజించి మరీ తిట్టాడు. ఈ హడావుడిలో అరటిపళ్ళు నలిగిపోయి, గుజ్జుగుజ్జు, తొక్కలకు తొక్కలు విడివిడిగా వచ్చేసి, సంచీమీద ఈగలు దండయాత్ర చేయటం మొదలెట్టాయి.

"ఏముంది బాబూ! ఆ సంచీలో... ఈగలు అట్లా ముసురుతున్నాయి" అన్నాడు ఒక రిటైరుడు హెల్తు ఇన్స్పెక్టరు.

"మేష్టారూ! మీ చేతిలో పేపరు ఒకసారి ఇట్లా ఇస్తారూ" అన్నాడు బర్తుపై బెడ్డు పరచుకు పడుకున్న పెద్ద మనిషి. కాబోయే అత్తవారింటికి దాబుగా పేపరుచదువుతూ వెళ్ళవచ్చుకదా అని శీనయ్య ఒక ఇంగ్లీషు పేపరు కొన్నాడు. అదికాస్తా ఇంతవరకూ తాను తెరచన్నా చూడలేదు. పెద్ద మనిషి ఆసామి నశ్యం చేసుకున్నాడు. పేపరు తీసుకున్నవాడు పోనీ తనకు నాస్త ఇగా ఇచ్చాడా?... అదీలేదు... ఒక పిల్లమీద ఒకావిడ ముడుచుకు పడుకుంది. "ఏమండీ కొంచెం లేస్తారా—ఈవిడ కూర్చుంటుంది" అని తల్లిని చూపెట్టాడు శీనయ్య... ఆవిడ తన ప్రాణం అప్పుడే పోయినట్లు నటించి "సుస్తీ మనిషిని" అన్నది. ఆడవాళ్ళ స్టైలో మగవాడు ఎక్కితే ఏ జంతువునో చూసినట్లు చూసి కెవ్వున కేక వేసి గార్డునో, స్టేషను మాష్టరునో, టిక్కెట్టు కలక్టరునో పిలుస్తారే యీ ఆడవాళ్ళు! మగవాళ్ళ స్టైలోకి రానటమే నాకంటా హాయిగా కాళ్ళు చాపుకు పడుకుంటారేమా అనుకున్నాడు శీనయ్య. మరోసారి పెద్దమనిషి పడుకున్నవాడిని లేప బోతే "హాం హైదరాబాదు జాతే" అన్నాడు. వాడు హైదరాబాదు జాతే అయితే ఎవడికి కావాలి, వల్లకాట్లోకి జాతే అయితే ఎవడికి కావాలి... మొత్తంమీద వాడు లేవలేదు. ఇంత హడావుడిలోనూ సినిమాపాటలు, రాజకీయ నాయకుల గురించి వాగ్వాదాలు, కోట్లతీప్పలూ, ఒకటేమిటి కోలాహలంగా అరుపులు, చుట్టపొగలు, ఉమ్ములు, వేరుశనగకాయ తొక్కలు... రైలుమాత్రం బరువుగా వగరుస్తూ సాగిపోతూనే వుంది. శీనయ్యా, తల్లీ ఒంటికాలుమీద శూన్యంలో

నృత్యంచేస్తూనే ఉన్నారు. శీనయ్య స్త్రీ-బొక్కాసింహ పెరుగు మరకలే...

ఎట్లాగయితేనేం, రైలు ప్రయాణం ముగిసి, జనాన్ని తోసుకు పెట్టెలోనుంచి బయటపడ్డారు... రెళ్ళ లేకపోతే పీడానాడా పోయిరి, ఈ ప్రయాణాలుమాత్రం చేయలేను శీనయ్య విసుక్కుంటున్నాడు.

"మరి ఎలా వస్తుందనుకున్నావ్ రాజ్యం" అని శీనయ్య మీద విట్టువేసింది అన్నమ్మ.

ఇక్కడికి ఒకరకం ప్రయాణమయింది. స్టేషనునుంచి జట్కా చేసుకుని బస్సుస్టాండుకు వచ్చారు. వీళ్ళ జట్కా ఆగుతూండగానే ఒక బస్సు బయలుదేరి వెళ్ళిపోతోంది. ఆ బస్సుకు లోపల, టాపుమీద, ప్రక్కల జనం. ములగచెట్టుకు గొంగళిపురుగులులా అతుక్కుపోయి, బస్సు కాస్తభాగమయినా కంటికి కనుపించడంలేదు. మనుష్యులతో తయారయిన ఒక పెద్ద ముద్ద పరుగెడుతున్నట్లుంది... అది తప్పితే మళ్ళీ నాలుగు గంటలవరకూ బస్సులేదు. అది తెలిసి శీనయ్య "హోల్డాన్" అని బస్సువెనక పరుగెత్తటం మొదలెట్టాడు గాని లాభంలేకపోయింది. ఆ బస్సు "కదిత్తే మరి ఆగను" అన్నట్లు వెళ్ళిపోయింది.

నాలుగు గంటలసేపు— అంటే మళ్ళీ బస్సు వచ్చే వరకూ— ఏంచేయాలో శీనయ్య కర్థంకాలేదు. ఎండ మండిపోతోంది. దగ్గరలో సాయబుల టీ హోటలు ఒకటి వుంది. అక్కడ అంతా నానా గోత్రీకుల్యా ఉన్నారు. లారీ క్లీనర్లు, రైల్వే పోర్టర్లు, బస్సులదగ్గర ఉండే కూలీలు వగైరా వగైరా

... వాళ్ళమధ్యన తీసుకువెళ్ళి కూర్చోబెట్టాడు తల్లిని శీనయ్య. అంతకు మినహాయించి ఆ ప్రాంతంలో చెట్టునీడకూడా లేదు. వంటయిల్లనబడే గదిలోనుంచి ఏదో వాసన బయటికి తెరలు తెరలుగా, అలలు అలలుగా వస్తోంది. అది అన్నమ్మగారి నాసికా పుటాలువరకూ వచ్చి, ఆవిడ తాలూకు మూడురోజుల క్రితం చేసిన భోజనంకూడా తెరలు తెరలుగా లోపలనుంచి బయటికిరావటం ప్రారంభించింది.

గ్రుక్కలనీరు గ్రుక్కను కుక్కుకుంటూ లవంగపు మొగ్గ తెప్పించుకుని వేసుకుని అవస్థపడుతోంది ఆవిడ. ఇంతలో ఒకడు మడ్డిబనీనూ, లుంగీ వేసుకుని బీడీ కాలుస్తూ చేతివేళ్లు గ్లాసులోముంచి జర్మన్‌సిల్వర్ గ్లాసులో మంచినీళ్ళు అన్నమ్మగారి ముందు పెట్టి "హాం కావాలా మామ్మాజీ" అని అడిగాడు... అంతే అన్నమ్మగారు చేతివేళ్ళు నోటికి అడ్డుపెట్టుకుని బైటికి పరిగెత్తి భళ్ళభళ్ళా కక్కేసుకుంది. నోరెండి చావనన్నా చస్తాగాని ఆ మంచినీళ్ళు గుక్కెడుకూడా తాగనని శపథించుకు కూర్చుంది. మళ్ళీ హోటల్లో అడుగు పెట్టలేదు.

సాయంకాలం నాలుగు గంటలు దాటిన తర్వాత దుమ్ము రేపుకుంటూ శరవేగంలో వస్తున్న కారును చూసేసరికి అక్కడున్న వారందరికీ చచ్చిపోయిన పెద్దలో, మొక్కుబడులు తీసుకున్న దేముడో వస్తున్నట్లనిపించి తమ తమ సామానులు తీసుకుని కారుకుఎదురుగా పరుగెత్తటం మొదలు పెట్టారు. అది వచ్చి రాగానే బయలుదేరుతుంది. ఇందులో కూడా టిక్కెట్లు దొరకకపోతే, ఈ రాత్రి అన్నమ్మగారి అవస్థ

తద్వారా శీనయ్య అవస్థ పరమాత్ముడికి తెలుసు. కోడలి సంగతి దేవుడెరుగు. దాహంతోనో, ఆకలితోనూ అన్నపూర్ణ గారు కాస్తా వాడి అనేటట్లుంది.

భార్యకోసం కాకపోయినా, ఇప్పుడీ తల్లికోసమన్నా అతడు యీ కారులో టిక్కెట్టు సంపాదించాలి... కారులో నుంచి దిగే ప్రయాణీకులు దిగగానే ఎక్కే ప్రయాణీకులు తోసుకుంటూ, ఒకరిమీదనుంచి వొకరు పడుస్తూ, సామానులను, ముసలివాళ్ళను తొక్కుకుంటూ బలంగలవాళ్ళంతా లోపలికి తోసుకు తోసుకు ఎక్కారు. వాళ్ళతోపాటు శీనయ్యకూడా ఎలాగోలా ఎక్కాడు. ఆ ఎక్కటంలో ఎవరో అతని కాలు చెప్పుకాలితో నలగదొక్కితే అది చిట్లింది. నెత్తురు కారటం మొదలుపెట్టింది. ఆ నెత్తురు చూసుకోవటం మొదలుపెడితే తన మీదనుంచే జనం నడిచిపోతారని, అడుగున బాధ భరిస్తూ జనాన్ని తోసుకొని **ఎలాగోలా** ఎక్కి తల్లికోసం సీటుమీద తుండుగుడ్డ **పరుచుకు** కూర్చున్నాడు. ఈలోపల ఎవరోవచ్చి ఆ తుండు లాగి క్రిందపారేసి తాను కూర్చున్నాడు. ఆజానుబాహువు. నల్లగా తుమ్మమొద్దు ఛాయలో వుండి బారెడు చుట్ట కాలుస్తున్నాడువాడు. వాడి కాలికి మంచిపాటి చెప్పులుకూడా వున్నాయి. అక్కడికీ శీనయ్య ఊరుకోలేక "అక్కడ మనుష్యులున్నారు" అన్నాడు.

"ఉంటే నన్నేంచేయమంటావు?" అన్నాడు అతగాడు కొట్టవచ్చేటట్లు. దానితో శీనయ్య నోరు మూసుకున్నాడు.

ఇంతలో ఎవరో "టిక్కెట్లు క్రింద యిస్తున్నారు. టిక్కెట్టు లేనివాళ్ళంతా దిగండి" అని అరిచాడు. ఇక

చూడండి అవస్థ. ఈ ఎక్కినవాళ్ళంతా మేకలమందగా బిల బిలలాడుతూ దిగి ఆ కండక్టరున్న గది దగ్గరకు పరిగెత్తారు. వాళ్ళతో శీనయ్యకూడా పరిగెత్తి, బుడుంగుని జనప్రవాహంలో మునిగిపోయాడు... బతుకు తోసుకుంటున్నారు. క్రిందపడ్డ వాళ్ళనుకూడా కనికరించకుండా పైనుంచి నడిచి వెళుతు న్నారు. జనంలోనుంచి అరుపులు, ఆర్తనాదాలు, ఏడుపులు, నవ్వులు... ఒకటేమిటి... శీనయ్య అందులో ఏ స్థితిలో స్థితిలో ఉన్నాడో తెలియక అన్నమ్మగారు జనసమూహం బైటనుంచి శోకాన్నాలు ప్రారంభించింది.

“ఈ పెళ్ళి కాకపోతే పీడానాడాపోయింది. టిక్కెట్లూ వద్దు, ఏమీవద్దు. తిరుగురైలులో వెళ్ళిపోదాం రారా” అని గావుకేకలు పెట్టింది. ఆ గోలలో ఆవిడ అరుపులు ఎవరికి వినిపిస్తాయి!... “రామనామ తారకం భక్తి ముక్తి దాయకం” జపం మొదలుపెట్టింది కొడుకు క్షేమంకోసం... అరగంటలో కొడుకు వీరభద్ర అవతారంలో బయటపడ్డాడు. కాలు వెంట ధారగా నెత్తురు కారుతోంది. చొక్కా తుంపులుతుంపులుగా చిరిగింది. పగిలిపోయిన అద్దాలబీరువాలాగ వుంది అతని శరీరం. లాగునిండా బురదమరకలు. జుట్టు నిక్కపొడుచుకుని వుంది.

“ఏమిటిరా నాయనా, వాడితో దెబ్బలాడావా?” అంది తల్లి. కొడుకు వాలకంచూసి కండక్టరూ, వీడూ కొట్టు కున్నారు [illegible] ఆ మాటలు ఏవీ శీనయ్య చెవిని పడట్లేదు.

"పద పద కారులో సీట్లు నిండిపోతాయి" అని తల్లి రెక్కపట్టుకుని కారులోకి ఈడ్చుకు పోయూడు...

ఆ కారులో కూర్చోవలసిందని గవర్నమెంటు లెక్క ప్రకారం నలభయి అయిదు. పన్నెండు, అరవై, డెబ్భయి, ఎన భయిమంది లోపల, మిగతా ఇరవై పై చిల్లర పక్కల, టాపు మీదా వున్నారు... అన్నమ్మగారి బుజాలమీద నలుగురు నలుగురు చొప్పున నిలబడ్డారు. ఎవరో చెప్పుకాలితో కాలు నొక్కిపట్టి ఉంచారు. చంటిపిల్లలకు ఊపిరాడక గుక్కపట్టి ఏడుస్తున్నారు. చంటిపిల్లలదాకా ఎందుకు? అన్నమ్మగారికే ఊపిరాడక ప్రాణం వదిలేటట్లుంది. ఆ మహాసముద్రంలో కొడుకు ఎక్కడున్నాడో! పిలుపుమేర ఎక్కడా కనుపించటం లేదు. ఈ హడావుడిలో అరటిపళ్ళ సంచీ ఎక్కడో జారి పోయింది. జనం కాళ్ళక్రింద పచ్చడిపచ్చడయి నామరూపా ల్లేకుండా అయిపోయి ఉంటుంది. అంత సుందరమైన హోటల్లోంచి ఎంతసేపటికీ రారు ఆ డ్రైవరూ, కండక్టరున్నూ. ఎట్లా అయితేనేం ఆరుగంటలకు నడవలేక నడవలేక నడిచే ముసలి పందిలాగ బస్సు బయల్దేరింది ములుగుతూ బయలుదేరింది. మొదటిలో అది స్టార్టు కాలేదు. కొంతమంది మగవాళ్ళను దిగి తోయమన్నారు. ఆ తోసేవాళ్ళలో శీనయ్య అవతారం కూడా ఉంది. "అవును! మరి కారు తోయకపోతే పెళ్ళాం ఎలా వస్తుంది" తల్లి మాటలు జ్ఞాపకానికి వచ్చాయి...

ఎలాగయితేనేం మొత్తంమీద సాయంత్రం ఎనిమిది గంటలకు బస్సు దిగారు. తీరా విచారిస్తే వెంకటేశ్వర్లు మయ్యగారూ, పకీరేశ్వరరావుగారూ పంపిన గుమాస్తాలు

పేరుతారు. "ప్రొద్దుకూకింద"ని చూసి చూసి వెళ్ళిపోయాడట, ఆ కబురు తెలిసిన శీనయ్య, అన్నపూర్ణ కుప్పలా కూలిపోయారు. ఆ నిర్మానుష్య ప్రదేశంలో యీ రాత్రి సమగతి ఏమిటి? తిరిగి వెళ్ళిపోవడానికికూడా బస్సులు లేవు. చేసేది లేక ఎంత ముహూర్తంలో బయలుదేరామో, అని అనుకుంటూ ఎవరో కూలీలు నడిచి వెళుతుంటే వాళ్ళ వెనకబడి శీనయ్య, అన్నపూర్ణలు ఆ కటిక చీకటిలో నడక ప్రారంభించారు. "అదే దారి" అని ఆ కూలీలు ఎంత చెప్పినా అన్నమ్మగారికి నమ్మకం కలగటంలేదు. సగందారిలో మాడుమీరా రెండు పెట్టి చేతిలో ఉన్నవికాస్తా కాజేస్తారేమోనని భయం. "కాజెయ్యదలచుకుంటే ఇప్పుడుమాత్రం కాజెయ్యకూడదా ఏమిటి? ఆ పని చేస్తే ఇప్పుడు పీళ్ళను అడ్డుపెట్టేదెవరు? భారంఅంతా పరమేశ్వరుడిదే" అనుకుంటూ ఇద్దరూ వాళ్ళనే అనుసరించారు. శీనయ్య కాలిచెప్పులు ఇంతక్రితం టిక్కట్టు కొనే హడావుడిలో ఉంగటాలు తెగిపోతే ఎవరూ చూడకుండా దూరంగా విసిరివేశాడు. కాబట్టి అతని కాళ్ళకు చెప్పులులేక ముళ్ళు గుచ్చుకుని, ఎదురుదెబ్బలుతగిలి అవస్థ పడుతున్నాడు. "పోనీ తన కాళ్ళవి జైరు చెప్పులు సరిపోతాయేమో చూడమంది" ఆ మాతృ హృదయం.

"ఛా-ఛా, ఊరుకో"మంది ఆ కాలేజీ యువక హృదయం. ఎలాగయితేనేం రాత్రి 10 గంటలు దాటిన తర్వాత అక్కడికి చేరుకున్నారు తల్లీకొడుకులు ఊరంతా మాటుమణిగి ఉంది. పల్లెటూరేమో, ఏడుగంటలకే అంతా భోజనాలుచేసి పడుకున్నారు. "పోనీ ఏదన్నా సత్రవ ఫుందేమో ఈ రాత్రికి

అక్కడ గడిపి శెల్లవారిన తర్వాత పోదాం" అనుకున్నాడు గాని అటువంటి స్థలన ఆ ఊళ్ళో పరిసరాలనుంచీ లేదు. ఇంకా ఏడు శరాలవరకూ నచ్చేసూచన లేదట. దారి పొడుగునా కుక్కలు. ఎక్కడ మీదపడతాయో అని ప్రాణభయం. అక్కడికి దారిలో ఓక ఈత మట్ట దొరికితే అది చేతిలో ధరించి కుక్కలను అదిలించుకుంటూ, ఒక చేతితో తల్లిని పట్టుకుని రణరంగంనుంచి యుద్ధంచేస్తూ పారిపోయివచ్చే రాజకుమారుడిలాగ యీ కాబోయే పెండ్లికొడుకు, అవబోయే మామ గారింటికి చేరుకున్నాడు.

*　　　*　　　*

నీచేతను, నాచేతను, వరమడిగిన కుంతిచేత, వాసవు చేతన్, ధరచేత, శల్యుచేతను అరయంగా కర్ణుడీల్గె నార్వుర చేతన్... కర్ణుడి చావుకు ఆరుగురు కారకులు. అలాగే శీనయ్య పెళ్ళికికూడా ఆరు కారణాలున్నాయి, ఒకటి సుబ్బలక్ష్మి ఎవరూ చూడకుండా శీనయ్యవైపు చూసి చిరునవ్వు నవ్వింది... రెండు శీనయ్యతల్లికీ, సుబ్బలక్ష్మి నాయనమ్మకూ బోలెడు స్నేహమయింది. చుట్టరికాలు తిరగెయ్యగా తిరగెయ్యగా అన్నమ్మగారి తల్లీ, సుబ్బలక్ష్మి నాయనమ్మా గోదావరి పుష్కరాల్లో కలిసి స్నానంచేశారు. ఒకే సత్రంలో బస చేశారు. అప్పుడు అన్నమ్మ పదమూడేళ్ళ పిల్ల. గ్రాహ్యాం తెలిసిన ఆ చిన్నది యిప్పుడు సుబ్బలక్ష్మి నాయనమ్మను గుర్తుపట్టిందికూడానూ... మూడవది కట్నం కానుకలు

వచ్చాయి. నాలుగవది యీ సంబంధం శీనయ్యా ఒప్పుకోక పోతే అన్నమ్మ మంచిరోజు చూసి ఉరిపోసుకు చచ్చిపోతా నంది. ఇలాంటివే మరి రెండు కారణాలుకూడా ఉన్నాయి. పెళ్ళిచూపుల సమయంలో సుబ్బలక్ష్మి పాడిన పాట "నిను బాసిపోవుదానా కోసమా సలాము ఖయిసు" పాట సందర్భం సంగతి ఎలావున్నా సుబ్బలక్ష్మి పాడిన తీరు కంఠం శ్రీనివా సుడికి నచ్చింది. వాళ్ళవూరుపక్క వూరిలో డేరా సినిమా లోకి లైలామజ్ను వచ్చినప్పుడు ఆ సినిమా నాలుగుసార్లు చూసి నేర్చుకున్నది ఆ పాట సుబ్బులు.

అలాఅని పెళ్ళిలో పోట్లాటలు ఏమీ రాలేదనుకునేరు. వచ్చాయి. చాలా వచ్చాయి.

శీనయ్యా క్లాసుమేట్సు, కాలేజీ స్టూడెంట్సు కొంత మంది వచ్చారు. అసలే కోతిమూక, అందులో కాలేజీ కుర్ర వాళ్ళు. వచ్చినప్పటినుంచి అప్లైటూళ్ళో వారికి ప్రత్యేకంగా యిచ్చిన విడిదిపాకలో ఇంగ్లీషు రికార్డులు వేసి, ఈలలూ, చప్పట్లూ, ట్విస్టుడాన్సులూ మొదలెట్టారు. ఊళ్ళోవాళ్ళంతా ఆ భజనపార్టీలో చేరి, ఇటువంటివి వాళ్ళు పుట్టిన తర్వాత చూడలేదు గాబట్టి, శీనయ్యా స్నేహితులందరికీ పిచ్చిపట్టిందనీ, వారి ఆరోగ్యం బాగుండలేదనీ అనుకున్నారు. శీనయ్యా మామ గారూ, పకీరేశ్వరరావుగారూ యీ గోలచూసి కొంచెం విసు క్కుని వాళ్ళు ఆవిధంగా మెలికలుతిరిగిపోవటం తమహోదాకు, పరువుతక్కువగా భావించి, అది ఆపవలసిందిగా స్వయంగా వెళ్ళి చెప్పారు. వాళ్ళు ఆపకపోగా, పకీరేశ్వరరావు పిలకా క్రాపింగూ చూసి "కన్ని బీడి" అని పేరుపెట్టి భజన ప్రారం

భించారుకూడా. పక్షీశ్వరరావుకు కోపంవచ్చి కోర్టుభాషలో “సదరు అల్లరిచేసినవారినీ, వారివారిసహాయులనూ ఇండియన్ పీనల్ కోడ్ క్లాజు ప్రకారం కోర్టుకు రప్పించి”... అని ఏవేవో తిట్టి లేచిపోయి వచ్చాడు. దానితో ఆ కాలేజీ విద్యార్థులూ, వారిని బట్టి మిగతావారూ భోజనాలకు రానన్నారు.

ఆ తర్వాత ఎలాగోలా భోజనానికి వచ్చారు. ఒక వంటవాడు వడ్డించిన పదార్థం చూసి ఒక కాలేజీ చిన్నవాడు ఎ వెరీ గుడ్ కుక్ (మంచి వంటవాడు) అని సర్టిఫికెట్టు యిచ్చాడు. దానితో పక్క విస్తట్లో ఆవకాయ వడ్డిస్తున్న వొక వితంతువు “చూశావా, చూశావా, ఆకుర్రవాడు నన్ను కుక్క అని యింగ్లీషులో తిడుతున్నాడు” అని ఝూంమని లేచింది. అసలే అవమానంతో కుమిలిపోతున్న పక్షీశ్వరరావు ఆ వితంతువుపక్షాన వకాల్తా వహించి తాండవమండలానికి లేచాడు. అది చూసి యింకో కాలేజీ కుర్రాడు “కల్తీ బీస్ట్ బాగా అంటుకుందిరోయ్” అన్నాడు. ఇక పక్షీశ్వరరావు శివమెత్తిపోయి “నీవు బీడి, నీ తాత బీడి, నీ ముత్తాత బీడి” అని బూతులు లంకించుకున్నాడు. పరంధామయ్యగారు చెప్పినా ఆగడు. అన్నమ్మగారు వచ్చి “పక్షీరయ్య బావ గారూ, ఇవి కాళ్ళుకాదు చేతులు”అని అతనిచేతులు పట్టుకుని ప్రాధేయపడింది.

“చేతుల్ని పట్టుకుని చేతులంటావేమమ్మా? నీవుఅన్నా అనకపోయినా అవి చేతులే” అన్నాడు స్పృహలోవున్న పక్షీరయ్య.

అన్నమ్మ తప్పు దిద్దుకుని "అదేలెండి పోనీ కాళ్ళే" అని ప్రసాధేయపడింది. పకీరయ్య ప్రస్తుతానికి సర్దుకున్నాడు గాని ఆ రాత్రికి భోజనం చెయ్యక కడుపులో కాళ్ళుపెట్టుకు పడుకున్నాడు...

కాని బోళాబోళీవాడైన పకీరయ్య కోపం తెల్లారే సరికే పోయింది. ఆ రాత్రల్లా అసలు అతను నిద్దరపోలేదని అంతా అనుకున్నారు. కాని అసలు విషయం ఎవ్వరికీ తెలి యదు. అయన నిద్దర పోయేటప్పుడు కుడిమోచెయ్యి భూమికి పోటుపెట్టి; అరచేతిలో తలఆన్చి శేషశాయిమీద శ్రీమహా విష్ణువులా పడుకుని నిద్దరపోతాడు. చూసేవాళ్ళకు అతను మేలుకునే ఉన్నాడా అనిపిస్తుంది. ఒకసారి పరంధామయ్య యింటికి కన్నంవేయడానికి వచ్చిన దొంగలుకూడా అతను ఎప్పటికయినా నిద్దరపోతాడేమో కన్నం వేద్దామనుకుని చూసిచూసి తెల్లవారిన తర్వాత కన్నంవేయకుండానే మేలు కుని ఉన్నాడనుకుని పకీరయ్యను తిట్టుకుంటూ వెళ్ళారు... అటువంటివాడు మన పకీరయ్య. అటువంటి నిద్ర మన పకీ రయ్య నిద్ర... పెళ్ళివారుకూడా పాపం ఆ దొంగలులాగానే అతని నిద్రచూసి మోసపోయ్యారన్నమాట...

ఇంతకీ చెప్పవచ్చింది "పకీరయ్య బోళాబోళీవాడు." పెల్లవారి లేచి తిని బంతిపువ్వురంగు పాంటులోపల నీలంరంగు చొక్కా వేసి పైన నాలుగంగుళాల వెడల్పు బెల్టు పెట్టుకుని పనుల్లో జొరబడ్డాడు. పెళ్ళిలో యింకో తమాషాకూడా జరిగింది. మూతిసన్నం బిందెలో కాలిమట్టెలూ, ఉంగరం రెండూ వేసి పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ ఇద్దరికీ పందెం

పెట్టారు. అంగులోని ఉంగరం తీయాలి. ఇద్దరూ ఒక్కసారి చేతులు లోపలకు పోనిచ్చి ఉంగరంకోసం గాలించాలి. ఆ పోటీ వచ్చింది. ఇద్దరిచేతులూ బిందెలో ఉంగరంకోసం కలియ వెతుకుతున్నాయి. అమ్మలక్కలు పగలబడి నవ్వుతున్నారు. ఉంగరం పెళ్ళికూతురుకు దొరికింది. ఇది కనిపెట్టిన మన హీరో శీనయ్య కటిక్కిన సుబ్బులమ్మ చెయ్యిపట్టుకున్నాడు. ఆ సంగతి ఆవిడ ఎవరికీ చెప్పుకోలేదు. బిందెను ఆవిడ అటు లాగి, ఈయన యిటులాగి రెండుచేతులూ ఇరుక్కుపోటంవల్లటం చేత, ఆ సన్నమూతిలోనుంచి చేతులు బైటికి రాలేక మజ్జిగ గిన్నెలో తలదూర్చిన పిల్లిలాగ బిందె చితక్కొట్టటం మొదలు పెట్టారు. అమ్మలక్కలు పగలబడి నవ్వుతున్నారు. శీనయ్యకు సిగ్గువేసి, ఆ పైన ఉడుకుమోతుతనం వచ్చి పెళ్ళికూతురు చెయ్యి కటిక్కిన గిల్లాడు. సుబ్బులమ్మ తేలుకుట్టినట్లు కెవ్వు మని అరచి ఉంగరం వదలిపెట్టి చెయ్యి బైటికి లాక్కుంది. ఆ దేసమయమని శీనయ్య ఉంగరం లంకించుకుని బైటికి తీశాడు. సుబ్బులమ్మ చెయ్యి నెత్తురుకారటం మొదలుపెట్టటం మాట అటుంచి, ఆవిడ దృష్టిలో శీనయ్యపట్ల అసహ్యం, భయం, పెనవేసుకు ఏర్పడ్డాయి. అమ్మలక్కలు శీనయ్యను "ఛీ. మోటు పెళ్ళికొడుకు" అన్నారు... పనిలోపని ఆ రాత్రే కొడుక్కు పునస్సంధానం చెయ్యాలని అన్నమ్మగారు పట్టు పట్టుకు కూచుంది. వీల్లేదన్నాడు పరంధామయ్య, పక్క రేవ్వేర రావు... ఇటుపక్షాలూ పట్టుపట్టుకు కూర్చుంటే మధ్యలో శీనయ్య గోతికాడి నక్కలాగ ఫలితంకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. పెద్దమనుష్యులు వచ్చి చివరికి పరంధామ

య్యను నప్పించి ఆ ఏర్పాట్లుకూడా పూర్తి చేయమన్నారు. చివరకు పరంధామయ్యకూడా "కొంత ఖర్చు తప్పినా తప్పి నట్టే" నని దానికి ఒప్పేసుకుని పాన్పు ఏర్పాటు చేయవలసిం దిగా భార్యకు హుకుం జారీచేశాడు. ఈ సంగతి తెలిసిన సుబ్బులమ్మ హాడలిపోయింది. ఆ రాత్రి తన భర్త గిల్లిపోయేదు లమే కాకుండా దెబ్బలుకూడా కొడతాడేమోనని.

పరంధామయ్యగారి యిల్లునుగురించి కొద్దిగా తెలుసు కుందాం. ముందు వసారా, మధ్యహాలూ, వెనక వంటిల్లూ ఇంక గదులూగట్రా సమీాలేవు. ఆ మధ్యహాలులో ఏర్పాటు చేశారు పాన్పు. పెళ్ళివారి భోజనాలూ, ఆ తర్వాత ఆడవారి భోజనాలూ, తర్వాత యిల్లు సర్దుకోవడాలూ, అలుకుడూ, ముగ్గులూ అయేటప్పటికే రాత్రి పన్నెండుగంట లయింది. శీనయ్య పెళ్ళికొడుకు వాకిట్లోనూ, సుబ్బులక్ష్మి పెళ్ళికూతురు దొడ్డిలో నులకమంచంమీాద కునికిపాట్లు పడుతున్నారు. పన్నెండున్నరకు లైనుక్లియరిచ్చి శీనయ్యను లోపలికిపోయి పడుకోమన్నారు. వర్షాగమనంకోసం పురులువిప్పి నాట్యం చేసే నెమిలి మాదిరిగా, లోలోపల భార్యకోసం ముచ్చట పడుతున్న శీనయ్య వొక్క అంగలో లోపలికి వెళ్ళి కూర్చు న్నాడు. ఎంతసేపటికీ పెళ్ళికూతురు రాదు. ఆవిడ "ఏమయినా సరే, లోపలికి నేనుపోను. ఆయన గిల్లుతాడు" అని మారెంకె వేసుకు కూర్చుంది దొడ్డిలో. "మా అమ్మకాదూ, మా తల్లి కాదూ, ఆయన గిల్లరమ్మా, మంచివాడు. నేను గిల్లవద్దని చెపుతాగా... మాఅమ్మా, చెప్పినట్లు వింటుందమ్మా బంగారు తల్లిలాగ" అని నచ్చచెప్పి, వాళ్ళ అమ్మ కూతురును బ్రతిమ

లాడి బ్రతిమలాడి చివరికి ఒంటిగంటన్నరకు లోపలికి పంపించింది...

సుబ్బులు గుమ్మందగ్గర నిలబడింది. శీనయ్య మంచం మీద కూర్చున్నాడు. ఇద్దరికీ సిగ్గు. ఇద్దరికీ ఏదో చెప్పలేని, ఏంచేయాలో తోచని స్థితి. చివరికి శీనయ్యే ధైర్యంచేసి, అరగంటతర్వాత సుబ్బులు దగ్గరకువెళ్ళి పిలవబోయాడు. ఇంతలో తలుపుసందులనుంచి చూస్తున్న ఆడవాళ్ళనవ్వులు ఉవ్వెత్తుగా వినిపించి శీనయ్య కంగారుపడి, సిగ్గుతో పంకెరలు తిరిగిపోయి. తిరిగి తన మంచంమీద కూర్చున్నాడు. ఇంకో అరగంట గడిచింది. ఇద్దరికీ కునికిపాట్లు వస్తున్నాయి. మళ్ళీ శీనయ్యేలేచి దీపం కొంచెం తగ్గించి, సుబ్బులమ్మ దగ్గరకు వెళ్ళి "వచ్చి కూర్చో" అన్నాడు ధైర్యంచేసి.

"నేను రాను."

"ఎందుకని?"

"మీరు గిల్లుతారు."

"అబ్బే గిల్లను. ఇంకా అల్లరిచేస్తే కొరుకుతా"... విట్టువేశాడు శీనయ్య, తన విట్టుకు తానే బోలెడు ఇదయి పోతూ.

"కొరికితే మా అమ్మతో చెపుతా."

"ఏం? మీ అమ్మ నా తలకొట్టి మొలేస్తుందా... చెప్పుకో నాకేం భయం. నేనూ చెపుతా మా అమ్మతో."

"ఏం చెపుతారేమిటి?"

"నీవేం చెపుతావు?"

“పోనీకాదు అని.”

“పోరక లేదుగా.”

సుబ్బులమ్మ మళ్ళీ సందిగ్ధంలో పడింది ఏంచెప్పాలో తెలియక. “సుబ్బులూ” అని శీనయ్య సుబ్బులు చెయ్యిపట్టుకున్నాడు. సుబ్బులమ్మకు ఏంచేయటానికీ తోచలేదు. లోపల భయంగానే ఉంది నిజంగా కొరుకుతాడేమోనని. ఏమీ మాట్లాడకుండా నిలబడేసరికి శీనయ్యకు మరికొంచెం చనువు ఏర్పడింది. రెండుచేతులూ పట్టుకుని “సుబ్బులూ” అని దగ్గరకు తీసుకోబోయాడు. ఇంతలో ఎవరో తలుపు దబదబ బాదారు. ఇద్దరూ హడలిపోయారు. శీనయ్య వొక పరుగు తీసి మంచంమీద నొంగనిద్రపోతున్నట్లు పడుకున్నాడు. సుబ్బులమ్మకు ఏంచేయాలానికి తోచక కంగారుపడి తలుపు తీసింది. తలుపు తీసి తీయగానే వెంకటేశ్వరరావు భార్య ఆండాలమ్మ లోపలికివచ్చి “చంటి వెధవ కనిపించటంలేదు. ఇక్కడున్నాడటే?” అనుకుంటూ మంచంక్రిందా, పెట్టెలమీదా వెతకటం ప్రారంభించింది. చివరికి పాతబట్టల మూటలసందున నిద్రపోతున్న చంటి వెధవను తీసుకొని, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ “తలుపేసుకోమ్మా సుబ్బులూ” అనుకుంటూ బైటికి వెళ్ళిపోయింది. “చెడవలేకపోయావు” అని లోలోపల విసుక్కున్నాడు నిద్రపోతున్న శీనయ్య. “హమ్మయ్య ఆండాళ్ళత్తయ్య రక్షించిందిగాని లేకపోతే తన భర్త తనను యీపాటికి ఏంచేసేవాడో” అనుకుంది సుబ్బులమ్మ. అరగంట గడిచింది. నొంగకోళ్ళు పట్టేవాడులాగ శీనయ్య కళ్ళు తెరచి నెంపాదిగా సుబ్బులమ్మ దగ్గరకు వచ్చాడు. “ఎంతసేపు నిల

బడతావు? కాళ్ళు నొప్పిపుట్టటంలేదూ? వచ్చికూర్చో" అన్నాను.

"అబ్బే... ఎంతసేపయో" అనుకుంది సుబ్బులమ్మ లోలోపల. పైకి "నేను రాను. ఇక్కడ చాపమీద పడు కుంటా" అంది.

"తప్పు అక్కడ పడుకోకూడదు" అన్నాడు ఎంతో శాస్త్రం చదివినవాడిలా. ఇంతవిసిగిస్తుంటే లోలోపల మంట గానే వుంది....

"నీ వెప్పుడయినా సినిమా చూశావా? హీరో హీరో యిన్లు ఎంత చక్కగా ఉంటారో" అని కసిరేశాడు శీనయ్య.

మళ్ళీ తలుపు చప్పుడు. "మీ అమ్మ కడుపుకాల" అని తిట్టుకుంటూ శీనయ్య పోయి మంచంమీద పడుకు న్నాడు. ఈసారి సుబ్బులమ్మ మేనత్త వచ్చి "దిక్కుమాలిన బొబ్బట్లు. వద్దంటేవిన్నారుకాదు. అప్పుడూ తినటంఎందుకూ, ఇప్పుడీ మూలగటం ఎందుకూ" అని సుసరుసలాడుకుంటూ, "ఈ బీరువాలో వాము వాటరుసీసా ఉండాలిట. కొంచెం చూడమ్మా సుబ్బులూ! నాకు కళ్ళు కనపడి చావవు. ఒక సీసాకు ఒకసీసాతీస్తే ఏమి అఘాయిత్యం అవుతుందో ఏమిటో ...... వెనకటికి ఒకసారి ఏమయిందా సుబ్బులూ— చచ్చి స్వర్గాన ఉంది మా అత్తగారు. చెయ్యిబెణికి బాధపడుతుంటే మా మామగారు కర్పూరతైలం అనుకుని, అదేదో ద్రావ కమట..." అని పురాణం మొదలుపెట్టింది. ఇంతలో బైట నుంచి ఎవరిదో అరుపు వినిపించింది "రావే... నీవొక్క బోడి మేళం. ఎక్కడివెళ్ళితే అక్కడే" అని. దానితో ఆవిడ

సామువాటునిసా తీసుకుని "తలుపేసుకో అమ్మా" అని బైటికి వెళ్ళింది. ఆ వచ్చిన ముసిలిదానిని అంపంపెట్టి పరపర కోయాలనిపించింది శీనయ్యకి. ఆవిడ అటు వెళ్ళగానే ఒక్క ఉదుటున లేచి సభాలున చప్పుడయ్యేటట్లు తలుపు గడియ వేశాడు. ఆ అదటుకి వాకిట్లో పడుకున్న కుక్కపిల్ల నిద్ర ల్లోన అరుచుకుంటూ వీధిలోకి పరుగెత్తింది. అప్పటికి టైము సరిగ్గా మూడుగంటలయింది. శీనయ్యముఖం కోపంతో తీవ్రరించిపోయింది. "తక్కువాలినవాళ్ళు ప్రతిదీ ఈగదిలోనే పెట్టుకచస్తారు" అని తిట్టుకున్నాడు లోలోపల. సైకి తిడితే సుబ్బులు ఇంకా బెదిరిపోతుందేమో... లోపల ఎంతమంటగా వున్నా సైకి సుబ్బులును లాలించాలి... ఎలా లాలించాలి చెప్మా అని అరఘడియ ఆలోచించి పెళ్ళిచూపులకు వచ్చి నప్పుడు "నిను బాసి పోవుదానా" అని పాట పాడావుకదా! అది ఏ సినిమాలోది?" అని అడిగాడు.

"త్రైలామజ్నులోది."

"ఎక్కడ చూశావు?"

"షబ్బారేకుల టూరింగుహాలులో."

"త్రైలా-మజ్నూ— వాళ్ళు చూశావా ఎంతప్రేమగా వున్నారో... అలావుండాలి చక్కగా మొగుడూ పెళ్ళాం."

"మా నాన్న తంతాడు."

"మనిష్టరం అలావుంటే తన్నడు. అయినా మీనాన్న ఎప్పుడేనా తన్నాడా నిన్ను? ఎందుకు భయం?"

"ఒకసారి జామచెట్టెక్కి కాయలు కోస్తుంటే కొట్టాడు."

నాలుగు గంటలయింది. శీనయ్యకి కళ్ళు నిద్దరలేక చింత నిప్పుల్లా వున్నాయి.

"ఎంతసేపు నిలబడతావు కష్టపడుతూ. రా, అలా మంచంమీద కూర్చుందాము."

"ఏమో బాబూ. నాకు భయమేస్తోంది."

"భయమెందుకు? నేనున్నాగా" అని లాలించి తీసుకెళ్ళి మంచంమీద కూర్చోబెట్టాడు... అప్పటికి నాలుగుంబావు అయింది. నింపాదిగా సుబ్బులుచెయ్యి తన చేతిలోకి తీసుకుని, "మన వూరు ఎప్పుడెళ్దాం?" అన్నాడు ఏం మాట్లాడాలో తెలియక, ఏదో మాట్లాడాలనే ఉత్సాహంతో...

"మా వూరు ఇదేగా."

"అలా అనకూడదు. పెళ్ళయిన తర్వాత నీదీ నాదీ కలిపి ఒకటే ఊరు. అదే మనవూరు. నువ్వు చక్కగా వచ్చి మా వూళ్ళోనే ఉండాలి" అని బుజంమీద చెయ్యివేసి సుబ్బులుకు ఇంకా దగ్గరగా జరిగాడు. సుబ్బులు జవాబుచెప్పలేదు. ఎదురూ చెప్పలేదు. తన ప్రయత్నం ఫలిస్తోందికదా అని సంతోషంకొద్దీ సుబ్బులు బుగ్గలు రెండూ తన చేతుల్లోకి తీసుకుని తనవైపు తిప్పుకోబోయాడు. బైట కోడికూత వినిపించింది. కోడికూతతోబాటు తలుపుచప్పుడయి "సుబ్బులూ! తలుపు తియ్యమ్మా, తెల్లారింది. ఇల్లలుక్కుని పొయ్యిమీద కాఫీనీళ్ళు పడెయ్యాలి" అని శీనయ్య అత్తగారిమాట వినిపించింది. తెల్లవారింది కాబట్టి ఇంటిపనులు చూసుకోవాలి. వంటింట్లో కెళ్ళాలంటే అల్లుడుగారి పానుపున్న సావడిలో

వుంచే వెళ్ళాలి. కాబట్టి తలుపు తియ్యమని కోరింది శీనయ్య అత్తగారు.

"చస్తే చావనీ. తలుపు తీయకు" అన్నాడు శీనయ్య.

"అమ్మో! ఇంకా ఏమన్నా ఉందా. చంపెయ్యడూ నా అమ్మ" అని ఒక్క పరుగులోపోయి తలుపు తీసింది సుబ్బులు.

"నీవు పోయి వాకిట్లో నా మంచంమీద పడుకో అమ్మా" అంటూ అత్తగారు వంటింట్లోకి పోయింది. సుబ్బిని నానాతిట్లు లోపలలోపల తిట్టుకుంటూ, పళ్ళుపటపటలాడిస్తూ ముసుగుతన్ని పడుకున్నాడు. ముసుగులోనుంచి శీనయ్య, అత్తగారినీ ఆవిడ పూర్వోత్తరాల్ని ఎంచి ఎంచి మరీ తిట్టుకుంటుంటే— ఆంజనేయులు దండకం కాబోలు చదువుకుంటున్నాడు. అల్లుడు ఎంత దైవభక్తి కలవాడో కదా అనుకుంది ఆవిడ. మొదటి రాత్రి ముచ్చట అలా జరిగిపోయింది.

మరునాడు శీనయ్యముఖం చూచితీరాలి. అసలే నిద్దర లేదు. లోపలకోపం అట్టడికిపోతున్నట్లు ఉడికిపోతోంది. దానితో కళ్ళు చింతనిప్పుల్లా జేవురించి ఉన్నాయి. మధ్యాహ్నం భోజనాలయిన తర్వాత శీనయ్య కోపం కొంచెం దిగజారింది, మరేదియూజ్వరం దిగజారినట్లు. ఈరాత్రి ఏమయినా సరే తాను తొందరపడకూడ దనుకున్నాడు. ఆ బింకం ఎన్నాళ్ళో తానూ చూడాలని పట్టుపట్టాడు. ఆవిడకు తన మీద ప్రేమలేనప్పుడు తనుమటుకు ఎందుకు దిగజారిపోవాలీ అనుకున్నాడు. ఏమయినా సరే, ఈ రాత్రి చాలా బింకంగా ఉండటానికే నిశ్చయించుకున్నాడు. కాని సాయంత్రం ఆరు

గంటలయ్యేసరికి కొంచెం బుస్సపూరించాడు. ఛీ. ఇట్లా అనుకో కూడదు. ఆడపిల్ల, సిగ్గుపడదా ఏమిటి? తానుకూడా మూర్ఖుడి లాగ పట్టుపడితే ఎలా? ఇంకా బెదిరిపోతే... అలా కాదు. చక్కగా లాలించి, బుజ్జగించి దారికి తెచ్చుకోవాలి. ఇవాళ తన తెలివితేటలన్నీ ప్రయోగించి సౌభాగ్యవతియగు సుబ్బుల్ని ప్రసన్నురాలిని చేసుకోవాలి. అప్పుడే తన గొప్ప భార్యకి తెలుస్తుంది. భార్యా, తల్లీ, మామగారూ, అత్తగారూ అంతానూ ప్రయోజకుడనీ అనుకోవాలి. "అయినా గదిలో ఎక్కడో సుబ్బుల్ని ప్రసన్నురాలిని చేసుకుంటే బయటవాళ్ళకెలా తెలుస్తుంది? వాళ్ళెట్లా ప్రయోజకుడనుకుంటారు తనని? ఏమిటో నా మొహం ఆలోచన" అనుకున్నాడు... మొత్తం మీద తేల్చుకున్నది సంపలకాడే సుబ్బులక్ష్మిని ప్రసన్నరాలిని చేసుకోటం. ఇలా ఆలోచిస్తూవుంటే తల్లి తనమంచం తీసుకొచ్చి పందిరిక్రింద వేస్తోంది. "అదేమిటే అమ్మా?" అని అడగకూడదనుకుంటూ అడిగేశాడు.

"మరిదిగారూ మూడురోజులపాటు మీ మంచం బైటే" అని చెప్పి వరసకు వదినగారు ఒకావిడ యింటిలోకి తుర్రుమంది. ఈసారి సుబ్బులు మీదకంటే ఆ వదినగారిమీదే ఎక్కువకోపం వచ్చింది ఆ పసివాడికి.

* * *

ఏది ఆగా, ఏది ఆగకపోయినా కాలం ఆగదు. క్రమంగా కొన్నిరోజులు గడిచిపోయాయి... శ్రీనివాసరావు బి. ఏ

ప్యాసయ్యాడు. ఎమ్. ఏ. కి వెళ్తానన్నాడు గాని "ఇక నా వల్ల కాదు. నేను చెప్పించలేను" అన్నది అన్నమ్మగారు. శ్రీనివాసరావు చదువు పూర్తయ్యేసరికి మిగిలింది ఎకరంన్నర భూమి. అక్కడికీ ఎంతో పొదుపుగా సంసారం గుంభనంగా లాక్కురాబట్టి. లేకపోతే అదీ మిగలకపోను. ప్రస్తుతం ఇల్లు గడవటానికికూడా కటకటలాడుతూనే వుంది. దానికితోడు సుబ్బలక్ష్మి కాపరానికి రావడం. పావుశేరు పూలు, రిబ్బను ముక్క, సినిమాఖర్చు వీటికికూడా అమ్మనే అడగాలంటే శ్రీనివాసరావు మాచెడ్డ ఫీలయిపోతున్నాడు. "తనది" అన్న అణా డబ్బులు లేకపోయె... మాటల సందర్భంలో ఒకసారి తల్లి "నాయనా! వెనకటి మాదిరిగాకాదు. కొంచెం వెనకా ముందూ చూసి ఖర్చుచేసుకోవాలిరోయి" అన్నదిజనరల్‌గా. తల్లి అలా అంటూంటే "మాఆవిడకు మల్లెపూలు కొంటాను, ఒక అణావుంటే యివ్వవే" అని ఏమని అడుగుతాడు? అక్కడికీ కూరలు డబ్బుల్లోనూ, పచారీ సరుకుల్లోనూ డబ్బులు పక్కి, పెళ్ళానికి రెండుగజాల రిబ్బనూ, ఒక పౌడరు డబ్బా చిన్నది, తేలికపాటి ధరలో తెచ్చేవాడు. "వాళ్ళ పుట్టింటి నుంచి తెచ్చుకున్నది కాబోలు" అని తల్లికి సర్ది చెప్పేవాడు. కాని తన యింట్లో తనే దొంగతనం చేయడానికి అతనికి లోలోపల బాధగానే ఉండేది. అదీకాక రాత్రుళ్ళు గదిలో కూర్చుని పుస్తకంచేతపట్టినప్పుడల్లా సుబ్బులు దీపం తగ్గించి "ఎప్పుడూ దిక్కుమాలిన పుస్తకాలేనాఏమిటి?" అని చేతిలో పుస్తకం అలా అలా తీసి పక్కనపెట్టేది. దాంతో శీనయ్యా ఒడుకు రక్తం పరవళ్ళుతొక్కేది. ఇప్పుడు తెలుసుకుంది

సుబ్బులు "తన భర్త మంచివాడేననీ, గిల్లటం, కొరకటం తాత్కాలికమేననీ". భర్తమీద కొంచెం కొంచెం ప్రేమ పుట్టుకొస్తోంది కూడాను. "ఏమండీ, సినిమాకు వెళ్దాం" అన్నది ముచ్చటగా ఒకరోజున. శీనయ్యకు పచ్చివెలక్కాయ గొంతుకకు అడ్డుపడ్డట్లయింది. భార్యఅంత ఆప్యాయంగా లాల నగా చెక్కిలి నొక్కుతూ అడిగితే లేదని ఎలా చెప్పగలడు? ఆవిడ ఎంత ఫీలవుతుందని కాదంటే... కాని ఏంలాభం? చేతిలో కానీలేదు. పోనీ కూరల డబ్బుల్లోనో పక్కి తర్వాత అప్పు తీర్చుకోవచ్చుననుకుంటే ఈ అర్ధరాత్రి తనకు అప్పిచ్చే వాడుమాత్రం ఎవరున్నారు?

"రేపు వెళ్దాంలే" అన్నాడు తప్పించుకునేందుకు.

"కాదు ఇవాళే ఇవ్వాళ్టితో వెళ్ళిపోతుందట ఆ సినిమా."

"మా అమ్మ కోప్పడుతుందేమో."

"అమ్మకు అంత భయపడేవాళ్ళు పెళ్ళెందుకు చేసు కున్నారు?"

శీనయ్య మగతనంమీద సవాలు చేసినట్లనిపించింది. వెంటనే లేచి చొక్కా చేతులు పైకి తీసుకుని తల్లిదగ్గరకు వెళ్ళాడు. "ఏమే అమ్మా వంట్లో ఎట్లా వుంటోంది?"

"ఏమోరా నాయనా! ఆరోజు-కారోజు నా పరిస్థితి మారిపోతోంది. ఊరికే నడుం నములుతూ ఉంటోంది. ఏది తిన్నా ఇమడటంలేదు. పోనీ మీ ఆవిడ ఒకపూట మడికట్టు కుంటుందనుకుంటే అది చిన్నపిల్ల ... అదృష్టంకొద్దీ మంచి

పిల్లాడివి పుట్టావు. నలుగురి మాదిరిగా పోకిరీ పోకిళ్ళు పోక పదో నాల్తోనే ఎండకు ఎండుతున్నావు. సాయంకాలంనుంచీ కాళ్ళు ఊకే నములుతున్నాయి. అది పరాయిపిల్ల, చెప్ప కూడదుగాని, కొంచెం కాళ్ళు పట్టగలవు నాయనా" అన్నది. దానితో శీనయ్య ఇరకాటాన పడ్డాడు. అక్కడ భార్య దగ్గర కాస్త సరదాగా ఉన్నట్లూ కాదు. ఇటు సినిమాకు వెళ్ళి నట్లూ కాదు. మధ్యలో ఈ కాళ్ళుపిసకటం ఏమిటిరా భగ వంతుడా అని వచ్చినపని మరిచిపోయి తల్లి కాళ్ళు పిసుకుతూ కూర్చున్నాడు. అదీకాక తల్లి తనమీద ఎంతో గౌరవం ఉంచుతోంది. దానికి ఉబ్బి తబ్బిబ్బయిపోతూ, "ఛా! తుచ్ఛ సినిమాకోసం తల్లి మనస్సు కష్టపెట్టకూడదు" అనుకున్నాడు ఆ మాతృసేవా పరాయణుడు. కాని ఎదురుగా గదిలోనుంచి భర్తకు మాత్రమే కనిపిస్తూ సుబ్బులు మొఖం చిట్లిస్తూ, ధుమధుమలాడుతూ కనిపిస్తోంది. మధ్యలో మాతృసేవమాని ఎలా వెళ్తాడు? అటు భార్యప్రేమ, ఇటు మాతృదేవికి పుట్టిన ఋణం తీర్చుకోవడం. ఇటు బాధ్యత అటు ప్రేమ. కంకర రాళ్ళమధ్య పడ్డ కుంటి ఎలుకపిల్లలాగ ఉంది అతనిస్థితి... ఆముదంతాగిన ముఖంపెట్టి భార్యవైపు అలా చూస్తూనే ఇటు తల్లి కాళ్ళు పడుతున్నాడు "నేనేం చేయను? భగవంతుడు నా ముఖంమీద యీ కార్యక్రమం వ్రాశాడు" అన్నట్లుంది ఆ ముఖం. వళ్ళుమండి సుబ్బులమ్మ "అడుగెహె" అన్నట్లు చెయ్యి ఝాడించింది. శీనయ్య కొంచెం కలుక్కుమని "అమ్మా..." అని ప్రారంభించి ఆగాడు...

"ఆ కాలు చాలుగాని రెండో కాలు ఒత్తు నాయనా" అంది తల్లి. అంతే. శీనయ్యా నోటికాడి ఇడిపోయి రెండో కాలు పిసకటం మొదలుపెట్టాడు... పైగా తొమ్మిదిన్నర. తొమ్మిదిం ముప్పావు అలా జరిగిపోతోంది. ఒక్కొక్క నిమిషం జరుగుతుంటే ఒక్కొక్క గంట వేస్తోంది సుబ్బులమ్మ. ఆ గంట తన గుండెమీదే పడుతున్నట్టు గతుక్కుమంటున్నాడు శీనయ్యాబాబు... చివరికి తొమ్మిదీ ఏభయి నిమిషాలకు "ఇకచాల్లే వెళ్ళిపడుకో నాయనా. అది (సుబ్బులు) కనిపెట్టుకు ఉంటుంది" అన్నది తల్లి. "ఇప్పటికయినా ఆ విషయం జ్ఞాపకానికి వచ్చిందికదా" అని లోపల అనుకుని, ఇంత మెహర్బానీ చేశానుకదా అనే ధీమాతో "అవ్వా ఒక చిన్నవిషయమే" అన్నాడు.

"ఏమిటి నాయనా?" అప్యాయంగా అడిగింది తల్లి.

"సుబ్బులు సినిమాకు వెళ్దాం అంటోందే" లాలనగా భయంగా అడిగేశాడు.

"మొన్ననేకదరా వెళ్ళారూ... రోజూ సినిమాలకు వెళ్ళడానికి మనమేం లక్షాధికారులమూ? పూట గడవటమే కష్టంగా వుంటే. అయినా పెళ్ళానికి అంత అలుసివ్వకూడదు నాయనా. దానికేం అది సినిమాకూ వెళ్దామంటుంది, సర్కసుకూ పోదాం అంటుంది. అంటేమటుకు మన తాహతు మనం చూసుకోవద్దూ? చూద్దాంలే. డబ్బులుంటే రేపు వెళ్దురుగాని, పోయి పడుకో" అన్నది. ఇందులో కొన్ని ముక్కలు సుబ్బులమ్మ చెవినిపడ్డాయి. శీనయ్యాకు ఆ సంగతి తెలియక "ఏమేవ్, ఇవాళ ప్రొద్దుపోయింది. రేపు వెళ్దాం

గానిలే అండి మా అమ్మ" అని చింపిచేటంత మొఖంచేసు కుని యుద్ధంలో గెలిచిన వీరుడులాగ అంగలేసుకుంటూ పడక గదిలోకి వచ్చేటప్పటికి, సుబ్బులు జడవిరబోసుకుని సాయంత్రం శీనయ్య తెచ్చిన పూలు "తనకేం అక్కర్లేదు" అని నేల కేసి కొట్టి గళ్ళదుప్పటి తన్నిపట్టి పడుకుంది.

సక్కుబాయి నాటకంలో విశ్వపతి జ్ఞాపకం వచ్చాడు శీనయ్యకు. "తల్లీ, ఇల్లాళ్ళమధ్య తల్లడిల్ల వలసెగాదే. ఛీ-ఛీ దుఃఖమయమహా" అన్నపాట చరణం ఒకసారి మనసులో మెదలింది. కాని సక్కుబాయి మహాపతివ్రత. సినిమాకోసం ఎప్పుడూ దెబ్బలాడలేదు. వాళ్ళమ్మకూడా మరీ అంత "వాతలువేసేరకం" కాదు. సంసార ఆర్థిక పరిస్థితినిగురించి తెలిసింది కాబట్టి ఆ సలహా యిచ్చింది. అంతే... సుబ్బులు మాత్రం దుప్పటిలోనుంచి తలకాయ బయటపెట్టకుండా "నా దగ్గరకు రావడమెందుకు? నాకు అలుసివ్వడం ఎందుకు? మీ అమ్మ కాళ్ళుపిసికి యీ రాత్రికి మీ అమ్మగారిదగ్గరే పడుకోండి" అంది. శీనయ్యకు ఏంచేయటానికీ తోచలేదు. "అమ్మ అన్నమాటలు సుబ్బులు విన్నదన్నమాట. కొంపమునిగింది." అయినా అమ్మఅంత బిగ్గరగా అనటమేమిటి? ఈ పెద్దవాళ్ళకు ఒక ఏడు పైబడ్డకొద్దీ మరీచాదస్తం ఎక్కువవుతోంది. తనకు పెళ్ళయిందికదా, వెనకటి శీనయ్యను కేకవేసినట్లు, యిప్పుడు కూడా కేకలేస్తే ఎట్లా? అందులోనూ తన కొత్త భార్యముందు (శీనయ్యకు పాత భార్యలు ఎవరూ లేరు. అంటే కొత్తగా కాపురానికివచ్చిన భార్య అనిఅర్థం). ఆ భార్యముందు అలా కేకలేస్తే తాను ఆవిడముందు ఎంత అలుసు అయిపోతాడు?

పురుషుడయిన తనకు ఎంత తలవంపులు... అని అనుకుంటూ ఉండగా శీనయ్యలోనుంచి ఇంకో శీనయ్య బైటికివచ్చి చెళ్లున వీపుమీద చరిచినట్లుగా "నీ మొహం పురుషత్వం. నీవూ ఒక పురుషుడవేనా? పెళ్ళాన్ని అధమపక్షం బెంచీ టిక్కట్టుకన్నా సినిమాకు తీసికెళ్ళలేనివాడవూ, అణాడబ్బులు పెట్టి పూలుకొని, కూరగాయ డబ్బుల్లో మిక్కిన వాడవు నీవూ వొక పురుషుడవేనా? నీలో పురుషత్వంఉందా?" అని ప్రశ్నించింది.

అప్పుడునిజంగా శీనయ్యకుకూడా అనుమానంవచ్చింది. "నిజంగా తాను పురుషుడనేనా. తనకు పురుషత్వం ఉందా" అని.

ఇంతలో భార్య ఆక్రందన దుప్పటి సందునుంచి వినిపించింది.

"ఇన్నేళ్ళువచ్చి తల్లికి కాళ్ళు పిసుకుతున్నవాడిని, ఈయనన్నే చూశాను. ఆడవాళ్ళకాళ్ళు పట్టుకుంటానికి సిగ్గెట్లా లేదో... ఇంత అసమర్థుడికి కట్టి మా ఫకీరు మామయ్య నా గొంతు కోశాడు" అని.

శీనయ్య ఏమీ మాట్లాడలేదు. సరాసరిపోయి మాసిక వేసిన పాత పడకకుర్చీలో పడుకుని దీర్ఘంగా ఏదో ఆలోచిస్తున్నట్లు కళ్ళుమూసుకుని నీరసంగా పడుకున్నాడు.

"ఛీ-ఛీ. ఇందుకే నాకు పెళ్ళి వద్దేఅంటే నూతిలో దూకుతా, గోతిలో దూకుతా అని బెదిరించి, ఈ రోజున తనను ఇట్లా గోతిలోకి తోసింది తల్లి... ఆ ఫకీరయ్యగాడో

కేను, తనపాలిట యములాడల్లేవచ్చి యీ దెయ్యాన్ని తనకు అంటకట్టాడు. అమ్మ చెప్పినట్లు ఆడదానికి ఇంత అలుసివ్వడం నాదే పొరపాటు...” ఇంతలో శీనయ్య మనస్సు మళ్ళీ అన్నది. “ఇంతలో నీవిచ్చిన అలుసేముంది? భార్యతో సరదాగా ఉండకుండా మాడుమొహం వేసుకు కూర్చుంటే ఏ ఆడది నిన్ను ప్రేమిస్తుంది? భార్యతో సరదాగా ఉండటం, అలుసివ్వటం ఎట్లా అవుతుంది?” అని. “అదీ నిజమే. నేను మటుకు ఏమి అలుసిచ్చాను?” అనుకున్నాడు శీనయ్య మళ్ళీ.

“ముసలిదానికిమటుకు తెలియక్కర్లా? కొత్తగా పెళ్ళి యినవారికి ఏవేవో సరదాలు వుంటాయికదా, అడిగినప్పుడు నొగాగకుండా చెప్పివ్వాలసి” అనుకున్నాడు.

మళ్ళీ శీనయ్య మనస్సు ఘూంమని లేచి “సిగ్గుండ క్కర్లా. అమ్మ యివ్వలేదని అమ్మమీద పడతావేం అన్నె క్కొచ్చి? చాతనయితే సంపాదించుకో, ఖర్చుపెట్టుకో. ఆ ముసిలామిడమటుకు ఎక్కడినుంచి తెస్తుంది? ఉన్నదేదో ఇంటి ఖర్చుకే ఖర్చుపెడుతోందిగా? రేపు సరాసరి స్వర్గానికి వెళ్ళే టప్పుడు మిగిలిందేదో నీకే ఇచ్చి వెడుతుందిగాని వెంటతీసుకు పోదుగా?... ఇవాళనీకు సినిమాకు డబ్బులిచ్చి రేపు నెయ్యి వేయకుండా నీకూ, నీ పెళ్ళానికీ అన్నంపెడితే:నీవు ఊరుకుం టావా? నీపెళ్ళాం ఊరుకుంటుందా? ఇప్పుడు సినిమాకు, రేపు అన్నంలో నెయ్యికి ఎక్కడినుంచి వస్తాయోయిడబ్బులు?” అని నిగ్గతీసి అడిగింది.

దానితో శీనయ్య అదే కుర్చీలో మరోప్రక్కకు తిరిగి పడుకున్నాడు. “నిజమే మా అమ్మదేం తప్పుంది. అయినా

కూడదుగాని—తల్లికీ, తనకూ కలిపి మంగలివాడికి నెలజీతం మాట్లాడుకున్నారు. వాడు ఈమధ్య ఫూరు వెళ్ళడంవల్ల పొద్దిగా పెరిగింది. అది తనతప్పా" అని మళ్ళీ అనుకున్నాడు. అనుకున్నాడే గాని పైకి ఏమీ మాట్లాడలేదు. కొంచెం బింకంగా ఉండాలని బిగించుకునే పడుకున్నాడు.

"ఏమండీ, కోపం వచ్చిందా నామీద?—"

మాట్లాడలేదు శీనయ్య. కళ్ళు మరింత గట్టిగా మూసుకున్నాడు.

"మాట్లాడకపోతే నా దారిన నేను పోయి పడుకుంటా" అంది.

శీనయ్య గతుక్కుమన్నాడు నిజంగావెళ్ళిపోతుందేమోనని. పోనీ కళ్ళు తెరుద్దామా అనుకున్నాడు. తల్లిమాటలు, "దానికి అలుసివ్వకు" అన్నమాటలు—ఆకాశవాణిలోనుంచి వినవచ్చినట్లు వినిపిస్తున్నాయి. అందుకని కళ్ళు తెరవలేదు.

"ఎంత పిచ్చివారండీ మీరు. నిజంగా మీమీద నాకు కోపం వచ్చిందనుకున్నారా? మాఆయన ఎంతో మంచివారు. వెధవసినిమా లేకపోతే పోయింది లెద్దురూ. దానికోసం మనస్సు పాడుచేసుకోకండి..." శీనయ్య రాతిగుండె కొంచెం కరిగి, మంచుకొండలమీది గంగా నదిలా ప్రవహించడం మొదలుపెట్టింది. అయినా కళ్ళు తెరవలేదు. సుబ్బులమ్మ మాటలు మళ్ళీ వినిపించాయి.

అత్తగారు మనమంచికే చెప్పారు. నేనే తెలుసుకోలేకపోయా. నన్ను సినిమాకు తీసుకెళ్ళలేకపోయానే అని మీరు

ఎంతో బాధపడుతున్నారు. పాపం మీ హృదయం నాకు తెలియదూ. రేపు మీరు ఉద్యోగం చేసేటప్పుడు రోజూ వెళ్దాం. లేవండి" అని అన్నది.

శీనయ్యగుండె ఇంకొంచెంకరిగి ప్రవాహం ఎక్కువయి పరవళ్ళు త్రొక్కటం ప్రారంభించింది. యోగసమాధిలో వున్న శంకరుడు సతీదేవి ప్రాణలంది కళ్ళు తెరిచినట్లు, కళ్ళు మాత్రం తెరిచాడు శీనయ్య. "పాపం, సుబ్బులుకూడా మంచిదే... చిన్నతనం. సినిమాలు చూద్దామని ఉండదేమిటి... ఇప్పుడు సరదా తీర్చుకోకపోతే పెద్దదయి పిల్లలుపుట్టినతర్వాత ఏం సరదాలు తీర్చుకుంటుంది? అప్పుడు పిల్లలతోటే సరిపోతుంది" అనుకుని కొంచెం మెట్టు క్రిందికి దిగాడు.

ఇంతలో అతని నుదుటిమీద సుబ్బులమ్మ వెచ్చటి పెదిమలు తగిలేసరికి అతని మొహం— నీళ్ళుపోస్తే బిగిసి పోయిన నులకమంచంలాంటి అతని ముఖం— తామరపూవు లాగ విచ్చుకుంది. అతని రెండుచేతులూ పట్టుకుని సుబ్బులు శీనయ్యను తనవైపు లాక్కున్నది. శీనయ్య మనస్సులో శంకరుడు నటరాజ నృత్యం ఆపుచేసి సతీదేవివైపు వారిగాడు. శీనయ్య మనస్సు మంచులా పూర్తిగా కరిగి, పరవగంగలాగ సుడులు తిరుగుతూ ప్రవహించింది. విశ్వనాథవారి కిన్నెరసాని లాగ శీనయ్య మనస్సు పరవళ్ళు తొక్కుతూ ఉవ్వెత్తుగా లేచి సుబ్బులమ్మను తనలోకి లాక్కుంది.

*   *   *

"ఇలా అయితే ఈ యింట్లో నేనొక్క క్షణం ఉండేది లేదు. నా మాట సాగనప్పుడు ఈ యింట్లో వుండటం నాదే బుద్ధితక్కువ. ఏదో వేరేగా, ఎక్కడున్నా అప్పుచేసి నాకు [illegible]. నా దారిన నేను ఏ కాశీయో, రామేశ్వరమో పోతాను" అన్నది ఒకరోజున కొడుకు ఇంటికి రాగానే. శీనయ్య హడలిపోయాడు. తల్లికి ఇంత కోపం రావడము తాను పుట్టి బుద్ధెరిగిన తర్వాత చూడలేదు. "ఈ సుబ్బి ఏదో చేసివుంటుంది. ఛస్తున్నా దీనితోటి" అనుకున్నాడు తనలో... పైకి "ఏం జరిగిందమ్మా. ఎందుకంత కోపం" అనడిగాడు.

"ఏం జరిగిందమ్మా అని సాగదీసుకుంటూ నన్నడక్క పోతే యింటిలోకి పోయి నీ పెళ్ళాన్ని అడగరాదూ" అని ముసముసలాడుకుంటూ దొడ్డిలో బావి దగ్గరకు పోయింది స్నానానికి. శీనయ్యకు ఏమిచేయటానికి తోచలేదు. నాలుగు అంగల్లో పెళ్ళాంకోసం యిల్లంతా గాలించి చివరికి వంట యింటిలోకి వెళ్ళాడు... అక్కడ చక్కటి తెల్లని సిల్కుచీర కట్టుకుని తలనిండా మల్లెపూలు పెట్టుకుని ముసిముసి నవ్వులు నవ్వుతుంటూ కుంపటిమీద అన్నం వండుతున్న సుబ్బలక్ష్మి దేవి కనుపించింది. గంగానదిలో నీళ్ళు తెల్లగా వుంటాయట, యమునానదిలో నీళ్ళు నల్లగా వుంటాయట. ఇవి రెండూ కలిసేచోటు ఎలా వుంటుందో అలా వుంది శీనయ్య మనస్సు ప్రేమతో, కోపంతో. ఎదురుగా రంభా, ఊర్వశీ, తిలోత్తమలను తలదన్నిన అందంతో భార్య. ఆ భార్యను చూసేసరికి అతనికి పుట్టుకువచ్చిన ప్రేమ ఇంతా అంతా కాదు. మడికట్టు

కుండిగాని లేకపోతేనా అనుకున్నాడు. "బుద్ధిమంతురాల్లా వంటచేస్తున్న తన అర్ధాంగి, ఇల్లాలు, ప్రియతమ చేసిన పాపా పాటునమైమే ఉండునా కో్క్''అనుకున్నాడు నాటకఫక్కీలో. కాని ఏదోచేసేవుంటుంది. లేకపోతే తల్లికి అంతకోపంరాదు ఆవిడను అంత ఏడిపించి ఏవిరా ఏసినట్లు మాసిమాసి నవ్వాలుకూడా ఎందుకు? అందుకే ఆడవాని మనస్సు అంతులోతు అన్నారు పెద్దలు. ఇంతపని చేసి యీ నవ్వులు నవ్వడానికి సిగ్గనేదు ఉండాలి. కొంచెం కోపం ప్రదర్శించాలి అనుకున్నాడు. లోలోపల ఒకసారి సకిలించి కళ్ళు పత్తికాయల్లా చేసి, ఉబికి వచ్చే ప్రేమను కొంచెం లోపలికి కుక్కి (గోనెసంచిలో పత్తి కుక్కినట్లు కుక్కి) "ఏమిటే యీ అల్లరి. ఏం చేశావు నీవు? మా అమ్మకు అంత కోపం వచ్చింది. పదహారేళ్ళొచ్చి బుద్ధి జ్ఞానం వుండక్కర్లా" అన్నాడు. అన్నాడే కాని అంత మాట, లోలోపల మళ్ళీ గతుక్కుమన్నాడు. ఇంత అందమైన ఆకారం కోపంతో ఎక్కడ జేవురించుకుపోయి, బిగుసుకుపోయి, పూలు నేలకేసి కొడుతుందో అని... కాని సుబ్బులు చాలామంచిది. ఆవిడ జేవురించాలేదు, బిగుసుకుపోనూలేదు, పువ్వులు నేలకేసికొట్టనూలేదు. ఇంకా కొంచెం చిరునవ్వు నవ్వి "మీ అమ్మగారినే అడగండి" అంది.

అరటిపండు తొక్కమీద చూడక కాలువేసి జర్రున జారిపడ్డవాడులా అయ్యాడు శీనయ్య. "ఇదేమిటిరా కాలానికి విపరీతం. ఇంతపెద్ద కోపంచేసినా అలా చిరునవ్వు నవ్వుతూనే ఉందేమిటి సుబ్బులు" అనుకుని సరాసరి దొడ్డిలో బావి దగ్గరకు వెళ్ళాడు.

తనతల్లి చేదమీాదచేద, చేపమీాదచేద చన్నీళ్ళు గుమ్మరించుకోవడమేగాని కొడుకు వచ్చిన సంగతే తెలుసుకోలేదు. స్నానం పూర్తయిన తర్వాత చరచరా కొడుకు దగ్గరకు వచ్చింది. ఆ కోపంలో తనను చావకొడుతుందేమో ననుకున్నాడు కొడుకు శీనయ్య. అయినా ఇన్ని బిందెలు చన్నీళ్ళు నెత్తిన గుమ్మరించుకుంది కాబట్టి కొంతకోపం తగ్గిపోయి వుంటుందనుకుని "నిన్నే అడగమంటోందే" అన్నాడు సక్కుబాయి పెనిమిటీలాగ.

"అది కాదురా. నాలుగు రోజుల్నుంచీ చూస్తున్నా. ఎవరూ లేకుండా చూసి, బియ్యం ఏరేటప్పుడు ఆ మట్టిబెడ్డలు నోట్లో వేసుకుంటోంది. నిన్న దొడ్లో డోక్కొటుంకూడా కూడా చూశాను. అటువంటప్పుడు తాను ఎంత జాగ్రత్తగా వుండాలి. అలా మట్టిబెడ్డలు తినటం ఎంత తప్పు."

శీనయ్యకు ఏమీా అర్థంకాలేదు. మట్టిబుర్ర. "బియ్యంలో మట్టిబెడ్డలు తినటం తప్పే. వాంతి చేసుకోవడానికి, జాగ్రత్తగా ఉండటానికి సంబంధంఏమిటి? ఏమిటో నాబొంద" అనుకున్నాడు.

"అదికాదురా పిచ్చిసన్నాసి. ఏమీా తెలియదు వీడికి. రేపు ప్రపంచంలో ఎలా బతుకుతాడో ఏమో... ఒరేయ్, అది మామూలు మనిషికాదురా" అంది. శీనయ్యకు ఇంకా అర్థంకాలేదు.

"కాదూ! ఎందుకని?"

"ఇంకా ఎక్కడ విడమరచిచెప్పనురా నీకు... అది ఒట్టి మనిషికాదు. నీళ్ళు పోసుకుంది."

"రోజూ నీళ్ళు పోసుకుంటూనే ఉందిగా. ఇవ్వాళ ప్రత్యేకంగా పోసుకున్న నీళ్ళేమిటా ?" అనుకున్నాడు లోలోపల.

"రేపునీకు కొడుకో, కూతురో పుట్టబోతున్నారురా... అది యిప్పుడు వంటచేయకపోతే ఏం. నేనులేనూ. ఇంకా కాలూ చెయ్యీ బాగానే వున్నాయిగా. లేకపోతే ఎట్లాగూ తప్పదు... నేను వంటచేస్తానే అమ్మా అంటే కాదుకూడదని తాను ముందు మడికట్టుకు కూర్చునె. ఇదేమన్నా బాగుందా చెప్పు. అందుకనే నన్ను ఏ కాశీకో, రామేశ్వరానికో పంపు బాబూ. నా మాట విననప్పుడు ఈ యింట్లో నేనెందుకూ?" అన్నది ముసలమ్మ మురిసిపోతూ.

ఇందులో శీనయ్యకు ఒక్కమాటా వినిపించలేదు. "కొడుకో-కూతురో పుట్టబోతున్నారూ" అన్న మాటతప్ప. ఒక్కసారి అతని నోటిలోకి లడ్డూలు, జిలేబీ, హల్వా, రసగుల్లా, కందిపొడీ కలిపి కుక్కినట్లయింది. "పరిగెత్తి వెళ్ళి సుబ్బుల్ని——" అనుకున్నాడు. కాని ఎదురుగా వాళ్ళ అమ్మఉంది. బాగుండదు... అందుకని ఊరుకున్నాడు. సుబ్బులు కిటికీలోనుంచి శీనయ్యను చూస్తోంది. అది కనిపెట్టిన శీనయ్య "చెపుతాలేనీపనివుండు" అన్నట్లుచూశాడు. సుబ్బులు చూపులు అతన్ని వెక్కిరించాయి. ఇదంతా అన్నమ్మగారికేం తెలుసు. మనుమడిని చూసుకునే అదృష్టం తనకేదక్కిందని "ఆ మహారాజుంటే ఎంత సంతోషించేవారోకదా" అనుకుంటూ ఊం ఇదయిపోయింది.

శీనయ్య సంతోషంతో మురిసిపోతూ సరాసరి గదిలోకి వచ్చి పడక కుర్చీలో కూర్చున్నాడు. ఎదురుగా గోడకు శీనయ్య తాతగారి ఫోటో, తర్వాత తన తండ్రి ఫోటో, తన ఫోటో కనిపించాయి. కొడుకు పుట్టిన తర్వాత వాడిఫోటో కూడా తీయించి, తన ఫోటో ప్రక్కన తగిలించాలి అనుకున్నాడు. ఇంతలో గోడకున్న శీనయ్యఫోటోలోనుంచి శీనయ్య కదలి తనముందుకి వచ్చినట్లనిపించింది. అసలు శీనయ్యను చూసి, ఫోటో శీనయ్య అడిగాడు "ఏమిటోయి నీ బోడి మురిపెం. కొడుకు పుడుతున్నాడని ఒకే సంబరపడుతున్నావు. సంసారం పెరిగిపోతోందని ఏమయినా ఆలోచిస్తున్నావా... నీ భార్యకు రేపటినుంచీ టానిక్కులు కావాలి, లేకపోతే రేపు పుట్టేవాడు "తాతగారో" అని అరుచుకుంటూ పుడతాడు. వాడికి అనుబంధాలు టానిక్కులు పోయాలి. డబ్బాపాలు కొనాలి. అవి కంట్రోలు రేటుకు దొరకవు. బ్లాకులో బోలెడు ఖరీదు. పురుడుకు ఏ ఆసుపత్రిలోనన్నా చేర్పిస్తే దానికి బోలెడు ఖర్చు. ఇవన్నీ ఎక్కడినుంచి తెస్తావు? ఈలోపలే జాగ్రత్తపడి ఉద్యోగం చూసుకో. పెళ్ళాం కొంగు పుచ్చుకు కూర్చుంటే జరగేందుకు నీవేం పి. డబ్ల్యు. డి. కాంట్రాక్టరువా? సినిమా హీరోవా? అధమపక్షం నీకు సిమెంటు కోటాఅయినా లేదే... కాబట్టి ముందు జాగ్రత్తపడు... అధమపక్షం తాలూకాఆఫీసులో పంచదార గుమాస్తాగానో, రిజిష్ట్రారు ఆఫీసు గుమాస్తాగానో చేరు. నీకు జీతం యివ్వకపోయినా ఫరవాలేదు" అని హెచ్చరించాడు.

శీనయ్యొక్కసారి వెనక్కు తిప్పి చూసుకున్నాడు. నిజమే సుమా అనుకున్నాడు. వెంటనే లాగూ షర్టు వేసుకుని వీధి లోకి వెళ్ళాడు...

శీనయ్య ఉద్యోగంకోసం ఎక్కని గుమ్మంలేదు, దిగని గడపలేదు. ఆఖరికి పాస్పుకాడుకొట్లో లెక్కలు వ్రాస్తానన్నా వాళ్ళు ఒప్పుకోలేదు. “ఎన్నిరకాలలెక్కలు వ్రాయగలవు?” అన్నారు. రెండూ రెండూ కలిపితే—ఎన్నిరకాలు కలిపినా నాలుగేకదా. అసలు ఇందులో రకరకాలంటూ ఏముంటాయన్నాడు. అయితే నీవు మాకు పనికిరావు పొమ్మన్నారు. రెండూ-రెండూ కలిపితే రెండే అని తెలుసుకున్నరోజున వచ్చి తమను కలుసుకోమన్నారు. శీనయ్య ఎంతఆలోచించినా అతనికి తెలియనూలేదు, అతను అందుకోసం తిరిగి వెళ్ళనూలేదు. కొన్నిచోట్ల “ఇదివరలో నీకేమాత్రం అనుభవముంది?” అని అడిగి, “అనుభవం లేనివాళ్ళు తమకు అక్కర్లే”దన్నారు. అసలు ఎవ్వరూ అవకాశం ఇవ్వకపోతే అనుభవం ఎట్లా వస్తుంది?

ఇలా ఉండగా ఒకపెద్ద నగరంలో బి. ఏ. చదివినవ్యక్తి కావాలనీ, ఇంకా ఏవేవో అర్హతలు సూచిస్తూ అడిగారు. ఆ అర్హతలన్నీ శీనయ్యకున్నాయి. పైగా బి.ఏ. కేవలం చదవటమేకాక ప్యాసయ్యాడుకూడా. ఈ ఉద్యోగం తనకు తప్పక వస్తుందని భావించి ఎంతోసంతోషంతో వెళ్ళాడు. ఆ ఇంటర్వ్యూ జరిగేది హైద్రాబాదులో. తనదగ్గర డబ్బులేకపోతే ఎవరిదగ్గరనుంచో ముప్ఫయి రూపాయలు అప్పుతీసుకుని మరీ వెళ్ళాడు. పరీక్ష పేపరు బాగానే వ్రాశాడు. మొత్తం ఆ

పరీక్షకు తనతోపాటు సుమారు అరవై మంది కూర్చున్నారు. వాళ్లల్లో ఎమ్. ఏ. ప్యాసయినవాళ్ళుకూడా ఉన్నారు. తన కంటె ఇంకా దూరదేశంనుంచికూడా చార్జీలు ఖర్చుపెట్టుకు వచ్చారు. వాళ్ళకు కావలసినది రెండు ఉద్యోగాలకు. వచ్చిన అప్లికేషనులు ఒక వెయ్యి నాలుగువందల ఎనభయి. అప్లికేషను ఫారం రెండు రూపాయలచొప్పున, ఆ ఫారంకు సెలక్టు చేయబోయేమో సుమారాస్తాను నాలుగేళ్ళ జీతం వచ్చేసింది. ఆ పద్నాలుగువందల ఎనభయి అప్లికేషన్లలో అరవై మందిని వ్రాత పరీక్షకు పిలిచారు. పేపరు చాలా తేలిగ్గానేవుంది. తన మటుకుతను బాగానే వ్రాశాడు. రెండోవడపోతలో అరవై మందిలో ఇరవై మందిని ఇంటర్వ్యూకు ఉండమని మిగతా వాళ్ళని వెళ్ళమన్నారు. ఆ ఇంటర్వ్యూలిస్టులో శీనయ్యకూడా వున్నాడు. ఒక్కొక్కరినీ పిలిచారు. శీనయ్య వంతుకూడా వచ్చింది. శీనయ్య లోపలికి వెళ్ళాడు. ముగ్గురు ఆఫీసర్లు కూర్చున్నారు. ఒకాయన అడిగాడు.

"ఏమండీ! మీరు యిప్పుడు ఎక్కివచ్చిన మేడకుఎన్ని మెట్లున్నాయి?" అని.

శీనయ్య గతుక్కుమన్నాడు. ఇదేం ప్రశ్న! ఈ మేడకు ఎన్ని మెట్లు ఉన్నాయో అతనికేం తెలుసు! ఈ మేడ ఇతను గానీ, యితని పూర్వులుగానీ కట్టించలేదు. కాబట్టి ఇతనికి తెలియవలసిన అవసరం లేదు. పోనీ ఈ ప్రశ్న అడుగుతారని కొద్దిగానన్నా ఊహించివుంటే వచ్చేటప్పుడు పనికట్టుకు లెక్క పెట్టుకు మరీ వచ్చేవాడు. అదీకాక ఆ ఉద్యోగానికీ, ఈ మేడ

అని ప్రచురించి ఇంత తతంగం— అంటే జరగవలసిన కర్మ కాండ— జరిపి, వాళ్ళ యిద్దరినీ తీసుకున్నారు అని. జీతం నెలకు నాలుగువందలు. ప్రపంచంలో ఇటువంటి విద్రూరాలు కూడా వుంటాయని యిప్పుడే తెలుసుకున్నాడు శీనయ్య.

"ఉన్నవే ఇటువంటి విద్రూరాలు" అన్నాడు కడుపు మండిన మరో ఇంటర్వ్యూ వ్యక్తి.

దీనికోసం అనవసరంగా ముప్ఫయి రూపాయలు అప్పు చేశాడు. ఈ ముప్ఫయిరూపాయలూ తనకు దాదాపు నెల రోజుల గ్రాసం. తానింకా నయం. మిగతావాళ్ళు యింకా దూరదేశాల్నుంచి ఎంతెంతో ఖర్చుపెట్టుకు వచ్చారు. వాళ్ళు చేసిన ఆ ఖర్చంతా వృథా ఖర్చేకదా. ఉద్యోగం పేరట నమ్మించి, ఇంతమందికి అన్యాయంచేసి అవమానించడం ఎంత ద్రోహం. ఈ ద్రోహాన్నీ, ఈ అన్యాయాన్నీ అరికట్టేవారే లేరా అనుకుని, విచారించడంతప్ప తానుగా ఏమీచేయలేనని తెలుసుకుని శీనయ్య లోలోపల కుమిలిపోయాడు... ...

శీనయ్యవున్న ఊళ్ళోనే వొక కో-ఆపరేటివ్ సొసైటీ వుంది. ఆ సొసైటీ శెక్రటరీ శీనయ్యకు దూరపు బంధువు. ఆయన దగ్గరకు వెళ్ళి తనకేదయినా సాయంచేయమన్నాడు. అంటే ఎవరితోనయినా రికమెండు చేసి ఉద్యోగం యిప్పించ మన్నాడు. ఆ శెక్రటరీ "అలాగే, రేపురామాట్లాడదాం" అని నెలరోజులు తన చుట్టూ తిప్పించుకుని చివరిరోజున యిలా అన్నాడు.

"బయట ఎక్కడా అవకాశాలు కనిపించటంలేదు. నీకు ఇష్టమయితే మా సొసైటీలో చేరు. జీతం నలభయి

రూపాయలకంటే ఎక్కువ యిస్తారు. సంవత్సరం అయిన తరువాత ఒక నెలజీతం బోనసుగా వచ్చే ఏర్పాటు చూస్తాను" అని.

శీనయ్యకు ఏనుగెక్కినంత సంబరమేసింది. ఇసుక ఎడారిలో గుక్కెడు మంచినీళ్ళు దొరికినట్లనిపించింది. ఆయన ధర్మాత్ముడు కాబట్టి ఆ ఉద్యోగమయినా యిచ్చాడు" అనుకున్నాడు శీనయ్య. పట్టణంలో వందరూపాయలకన్నా, ఉన్న వూర్లో నలభయి రూపాయలే ఎక్కువలని సరిపెట్టుకున్నాడు. ఆ మరునాడే ఉద్యోగంలో చేరాడు.

దేనికయినాసరే దిగితేనేగాని లోతు తెలియదు అనే శాస్త్రం ఉంది. శీనయ్య కొత్త ఉద్యోగంకూడా అలాగే వుంది. ఆ సొసైటీలో నలుగురు గుమాస్తాలకు సరిపడ పూర్తి పనివుంది. గుమాస్తాలను వేస్తే ఆ సెక్రటరీకి ఉపకార వేతనం రాదు. అందుకని ఏదో కారణం చూపెట్టి నెలకు వందరూపాయలు దొంగలెక్క వ్రాసి అందులో నలభయి శీనయ్యకిచ్చి మిగతాది తన పులుసులో వేసుకుంటున్నాడు సెక్రటరీగారు. ఈ సంగతి తర్వాత తెలిసింది శీనయ్యకు. తెలిసి ఏంచేస్తాడు? కాదంటే యీ నలభయికూడా పోతాయి. కుక్కిన పేనులా చేస్తున్నాడు.

పనిమాత్రం రాత్రింబవళ్ళు చేసినా తరగటం లేదు. నలుగురు గుమాస్తాలపనీ తనే చేసుకురావాలి. రైతులు తెల్లవారనిచ్చేవారుకాదు. అవును. వాళ్ళతొందరవాళ్ళది. పొలాలకు వెళ్ళవలసినవాళ్ళు, ఎండలకాడ పొలంలో ఎరువులు జల్లుకోవలసినవాళ్ళూనాయె. అందుకని తెల్లారకట్టనే సొసై

నికి వచ్చేవాడు ఎరువుల బస్తాలు కావాలని. ఆ సెక్రటరీగారు వచ్చిన వాళ్ళందరినీ శీనయ్య యింటిమీదికి తోలేవారు. వాళ్ళు శీనయ్యను ముఖం కడుక్కోనిచ్చేవాళ్ళు కాదు, స్నానం చేయనిచ్చేవాళ్ళు కాదు. కాఫీ త్రాగనిచ్చేవారు కాదు. పొలో మంటూ అన్నంపోయిన శీనయ్య మధ్యాహ్నం పన్నెండు దాటిన తర్వాత వచ్చేవాడు. ఆదరా బాదరా రెండు మెతుకులు నోట్లో వేసుకొని వెంటనే ఆఫీసుకు పరుగెత్తేవాడు. ఆ వెళ్ళడం వెళ్ళడం రాత్రి పది గంటలకు యింటికి తిరిగివచ్చేవాడు. ఒక్కొక్కప్పుడు భోజనానికి రావడానికి వీలు కుదరకపోతే అరగా అరగా కాఫీ త్రాగి బ్రతికేవాడు. అర్ధరాత్రి వచ్చి కొంచెం స్నానంచేసి, భోజనమయి, కాస్త సుబ్బలక్ష్మిని పరామర్శించబోయేటప్పటికి "ఎరువుల లారీలు వచ్చాయి. దిగుమతి చేసుకోటానికి సెక్రటరీగారు రమ్మన్నారని కూలీలు పిలిచేవారు. జోరున వానగాఉన్నా తనకి పని తప్పేదికాదు. తెల్లవార్లూ పనిచేసి యింటికి వచ్చేటప్పటికి రైతులు మళ్ళీ సిద్ధంగా ఉండేవారు.

నాలుగోరోజు ఉద్యోగానికి ఏనుగల్లేవుండే శీనయ్య పీనుగులా తయారయ్యాడు.

"గంజి త్రాగి పడివుందాం. ఆ దిక్కుమాలిన ఉద్యోగం చేసిపోతే పీడావదా పోయింది. అని తల్లి గోలచేసేది అస్తమానం.

"మీకే ఉద్యోగం ఎవరికోసం చేస్తున్నారు. మీకూ సుఖం లేదు. మాకూ సుఖంలేదు. మానేద్దురు బాబూ" అని సుబ్బలు నెత్తీనోరూ కొట్టుకునేది.

కాని ఉద్యోగం పురుషలక్షణమని శివయ్య ఉద్యోగం మానలేదు. అన్ని అవస్థలు పడుతూ ఉద్యోగం చేస్తూనే ఉన్నాడు. సుబ్బులుకు తొమ్మిదో నెల కూడా వచ్చింది. శివయ్య పుత్రింటివాళ్ళు అవస్థపడటం తప్ప వాళ్ళ కుటుంబానికి పెద్ద చెప్పుకోదగ్గ కష్టాలు లేవు. ఓ శుభవేళకు శుభ వేళలో జరుగుతోంది. సంసారం సాఫీగానే నడిచిపోతోందనే చెప్ప వచ్చు. పరంధామయ్యగారూ, కుటుంబం; పక్కింటి వాళ్ళ కుటుంబం వచ్చి సుబ్బులుకు పసుపూ కుంకుమ ఇచ్చి వెళ్లారు. పురుటికి సుబ్బుల్ని వాళ్ళవూరు తీసుకువెళ్తామన్నారు. కాని శివయ్య ససేమిరా వల్లకాదన్నాడు. అన్నమ్మకూడా కొడుకు పక్షమే పలికింది ఈవిషయంలో. కారణమేమిటంటే సుబ్బులు ఆరోగ్యం సరిగా ఉండటంలేదనీ, ఆ అడవిలో పురుడుపోసు కోవడంకంటే వైద్యసదుపాయం అందుబాటులో ఉన్నచోట పురుడుపోసుకోవడం మంచిదని శివయ్య అభిప్రాయం. పరంధా మయ్యగారు మొదట పట్టుబట్టినప్పటికీ దూరదృష్టి ఆలోచించి కూతురు క్షేమమేకదా కావలసిందని దానికి ఒప్పుకున్నారు. సమాత్రం పురుడువచ్చే అనుమానం తగిలినా వెంటనే మని షిని పంపమనిచెప్పి, వాళ్ళు వెళ్ళిపోయారు. మనిషినే ఎందుకు పంపమన్నారంటే, ఉత్తరం వ్రాస్తే ఆరు రోజులను, టెలిగ్రా మిస్తే పదిహేను రోజులకు అందే వూరు పరంధామయ్యగారిది. అందుకనే మనిషిని పంపవలసిందని, మనిషయితే రెండురోజు లలో చేరవచ్చనీ చెప్పాడు. "సరే"నన్నాడు శివయ్య. భర్తను వదిలి ఉండలేని సుబ్బులమ్మ లోలోపల సంతోషించింది. "నిన్న మొన్నటి సుబ్బులు ఎలా తయారయిందో చూశారా.

అతనంటే దానికి వెర్రిప్రేమ” అంది సుబ్బులు తల్లి పరంధా మయ్యతో...

“సంతోషించు. నీ పోలిక రాలేదు దానికి, నా పోలిక వచ్చింది” అన్నాడు చిలిపిగా పరంధామయ్య.

“అయ్యో, చెప్పొచ్చేరు, మీ ప్రేమా మీరున్నూ” అని బుంగమూతి అటూయిటూ తిప్పుకుంది పరంధామయ్య ఇల్లాలు...

రోజులన్నీ వొకేమాదిరి గడవవు. ఏదో చిరుగాలి కెరటాలకు శీనయ్య పడవ సాఫీగా సాగిపోతోందీ అనుకుంటే, ఆ చిరుగాలి కెరటాలమధ్య అకస్మాత్తుగా తుఫాను బయల్దేరింది. వేళకు తిండీతిప్పలులేక, నిద్దరలేక ఉద్యోగం చేస్తున్న శీనయ్యకు అకస్మాత్తుగా ఒక ఉదయం బ్రహ్మాండమయిన కడుపు నొప్పి వచ్చి గిలగిలకొట్టుకుని మెలికలు తిరిగిపోవటం మొదలు పెట్టాడు. అన్నమ్మగారూ, సుబ్బులూ కుప్పలా కూలిపో యారు. అన్నమ్మ ముసల్ది, సుబ్బులు నిండుమనిషి. వాళ్ళకు ఏమిచేయడానికీ తోచలేదు. ఇద్దరూ కలసి అతనిని ఎంత నొక్కిపట్టినా అతను బాధతో గిలగిలకొట్టుకోవడం ఆగటం లేదు. అన్నమ్మా, సుబ్బులూ బావురుమని ఏడుస్తూ శీనయ్య ఏమయిపోతాడో అన్న భయంతో గడగడలాడిపోతున్నారు. వేరే మగదిక్కులేని కుటుంబం. ఇంటిలో కాసీలేదు. పోనీ పరంధామయ్యగారికి కబురు పంపుదామంటే వెళ్ళేవారెవ్వరు? వెళ్ళిరావడానికే మూడురోజులు పడుతుంది. ఛార్జీలకన్నా ఇంట్లో డబ్బులేదు.

"తొమ్మిదో నెలకూడాను. ఆవిడను ఇవతలికి తీసుకు రండి. అలా గుండెలు బాదుకుని ఏడవటం ప్రమాదం కూడాను" అన్నారు కొందరు.

"శీనయ్యే పోలికేవచ్చి పుట్టబోయేవాడు తండ్రిగండాన పుడతాడేమో" అన్నాడు ఒక అక్కుపక్షి.

"ఛా. నోర్మూయ్" అన్నాడు ఒక బారుమీసాలరౌడి. అందరూ తలా ఒకవిధంగా ఊసులాడుకునేవారేగాని సాయం చేయడానికి ముందుకువచ్చేవాళ్ళు ఎవరూ కనుపించడంలేదు. ఇంతలో డాక్టరుగారువచ్చి సరాసరి శీనయ్యదగ్గరకువెళ్ళి పరీక్షించి "ఇది ఎపెండిసైటిస్. వేళకు సరిగ్గా తిండీ, నిద్రా లేనప్పుడు రావటానికి అవకాశంవుంది. భోజనానికి బదులు చెత్త తిండితిన్నప్పుడుకూడా రావచ్చు. దీనికి మందు వెంటనే ఆపరేషను చేయించడమే కాబట్టి ఈయన్ను ఏ పెద్దాసుపత్రికన్నా తీసుకువెళ్ళే విధానం చూడండి. ఇరవై నాలుగు గంటల్లో ఆపరేషను జరగాలి" అని సలహాయిచ్చి ఆయన వెళ్ళిపోయాడు. అన్నమ్మా, సుబ్బులక్ష్మిల ఏడుపు శృతిపెరిగిపోయింది. పెద్దాసుపత్రి అంటే మాటలా ఎవరు తీసుకెళ్తారు? ఎట్లా తీసుకెళ్తారు? చేతిలో కానీలేదు. "ఇక శీనయ్యకూ తమకూ ఋణం తీరిపోయిందనుకున్నారు. శీనయ్యను అభిమానించే రైతులూ తలా ఒక అయిదూ చందాలు వేసుకుని ఒక నంరరూపాయలు తెచ్చి అన్నమ్మగారి చేతిలో వుంచారు. అతని పద్నాలుగురోజులు జీతం లెక్కచూసి శక్రదరీగారు పద్దెనిమిదిరూపాయల పదణాలూ పంపించాడు. [illegible]రావుగారు మాత్రం వినకాముందూ ఆలోచింప

కుండా తన స్వంతానైకం ఖర్చుపెట్టుతూ ఒక చిన్నకారు తీసుకువచ్చాడు.

శీనయ్యను పెద్దాసుపత్రికి అంటే—గవర్నమెంటు ఆసుపత్రికి-తీసుకొచ్చారు. ఆసుపత్రి గేటులో జవాను లోపలికి రానివ్వక పోతే అతని చేతిలో ఒక రూపాయి పెట్టి లోపలికి వచ్చారు. ఆసుపత్రిలో అన్నమ్మా, సుబ్బులూ గుండెలు బాదుకుంటూ ఏడుస్తుంటే ఎవరో వచ్చి బిగ్గరగా ఏడవకూడదని, ఇక్కడ కంట్రోలు ప్రకారం నడవాలనీ హుకుం జారీచేశాడు. కడుపులో బాధకు కంట్రోలు ఏమిటో వీళ్ళకు అర్థంకాలేదు. కొద్దిగా శృతితగ్గించి ఏడ్చారుకాని వాళ్ళు చెప్పారుకదా అని వచ్చే దుఃఖాన్ని ఆపుకోలేకపోయారు. వీళ్ళు ఆసుపత్రి ఆవరణలో ప్రవేశించేటప్పటికి రాత్రి 8 గంటలయింది. రావడమయితే వచ్చారుగాని ఇంత పెద్దఆసుపత్రిలో ఎవరిని కలుసుకోవాలో ఎక్కడ కలుసుకోవాలో తెలియదు. వీళ్ళపాలిట కామేశ్వర రావుగారు ఒక దేవుడై వెలిశాడు... కాదుకాదు దేవుడే కామేశ్వరరావుగా వీళ్ళపాలిట అవతరించాడు. వీళ్ళనిక్కడ కూర్చోబెట్టి కామేశ్వరరావుగారే డాక్టరుగారికోసం పరుగెత్తారు. డాక్టరుగారిని కలుసుకుని మాట్లాడేసరికి అరగంట పట్టింది. అప్పటికి వారితో ఇంటర్వ్యూ దొరికింది. ఇంతా కష్టపడి డాక్టరుతో ఇంటర్వ్యూ సంపాదిస్తే ఆయనగారు చెప్పిన విషయం "ఇప్పుడు లాభంలేదు. రేపు ఉదయం తీసుకురమ్మని."

"అలాకాదండీ. చాలా సీరియస్ కేసు. ఇరవైనాలుగు గంటల్లో ఆపరేషను జరగకపోతే అతను మనకు దక్కడని

మా డాక్టరుగారు చెప్పారు. మీరు దయతలచాలి."

"ఓ సినిమాల్లో? డాక్టరుగారే... ఎవరో డాక్టరు మీకలా చెప్పినవారు... ఏమయితేం ఇప్పుడు లాభంలేదు. పగలల్లా పని చేసి ఇప్పుడే విశ్రాంతి తీసుకుంటున్నాం."

కామేశ్వరరావుగారికి ఏమీ తోచలేదు. వెంటనే జేబులోనుంచి వంద రూపాయలనోటుతీసి బల్లమీద పెట్టారు. డాక్టరుగారు వందరూపాయలకాగితం చూచేసరికి కొస్తు. కష్టం మాట మరచిపోయి వెంటనే బయలుదేరారు.

ఆ రాత్రి శీనయ్యను ఆస్పత్రిలో చేర్చుకున్నారు. తాత్కాలికంగా కొన్ని మందులు వాడి కడుపునొప్పి ప్రస్తుతానికి తగ్గించారు. మర్నాడు ఉదయం ఆపరేషను చేస్తామని చెప్పారు. ఆ రాత్రికి రోగిదగ్గర ఒకళ్ళుమాత్రమే వుండి మిగతావాళ్ళను వెళ్ళిపొమ్మన్నారు. ఆ రాత్రికి బయట రోడ్డుమీద చలిలో సుబ్బులూ, అన్నమ్మ తమ కొద్దిపాటి సామానును తలక్రింద పెట్టుకుని పడున్నారు...

తెల తెలవారింది. శీనయ్యకొప్పితగ్గి కొంచెంమామూలు స్థితిలోపడ్డాడు. ఆ రోజు తనకు ఆపరేషను అన్న సంగతి తెలుసుకుని గాబరాపడ్డాడు శీనయ్య. కామేశ్వరరావు గారిని పిలిచి "తనకు ఆపరేషనువద్దని భయమేస్తోందనీ ఈసారి కడుపునొప్పివస్తే మళ్ళీ రావచ్చనీ" బ్రతిమిలాడుకున్నాడు. శీనయ్య ఎంతబతిమాలినా కామేశ్వరరావుగారు అందుకు ససేమిరా ఒప్పుకోలేదు.

శీనయ్య మంచంప్రక్క మంచానికి చుట్టూ తెరలు అడ్డుకట్టేసున్నాయి. కారణం ఏమిటో అడిగితే అరగంటక్రితం

ఆ మంచంమీదరోగి చనిపోయాడట. వాళ్ళవాళ్ళు రాగానే గాని ఈశ్వరలగానీ ఆ శవాన్ని అక్కడనుంచి తప్పిస్తారట. ఇది తెలుసుకున్న శీనయ్య కళ్ళుగా బిగుసుకుపోయాడు.

"ఇంకో గంటకో ఘడియకో వాళ్ళు తన భరతంపడతారని" శీనయ్య బాధపడుతున్నాడు. కామేశ్వరరావుగారు పక్కనకూర్చుని అనేకవిధాల ధైర్యంచెప్పారు. చివరికి చేసేది లేక గుండె రాయిచేసుకుని పంచప్రాణాలలో ఒక ప్రాణంతప్ప మిగతావి వదిలేసి కూర్చున్నాడు. తన వెనకటి జీవితమంతా ఒక్కసారి జ్ఞాపకంచేసుకున్నాడు. పుట్టబోయే కుమారుని తలుచుకుని "అతనిని చూసేభాగ్యం తనకు లేదుకాబోలు ననుకున్నాడు."

"కామేశ్వరరావుగారూ ఒక్కసారి నాభార్యను, తల్లిని చూడవచ్చా?"

"చూడవచ్చుగాని ఇప్పుడువద్దు నామాట విను. నీకేం ఫర్వాలేదు. హాయిగా నయంచేసుకుని ఇంటికివస్తావు" అని ధైర్యంచెప్పాడు. అన్నమ్మగారూ, సుబ్బులూ అక్కడికివస్తే వాళ్ళ హాస్పటలు ఎగిరేటట్లు ఏడవటమేకాకుండా ఇతని మనస్సుకూడా చెడగొడతారని కామేశ్వరరావుగారి అభిప్రాయం. అందుకే అంగీకరించలేదు.

ఎనిమిదిగంటలయింది. శీనయ్యకు పైనుంచి క్రిందికి పైనుగుడ్డ, సన్యాసివాడికికట్టినట్లు కట్టారు. ఆ బట్టలు వేసుకోవాలంటేనే అతనికి రోతగావుంది. తప్పదు ఏంచేస్తాడుమరి. ఎనిమిదిన్నరకు ఇద్దరు యములాళ్ళు ఒక తోపుడుబండితో సహా వచ్చారు. వాళ్ళకూడా అదేమాదిరి పైనుగుడ్డలు

గోనులుగా కట్టించుకున్నారు. ఎప్పుడో ఆపరేషను సంగతి ఏలావున్నా ఈ బండీ తోసుకువెళ్ళే యములాళ్ళనిద్దరినీ చూసేసరికే శీనయ్య మిగిలివున్నప్రాణంలో సగంపోయింది. వాళ్ళ ఆకారాలు అలా ఉన్నాయి మరి.

ఒకడు సన్నగా పొడుగ్గావుండి జీంబోతుతలా, ఎత్తు పళ్ళా సినిమాల్లో యమధర్మరాజు గేటుదగ్గరవుండేవాడులా వున్నాడు. రెండోవాడు లావుగా పొట్టిగావుండి హన్చిబాక్ ఆఫ్ నాటర్‌డామ్‌లో గూనివాడులాగ పుట్టెడుగూనితో గజానికి ఒక అంగ-నొప్పైన వేసుకుంటూ నడుస్తాడు. వాళ్ళిద్దరూ బండీతోసహా శీనయ్యదగ్గరకువచ్చి "టైమయింది" అన్నారు.

ఆ అనటం "ఇక మీకు ఈ భూమిమీద నూకలు లేవు పరలోకప్రయాణానికి టైమయింది" అన్నట్లు వినిపించింది శీనయ్యకు. కళ్ళుమూసుకు ఇష్టదేవతాప్రార్థన చేసుకున్నాడు. కామేశ్వరరావుగారి కాళ్ళకు దణ్ణంపెట్టి కళ్ళుతుడుచుకుంటూ గట్టిగా కళ్ళుమూసుకు బండీమీద పడుకున్నాడు. కామేశ్వరరావుగారు వెళ్ళిపోతున్న శీనయ్య బండీచూసి కళ్ళుతుడుచుకున్నారు.

అదేంపద్ధతో నాకు తెలియదు. మరి ఆ హాస్పటల్లో ఒక్క-చోటే అలాజరుగుతుందో, లేక అన్నిచోట్లా అంతేనో మరి... మీరెప్పుడయినా గొఱ్ఱెలనునరికే కబేళా చూశారా. ఒక పెద్దదొడ్డిలో ఈ గొఱ్ఱెలనన్నిటినీ పెడతారు. ఆ నరికే చోటుకు ఒక్కొ-క్క-దానినీ పంపుతూవుంటారు. ఆ వెళ్ళిపోయే ప్రతిగొఱ్ఱెనూచూసి దొడ్డిలోని గొఱ్ఱెలు కళ్ళనీళ్ళు కారుస్తూ తమతమ వంతు ఎప్పుడొస్తుందో అని ప్రతినిమిషం లెక్క-

పెట్టుకుంటూవుంటాయి. ఒక నిమిషం - రెండునిమిషాలు - అయిదు-పది-పదిహేను... అంతే. నిమిషాలు తేడాయేగాని ఆ పూటతో ఆ గొత్తెలకన్నిటికీ చావుతప్పదు. కేవలం అలా చేటుకాదుగాని అక్కడిపద్ధతిచూస్తే ఆ కబేళాసీను జ్ఞాపకం రాకమానదు.

ఆరోజు ఆపరేషనుచేసేవారినందరిని తెచ్చి వరసగా బల్లలువేసి కూర్చోపెడతారు... ఎవళ్ళవంతు వచ్చినప్పుడు వాళ్ళు ఒక్కొక్కరుగా లోపలికి వెళ్తూవుంటారు. ఒక్కొక్క తోపుడుబల్లమీద ఒక్కొక్క ఆపరేషను అయినవ్యక్తి బయటకురాగానే మరొకవ్యక్తి బెరుకుబెరుగా కబేళాకువెళ్ళే గొత్తెలాగ భయపడుతూ పడుతూ, అడుగులో అడుగువేసు కుంటూ ఆపరేషను థియేటరులోకి వెళ్తారు.

శీనయ్యవంతు వచ్చింది. అంతకుముందు ఆపరేషను అయినవాడిని తోపుడుబల్లమీద పడుకోబెట్టి తోసుకెళ్తు న్నారు. అతను బ్రతికున్నట్లా చచ్చిపోయినట్లా? మొత్తంమీద కదలటంలేదు... శీనయ్యను నడిచి గదిలోనికి రమ్మన్నారు. ఇదే ఆఖరిచూపు అనుకున్నాడు శీనయ్య. దూరంగా భార్యా, తల్లీ, కామేశ్వరరావుగారూ ఏడుస్తూ కనుపించారు. బయట ప్రపంచం చూడటం ఇదే ఆఖరిసారో మళ్ళీ చూస్తానో. ఒక్కొక్క దేవుడిని తలుచుకుంటూ మనసులోనే వాళ్ళకు కొబ్బరికాయలు, నీరాజనాలు, సమర్పించుకుంటూ శీనయ్య ఆపరేషను టేబుల్‌మీద పోయిపడుకున్నాడు.

ఆ గదిలో పెద్దడాక్టరుతోసహా పదిపదిహేనుమంది ఉన్నారు. ఒకడు నాడిపరీక్షకు, ఒకడు రక్తపోటుపరీక్షకు,

"ఇదిగో ఇదిచూశారా. ఈ భాగం. దీనిలోకి పెద్ద పదార్థంపోయి కట్టి దీనివల్ల నొప్పుసొప్పి వస్తుంది. ఇక మనం తీసెయ్యాలి. ఇదుగో దీన్ని ఇలా ఇలా కత్తిరించాలి..." ఏమేమో చెప్పుకుపోతున్నాడు. మిగతావాళ్ళు ఊకొడుతున్నారు. అప్పుడు శీనయ్యకు తెలిసింది. అందులో కొంతమంది డాక్టరు చదువు చదువుతున్న విద్యార్థులని. వాళ్ళు ఎలా ఆపరేషను చేయాల్సిందీ నేర్చుకుంటున్నారని...

"వీళ్ళందరూ కూడా. నేనే దొరికానా వీళ్ళు చదువు నేర్చుకోటానికి. నన్ను నిలువునాకోసి పిల్లలు పాఠం నేర్చుకుంటున్నారా. పిల్లికి చెలగాటం. ఎలుక్కి ప్రాణసంకటం అన్నట్లు ఇదేనా సమయం" అనుకున్నాడు శీనయ్య. అంతే కాదు. "వాళ్ళసలంత సరదాగావుంటే ఆ పెద్దడాక్టర్నికోసి మిగతావాళ్ళు చూడకూడదూ రోగం వదిలేది" అనుకున్నాడు. ఇంతకీ ఆపరేషను ప్రారంభించారో లేదో అతనికి తెలియటం లేదు. నడుందగ్గర అంతా మొద్దుబారి ఏమీ తెలియటం లేదు. తనతల్లీ, భార్య బయట ఎంత ఏడుస్తున్నారో...

ఇది ఇలావుండగా బయటపరిస్థితి. వెక్కి వెక్కి ఏడుస్తున్న సుబ్బులుకు అకస్మాత్తుగా నొప్పులు ప్రారంభమయ్యాయి. కామేశ్వరరావు అనుకుంటూనే వున్నాడు. మనసులో కలిగే అదటుకు సుబ్బులుకు ఏక్షణంలోనన్నా పురుడు రావచ్చునని. అలాగే జరిగింది. అన్నమ్మగారి పరిస్థితి చెప్పటానికి వీలులేదు. "ఏమిట్రా భగవంతుడా ఈ కఠినపరీక్ష నాకు" అనుకుంది. సుబ్బుల్ని మెటర్నిటీవార్డులోకి తీసుకువెళ్ళారు. కోడలు అటుగదిలో... కొడుకు ఇటుగదిలో... తాను

ఏ గుడిలోకీ వెళ్ళడానికి వీలులేదు. తనపాలిటి భగవంతుడు ఆ కామేశ్వరరావు ఒక్కడుతప్ప తనకు "నా" అన్నవాళ్ళు ఒకళ్ళు కనిపించడంలేదు. కొడుకూ, కోడలూ సవ్యంగా నయమయి ఆసుపత్రినుంచి బైటపడితే ఏడుకొండలస్వామిని ఏడాదిలోపలే స్వయంగా దర్శించుకుని, సత్యనారాయణవ్రతం చేసుకుంటానని మొక్కుకట్టుకుంది అన్నమ్మగారు. "కావాలంటే తనను తీసుకెళ్ళి కొడుకునూ, కోడలినీ బ్రతికించమని" సర్వేశ్వరుడికి మనస్సులో దరఖాస్తు పెట్టుకున్నది.

ఆపరేషను థియేటరునుంచి తోపుడుబండీ తోసుకొస్తున్నారు పొట్టివాడూ పొడుగువాడూ కలసి.

"ఎలావున్నాడు బాబూ నాబిడ్డ" అన్నమ్మగారు ప్రశ్నించింది ఆదుర్దాగా.

"ఏంఫర్వాలేదు. ఆపరేషను సక్సెస్‌ఫుల్" అన్నాడు గూనివాడు. శీనయ్యకు తల్లిమాట వినిపిస్తోంది లీలగా... అదే లీలగా ఇంకోమాట కూడా దూరంనుంచి వినిపించింది. "పండంటి మగపిల్లాడు" అని... ఎవరికోగదా అనుకున్నాడు శీనయ్య.

* * *

"అమ్మా నీమనుమడుకు నాపోలిక రాలేదే" అన్నాడు శీనయ్య ఒకరోజున కొడుకుని ఎత్తుకుముద్దులాడుతూ.

"పోనీలే నాయనా. ఎవరిపోలికో ఒకరిపోలిక. తండ్రి పోలిక కాకపోతే తల్లిపోలిక వచ్చి వుంటుంది"అంది అన్నమ్మగారు మనుమడి బుగ్గలు రెండుచేతుల్తో తడిమి తన చెంపకేసి మెటికలు విరుచుకుంటూ.

"అదికాదమ్మా నేననేది. నేను పుట్టి, మానాయనని యాత్రకుపంపించాను. వీడుపుట్టి వీళ్ళనాయనను [illegible] కున్నాడు."

"పోనిద్దూ ఆ దిక్కుమాలిన పోలికలూ, దిక్కుమాలిన మాటలూ ఇప్పుడెందుకు. శుభమా అని ఇద్దరూ మళ్ళీ నట్టింట కాలుపెట్టారు. "దేవుడల్లే మన కామేశ్వరరావుగారుండబట్టి ఈ మాత్రం గడిచింది. ఆయనఋణం ఈ జన్మలో తీర్చుకోలేము. ఒరే శీనయ్యా! ఈసారి ఆయన వచ్చినప్పుడు మొత్తం మనకెంత ఖర్చుపెట్టాడో అడుగునాయనా. ఎలాగోలా ఆ డబ్బు తీర్చివెయ్యాలి" అంది అన్నమ్మగారు "అలాగే"నన్నాడు శీనయ్య.

డాక్టర్లు శ్రీనివాసరావును కొన్నాళ్ళపాటు పూర్తి విశ్రాంతి తీసుకోవాలన్నారు. దానికితగ్గట్లు ఆ నలభయి రూపాయల సొసైటీ ఉద్యోగం, తానులేనందున ఎవరికో దారాదత్తమయింది.

"కొన్నాళ్ళు పనిచేస్తే ఏదో ఒకనెలజీతం బోనసు యిస్తానన్నారుకదా అందులో కొంతయినా యిస్తే ఈ ఆపద సమయంలో అక్కరకు వస్తుంది." అని సెక్రటరీగారిని అడిగితే ఆయనగారు-మధ్యలో మానేస్తే అది ఇంకా ఎట్లా వస్తుందని దానికికాస్తా ఎగనామంపెట్టాడు. డాక్టర్ల సలహానుసరించి, శీనయ్య బలానికి మంచిమంచి టానిక్కులూ, పళ్ళరసం, పాలు త్రాగాలి. ఇల్లుగడవటమే కష్టంగాఉంటే ఇందులో ఏవి మాత్రం తనకు అమురుతాయి. మళ్ళీ ఏదన్నా ఉద్యోగం చూసుకుంటానన్నాడు. అందుకు అన్నమ్మగారు ససేమిరా

ఒప్పుకోలేదు. పనికట్టుకు ఒకరోజున వాళ్ళఊరుపోయి మిగిలిన ఒక్క ఎకరం అమ్మి, వచ్చినంతవరకూ డబ్బు తీసుకు వచ్చింది. "కాసువాత ఉంటే తినవచ్చు లేకపోతే నాలుగు ఇళ్లల్లో ముష్టిఎత్తవచ్చు, కాని ఇప్పుడు ఈ సమయంలో ఉద్యోగంకోసం కొడుకు మంచంపట్టటానికి వీల్లేదు" అంది. ఇతరుల ప్రమేయం లేకుండానే తల్లి కొడుకుకోసం, టానిక్కులూ, పళ్ళూ ప్రియంగా తెప్పించేది. ఇక మనుమడికి కావలసిన వాటిసంగతి వేరే చెప్పాలా. మూడుచక్రాల సైకిలుతోసహా అన్నీ వచ్చిపడ్డాయి.

"ఎందుకే యివన్నీ. ఉన్నదంతా ఇవ్వాళే ఖర్చుచేసుకుంటే రేపు ఏంతింటాము. కొంచెం వెనకాముందూ ఆలోచించు" అన్నాడు శీనయ్య.

"వాళ్ళతాతమ్మ ఆస్తి వాడికికాక ఇంకెవరికి" అన్నది అన్నమ్మగారు. పైగా "మీకు కావాలంటే మీరే సంపాదించుకోండి" అనికూడా అన్నది.

పొలం అమ్మినడబ్బు చేతిలోవుందికాబట్టి ప్రస్తుతానికి సంతోషంగా సాఫీగానే గడిచిపోతోంది. ఆ డబ్బులో కామేశ్వరరావుగారికి యివ్వవలసిందికూడా ఇచ్చేశారు.

ఒక నెలరోజులు గడిచాయి. శీనయ్యకు కొంచెంబలం చేకూరి మామూలు మనిషయ్యాడు. బ్యాంకులో డబ్బు క్రమంగా తరిగిపోవటం మొదలెట్టింది. దీపంఉండగానే యిల్లు చక్కపెట్టుకోవాలనుకున్నాడు శీనయ్య. ఈ విషయమే ఒక రోజున మాటలసందర్భంలో కామేశ్వరరావుగారితో అంటే ఆయన "తను పనిచేస్తున్న పత్రిక ఆఫీసులో ఖాళీవుందనీ

నెలకు వందరూపాయలు ఇస్తారని తనకు యిష్టమయితే జన రల్ మేనేజరుతో మాట్లాడతానని" చెప్పాడు.

కలిసొచ్చేరోజులొస్తే అలాగే కలిసివస్తుంది. అంతకంటె శీనయ్యకు కావలసిందేముంది. వెంటనే సరే అని కామే శ్వరరావుగారి కాళ్ళుపట్టుకున్నాడు.

ఆ మర్నాడే కామేశ్వరరావుగారు జనరల్ మేనేజ రుతో మాట్లాడి తన పత్రిక ఆఫీసులో శీనయ్యకు ఒక ఉద్యో గం ఏర్పాటుచేశాడు. ఆసుపత్రికి తీసుకువెళ్ళి, నయంచేయిం చినదానికంటే ఈ ఉద్యోగం ఇప్పించినందుకు ఎక్కువ కృత జ్ఞత తెలుపుకున్నాడు శీనయ్య కామేశ్వరరావుగారికి...

సుబ్బలక్ష్మికి ఋణంతీరుబడి ఉండటంలేదు. అన్నపూర్ణ గారికి వెనకటిఓపిక తగ్గిపోయింది. కళ్ళుకూడా సరిగ్గా కన పించటంలేదు. మతిసరిగ్గా ఉండటంలేదు. ఉప్పువేయబోయి పప్పువేయటం, పప్పువేయబోయి రెండుసార్లు ఉప్పువేయటం జరుగుతోంది. అందుకని సుబ్బలక్ష్మే రెండుపూటలా మడి కట్టుకుని అన్నం వండుతోంది. అలా అని అన్నమ్మగారికి పనిలేదనుకోకండి. ఇరవైనాలుగు గంటల్లో ఏ ఎనిమిదిగంటలో తప్పించి మిగతా పదహారుగంటలూ మనుమడిని ఎత్తుకు కూర్చోబెట్టానికే సరిపోతోంది. రామా, కృష్ణా కూడా మరిచి పోయింది. ఎప్పుడూ మనుమడి నామస్మరణా, వాడిముద్దులూ. వాడిమురిపాలూ, వాడిలీలలూ, ఇవి తలుచుకు తలుచుకు నలుగురికీ చెప్పి మురవటంతోటే సరిపోతోంది ఆవిడకు.

"సన్నవాటుకు నిన్నస్నానంచేసి కొత్తబట్ట కట్టుకుంటే

మనుమడు దానినంతా తడిపేశాడట" మనుమడిలీలలలో అది ఒకలీల.

"మొన్న తనకేసిచూసి నవ్వాడట" అది మరో లీల.

ఇంత అల్లరివాడితో ఎలావేగాలో తెలియటం లేదంటుంది.

"వాడికి ఎత్తుకు అలవాటు చేయకండి. నా ప్రాణం తీస్తాడు" అంటుంది సుబ్బలక్ష్మి హామేశా అత్తగారితో. అయినాసరే ఆవిడ ఎత్తుకుతిరగటం మానదు. వాడుకూడా ముసలమ్మదగ్గరుంటే తల్లి పిలిచినా రాడు. దానితో తల్లి "మీరూ మీరూ ఒకటేగా నేనే పరాయిదాన్ని" అంటుంది.

"అదేంకాదు. నీవు వాడిని కసురుతావు, అందుకని నీవంటే వాడికి కోపం" అంటుంది ముసలమ్మ.

"ఆ ... ఏంచేయమంటారు. ఇంటెడు చాకిరీతోనే చస్తుంటే, విసిగించుకుంటాడు."

"నేను కాస్తపని అందుకుంటానే అంటే ససేమిరా నన్ను ఆ చాయలుకే రానివ్వవాయె."

"మీరు వాడిని ఎత్తుకుంటే అదే పదివేలు. మీరుపని చేసిపెట్టినట్లే...ఏదో ఒక్కదాన్నే అలా తంటాలుపడతా. కాకపోతే భోజనానికి కాస్త ఆలశ్యమవుతుంది."

ఈ విధంగా జరిగిపోయేది వాళ్ళసంభాషణ. రెండు రోజులకొకసారి.

ఇక శీనయ్యవిషయం. ప్రొద్దుటే అయిదుగంటలకల్లా లేచి గవర్నమెంటు పాలడిపోకు పరుగెత్తి పోయించుకునే అర లీటరు పాలకోసం అరగంట క్యూలో నిలబడటం...

ఆ తర్వాత సంచీ చేతపట్టుకుని బియ్యం క్యూలోకి పోయి నిలబడేవాడు. అక్కడినుంచి టైటపడేసరికి తొమ్మిది గంటలు ఆట్టే ఆలోచిస్తే ఉద్యోగంచేయటంమాట అటుంచి ఈ క్యూలో నిలబడటానికే తనజీవితం సరిపోతోందే అను కున్నాడు. సాయంకాలం ఆఫీసునుంచి రాగానే కిరసనాయిలు క్యూ, కూరలకు క్యూ అన్నీ క్యూలే.

వచ్చేజీతం హానీఆనీగా సరిపోయేది గృహాఖర్చులకు. ఇక గుడ్డలకూ, ఏదన్నా రోగాలువచ్చినప్పుడు, పైచుట్టాలకు పెట్టుబడులు పెట్టవలసి వచ్చినప్పుడూ శీనయ్యపడే అవస్థ అంతా యింతాకాదు.

ఇక ఆఫీసుపరిస్థితి కాస్తకూస్త హెచ్చుతగ్గుగా రోజూ ఏదోవిధంగా తిట్లు తింటూనేవున్నాడు.

సదరు శీనయ్యపనిచేసే పత్రికాధిపతి అక్కడక్కడా ఉపన్యాసాలు చెపుతూ తనపత్రిక చాలా నిష్పక్షపాత పత్రిక అనీ సంఘంలోని కుళ్ళును కడిగివేయటానికి ఏర్పడ్డ ఏకైక పత్రికనీ వేదికలమీద బల్లగుద్ది మరీ చెపుతూవుండేవాడు. ఆ ఉపన్యాసాలు శీనయ్యను బాగా ఆకర్షించాయి. తనుకూడా యజమానికి చేదోడువాదోడుగా వుండి సంఘాన్ని మరమ్మత్తు చేసి ప్రజాసేవ చేయాలనుకున్నాడు.

ఒకసారి అతనికి ఒక రూఢివార్త తెలిసింది. ప్రాంతంలో ఉన్న ఒక రాజకీయనాయకుడు లంచాలు తిని ప్రజలకి ఎంతో లాభించేపనిని, ప్రజలకుకాకుండా ఒక కాంట్రాక్టరుకు ఇప్పించాడు. ఆ పనివల్ల ఆ ప్రాంతానికి చాలానష్టం కలిగింది ఈ ఘోరఅన్యాయాన్ని సహించలేక శీనయ్య ఘాటుగా విమ

వ్రాస్తూ తన పత్రికలో పెద్దవ్యాసం వ్రాశాడు. అది మినస్టరుగారిమీదికి ఎక్కుబోయేముందు పత్రికాధిపతి కంటపడింది. తాను చేసినపనికి అధికారి ఎంతో సంతోషిస్తాడుగదా అని మురిసిపోయాడు శీనయ్య. మురిసిపోవటంమాట అటుంచి, శీనయ్యను పిలిచి నానాచివాట్లూ పెట్టాడు ఆ అధికారి. "ఏమయ్యా! నా పత్రిక సక్రమంగా నడపటం నీకిష్టంలేదా ఏమిటి. కొన్నికొన్ని విషయాలు మనం చూసీ చూడనట్లు పోవాలి. ప్రత్యేకంగా ఇటువంటి విషయాలు అసలు చూడనట్లే పోవాలి. తెలిసిందా... నీవు ఎవరిమీదనయితే ఇప్పుడు ఘాటుగా వ్రాశావో ఆ వ్యక్తి ఎవరో తెలునా. మినిష్టరుగారి పార్టీ మనిషి. అటువంటివాళ్ళజోలికి పోతే మనకే ప్రమాదం" అని నాలుగూ నులిపి పంపించివేశాడు. అప్పుడు శీనయ్య ఒకగుణపాఠం నేర్చుకున్నాడు. "ఉపన్యాసవేదికమీది మాటలకూ, క్రియారూపకంలో జరిగేపనులకూ చాలా తేడా వుండాలి" అని...

ఒకసారి శీనయ్య, పత్రిక తరఫున ఒక సినిమాకు సమీక్ష వ్రాయవలసివచ్చింది. ఆ సినిమా చూస్తున్నంతసేపూ శీనయ్యకు ఆవులింతలూ, నిద్రా ముంచుకువచ్చాయి. మొదటి సగంలో బొమ్మలు సరిగ్గా కనుపించలేదు. రెండోసగం బొమ్మలు కనిపించాయిగాని సినిమాకథ అర్థంకాలేదు. అక్కడక్కడా జల్తారుసినిమా కనిపించింది. అంటే బొమ్మలు నీళ్ళు కారిపోతున్నట్లు చారలు చారలుగా అన్నమాట... కథలో ఎవరు ఎందుకు వస్తారో అతనికి తెలియటంలేదు. కథానాయకుడూ, విలన్ పోట్లాడుతూ వుంటారు. కథానాయకుడు దర్భపోచల్లే ఒక్కగాన ఒక్కడు వుంటాడు. విలన్ తాబూతు పది

అయితే ఈ పత్రిక నీకెరృమా అని నాలుగురోజుల్లో దివాళా తీస్తుంది. ఈరోజుల్లో పత్రికనడుపుకురావడానికి మేమెంత అవస్థపడుతున్నామో నీకు తెలియదు. సినిమాలనుగురించి - ముఖ్యంగా ఈ కంపెనీవారు తీసిన సినిమాగురించి - ఇలా వ్రాస్తే వాళ్ళు మనకు ఒక్క ఎడ్వర్‌టయిజుమెంటు ఇవ్వరు. ఈ రోజుల్లో సినిమా ఎడ్వర్టయిజుమెంట్లు లేనిదే ఒక్కపత్రిక ముందుకురాదు. పత్రికలు పోషింపబడేదే సినిమా ఎడ్వర్టయిజుమెంట్లుమూలంగా. అందులో ఈ కంపెనీవారు మనకు నెలకు రెండు ఎడ్వర్టయిజుమెంట్లు యిస్తున్నారు, అంటే అయిదువందలు ఇస్తున్నారన్నమాట, వాళ్ళమీదే నీవ్వు నిందయాత్రచేస్తే వాళ్ళిక ఎడ్వర్టయిజు చేస్తారా. మన పత్రిక ముందుకుసాగుతుందా... ఇవన్నీ ఏవన్నా ఆలోచించావా... మా పత్రికపై దయయుంచి ఇకనుంచి నీవు సినిమాలకు సమీక్షమాత్రం వ్రాయకు" అని తలవాచేలాపెట్టాడు.

శీనయ్యకు మతిపోయింది. పత్రికా స్వాతంత్ర్యం అంటే అర్థం ఇదేకాబోలు అనుకున్నాడు. ప్రతివిషయంలోనూ ఇలా అసలును మభ్యపెట్టి ప్రజలను మోసగిస్తున్నాయీ పత్రికలు అనుకున్నాడు...

ఒకసారి ఇతను చేయనిపనికి ఇతను తిట్లుతిన్నాడు. ఒకసారి పత్రికపేజీ కట్టించడం ఇతనివంతు అయింది. అక్కడికీ శతవిధాల జాగ్రత్తగానే చూసుకున్నాడు. ఎలాపడిందో మరి "గోడకూలి స్త్రీ దుర్మరణం" అని పడటానికిబదులు "స్త్రీ కూలి గోడ దుర్మరణం" అని పడింది. అది కంపోజిటర్ చేసిన

తప్పు. తాను సరిగ్గా ప్రూఫ్‌లు దిద్దలేదని తనమీద ఆరోపణ నిజమే మరి...

ఇలా ఆఫీసులో తిట్లు తినితిని, పొద్దుపోయి యింటికి పోతే అక్కడ ఇంట్లో ఒకటుంటే ఒకటిలేక వాళ్ళసాధింపులు...

ఒకసారి సరిగ్గా ఇలాంటిదే జరిగింది. శీనయ్యా ఆఫీసుకు వెళ్ళబోతుంటే సుబ్బలక్ష్మి ఎదురువచ్చి "చంటివాడికి పాల డబ్బా అయిపోయింద"ని హెచ్చరిక చేసింది. అప్పటికి రెండు మూడురోజులునుంచి చెపుతున్నా అతను తీసుకురావటంలేదు కాబట్టి ఇవాళ హెచ్చరిక చేయవలసివచ్చింది. ఆ హెచ్చరికలోకూడా కొద్ది అధికారపూర్వకంగా చెపుతున్నధ్వని ఇమిడివుంది. శీనయ్యా నిజానికి ఈ విషయంలో అశ్రద్ధ చేయటం లేదు. కాళ్ళు అరిగేటట్లు షాపులచుట్టూ తిరుగుతూనే వున్నాడు. కాని డిక్కుమాలిన పాలడబ్బాలు బజారులో సక్రమంగా దొరికిచావవు. బ్లాకులో కొనాలి. బ్లాకులో అమ్మేందుకు దాచుకున్న కొట్టువాడు కంట్రోలుధరకుఇస్తాడా. "లేవు పొమ్మ"నేవాడు. అందుకుగాను ఆ షాపువాడిని మచ్చికచేసుకుని, వాడినీ వాడి పూర్వీకులను, వాళ్ళ అంద చందాలనూ, ధార్మికశక్తినీ పొగిడితే వాడిదయవుంటే అప్పటి కయినా బయటపెట్టేవాడు. లేకపోతేలేదు. ఒకకొట్టువాడిని నాలుగురోజులనుంచీ ఈవిధంగా కాకా పడుతుంటే వాడు కంట్రోలురేటుపైన రెండురూపాయలు అదనంగా తెమ్మని కనికరించాడు. శీనయ్యాదగ్గర కంట్రోలురేటుకు సరిపడడబ్బు కూడా లేదు. ఆ డబ్బు ఈ రోజు సాయంత్రం ఒకడిస్తానని ప్రామిస్ చేశాడు. ఒక పాలడబ్బా కావాలంటే ఇన్ని ఇబ్బంది

లున్నాయి. "ఈ సంగతి ఈ ఆడవాళ్ళకేం తెలుసు. హెచ్చరికలు చేయటం మాత్రం బాగా తెలుసు" అనుకున్నాడు శివయ్య. ఆరోజు సాయంత్రం సరిగ్గా యింటికి బయలుదేరబోతుండగా ఎవరో నాయకుడు అకస్మాత్తుగా చనిపోయినట్లు వార్తవచ్చింది. అంతవరకూ తయారయిన మేటరు ఆపుచేయించి, అప్పటికప్పుడు ఆ నాయకుడిమీద – ఆయనగారి జన్మస్థలందగ్గరనుంచి, వారి మరణసమయంవరకూ చేసిన అమూల్య ప్రజాసేవను కొనియాడుతూ వ్రాసి, కంపోజ్ చేయించి, అచ్చు అయినతర్వాత, సరిగ్గా ఉన్నట్లు చూసుకుని యింటికి బయలుదేరవలసివచ్చింది. అప్పటికి సరిగ్గా రాత్రి పదిన్నర అయింది. అప్పుడు డబ్బిస్తానన్న మిత్రుడిని కలుసుకొని వాడిదగ్గర అప్పుతీసుకుని, కొట్టువాడిని కలుసుకుని ఎవరూచూడకుండా రహస్యంగా డబ్బుతీసుకుని ఇంటికి వెళ్ళాలి. అది అప్పుడు సాధ్యపడేటట్లు కనుపించలేదు శివయ్యకు. అర్ధరాత్రివేళ అప్పుఅడిగితే వాడు ఇవ్వొచ్చు, ఇవ్వకపోవచ్చు. ఏ వేళ యిచ్చినా షావుకారు కొట్టుకట్టి వెళ్ళిపోయే ఉంటాడు. మామూలుగానే సరయినటయిముకు వెళ్తేనే యివ్వకుండా ఏడిపించేవాడు, వేళగానివేళ వెళ్తే కంట్రోలుసరుకు యిస్తాడా... ఇదంతా ఆలోచించి "రేపు చూసుకుందాంలే" అని యింటికి వెళ్ళాడు. ఇంటికి వెళ్ళేసరికి రాత్రి పదకొండయింది.

ఇక యింటిదగ్గరస్థితి పిల్లవాడు పాలకోసం ఏడ్చి ఏడ్చి అవాళ చేసిన హంగామా ఇంతా అంతా కాదు. దానితో సుబ్బలక్ష్మికి కోపం చెప్పలేనంతగావచ్చింది భర్తమీద.

'ఎప్పుడు వస్తావా ఎప్పుడు నాలుగూ కూలప్పుదామా' అని ఎదురుచూస్తున్న భర్త సరిగ్గా రాత్రి పదకొండు కొట్టిన తర్వాత ఇంటికివచ్చాడు.

"అయిందా ఊరమ్మట బలాదూరుతిరిగి రావటం. 'పిల్ల వాడికి పాలడబ్బా తీసుకురావాలి బొత్తిగా అయిపోయిందని' చెప్తే చేతులు జాడించుకుంటూ ఇప్పుడు వచ్చారా" అని ఛట్టున లేచింది. అసలే పనిచేసిచేసి ప్రొద్దుటినుంచీ అలిసిపోయి ఉన్నాడేమో "ఇంటికిరాగానే కాస్త సానుభూతిచూపటం లేకపోగా, ఏదో బాకీఉన్నవాడిని నిలదీయించినట్లూ, నౌకరు మీద అధికారం చెలాయించినట్లూ మాట్లాడుతున్న భార్యను చూసేటప్పటికి శీనయ్యకూ వళ్ళు మండిపోయింది.

"మొదలెట్టావు కొంపకురాగానే. రోజూ మామూలయిపోయింది ఇంటికిరాగానే అదిలేదూ, ఇదిలేదూ అని సతాయించడం. ఛీ. దరిద్రపుకొంప."

"అంత దరిద్రం అనుకున్నవాళ్ళు పెళ్ళెందుకు చేసుకున్నారూ."

"అదిగో ఎదురుగా ఉందిగా మా అమ్మ. దానినడుగు. ఎందుకుచేసిందో ... ఒద్దుబాబో పెళ్ళి అంటే గోతిలోపడి చస్తా, నూతిలోపడిచస్తా అని బెదిరించి ఈరోజున నాప్రాణం తీస్తోంది. దీనికేం పెళ్ళిచేసి తింగురంగా అని కూర్చుంది. మధ్య నాచావు నేచస్తున్నా."

"ఏం. ఏమొచ్చింది ఇప్పుడు అంపచావు చావటానికి."

"ఇంకా ఏం రావాలీ. పగలల్లా ఆఫీసులో చచ్చిచచ్చి

కొంపకుచేరుకుంటే, ఇంటికిరాగానే సానుభూతి చూపటం లేకపోగా——"

"ఆలికి అన్నంపెట్టటం ఊరికి ఉపకారమట. ఇంట్లో యింతచాకిరీచేస్తున్న నాకెవరు చూపెడుతున్నారు సానుభూతి——"

"ఒకళ్ళనునాల్సిన పనేముంది. నేనుపోయిన మర్నాడు గాని——"

"ఇప్పుడేమొచ్చింది నట్టింటకూర్చుని చావులూ బ్రతుకులూనూ".

శీనయ్య మాట్లాడేవాడుకాదు. ఒక క్షణం దాటిన తర్వాత సుబ్బలక్ష్మి అనేది "లేవండి అన్నం వడ్డించాను".

"అక్కర్లేదు. నీమాటలతోటే కడుపునిండింది".

"మీరు ఎవ్వాళ్ళనీ మాటలనక మహాగౌరవిస్తున్నారు కదూ...మీకు అంటే కోపమొస్తుందిగాని పాలులేక పిల్లాడు ఎంతసుక్కపట్టి ఏడ్చాడో మీకేంతెలుసు. మొహం ఎఱ్ఱగా కందగడ్డ చేసుకుని ఏడవలేక నిలువుగుడ్లుపడితే ఎంతకంగారు పడ్డాము...ఇల్లువదలి బయటికివెళ్తే మీరు ఇంటిగోడవే మరచిపోతారాయె".

"నేనేం ఇంటిగోడన మరచిపోలేదు. చేతిలో డబ్బు లేకనే అన్ని ఏడుపులూనూ. కంట్రోలురేటుకు దొరికిచచ్చే వస్తువు కాదాయె. బయట ఎన్ని అవస్థలు పడుతున్నానో ఇంట్లోకూర్చున్న మీకేం తెలుస్తాయి... డబ్బు తేలేదు అన్నది ఒక్కటే మీకు తెలుస్తుంది. అటు డబ్బుకోసమే ఏడవనా ఇటు——"

"ఈ సంగతులన్నీ ఎవరికి తెలుస్తాయి. ఇంటికిరావడమే ఘూం ఘాం అంటూవస్తే—"

"నీవా, నేనా? ఘూం ఘాం లాడేది".

"మీరే"

"సిగ్గులేకపోతేసరి".

"సిగ్గుంటే మిమ్మల్నెందుకు చేసుకోవడం".

"అదే నేనూ అనుకుంటున్నా. చేసుకోకపోతే బ్రతికన్నాపోదును".

"అబ్బో. ఇప్పుడు నన్ను చేసుకుని ఏంబాధలు పడి పోతున్నారు పాపం."

"ఇవన్నీ కష్టాలూ, బాధలూ కాక సుఖాలుకాబోలు".

"ఇంకావేం. నేనూ బాబిగాడూ మా పుట్టింటికి పోతాం. హాయిగా ఏ బాధలూ లేకుండా వుండండి".

"వాడుకూడా ఎందుకు. పోతే నీవేపో".

"ఆవు వెనక దూడ".

ఇంతలో అన్నమ్మగారు అందుకని "చాలుగాని నోరు మూసుకోండర్రా. ఎవరైనా వింటే నవ్విపోగలరు" అనేది. దానితో ఎక్కడ దొంగలు అక్కడే గప్‌చిప్ సంబారుబుడ్డి.

* * *

సుబ్బులమ్మకూ శీనయ్యకూ, ఒకళ్ళకొకళ్ళకు సరిపడని విషయాలు చాలావున్నాయి.

శీనయ్య తెల్లారిలేవడంతోటే కాఫీనీళ్ళు కావాలనే వాడు. అవి త్రాగి సిగరెట్టు గట్టిగా దట్టిస్తేగాని అతనికి లెట్రిన్‌కు వెళ్ళాల్సిన అవసరంరాదు. ఈమధ్యనే శీనయ్యకు ఈ

ఏక్కువమాలిన సిగరెట్టు ఒకటి అలవాటయింది. దానితరవాత [illegible]ంగుసెట్టు ముందువేసుకు కూర్చునేవాడు. దానితో సుబ్బులమ్మ వళ్ళు మండిపోయేది.

"ఏమిటి ఏక్కువమాలిన క్షవరం మీరూ. ఒక వేళా పాళా లేదు. పాచివాకిట్లో ముగ్గన్నా వేయలేదు. క్షవరం సెట్టు ముందేసుకు కూర్చున్నారు. మంగళవారం అనక, శుక్రవారం అనక ఇలా ప్రొద్దునే ఈ సెట్టు ముందేసుకు కూర్చోబట్టే దరిద్రం నాలుగుపాదాలా నడుస్తోంది మనయింట్లో" అనేది.

"అబ్బా. ఇది లేకపోతే లక్ష్మి నాలుగుపాదాలా నడుస్తుంది కాబోలు. మనగీతలో ఉంటే వస్తుంది లేకపోతే లేదు. అంతేగాని—"

"చాలు. మెట్టవేదాంతం. వేళకు భగవంతుడు రాసిపెట్టినంకే నోటికాడికి పంపిస్తాడుగాని, ముసుగెట్టుకు పడుకోండి"...

ఈవిధంగా సంభాషణ సాగేది మరొకప్పుడు.

"ఇవాళన్నా తలంటిపోసుకుంటారా. క్రిందటి దీపావళికి కాబోలు పోసుకున్నారు" అనేది సుబ్బులమ్మ.

"నీకు ఇంకోధ్యాస లేదా ఏమిటి, నాతలంటిమీదపడ్డావ్. వచ్చే దీపావళికి పోసుకుంటాలే" అనేవాడు శీనయ్య.

"అబ్బబ్బ ఇంత ఎడ్డెమనిష్యుల్ని మిమ్మల్నే చూశా" అనేది సుబ్బులమ్మ.

"అవును. ఎడ్డెతనంసంగతి నీవే చెప్పాలి. మాడిబట్ట [illegible]

టతో, నేను పుట్టినప్పటినుంచీ కడుతున్నావు ఆ పట్టుచీర. ఒక్కనాడన్నా రేపు వేశావా".

"రేపు కేస్తే మడికి పనికిరాదు".

"అవును నిజమే... పోనీగాని దానినిచింపి ఆవకాయ జాడీలకు వాసినమాత్రంకట్టకు. ఆవకాయ తరిస్తుంది.తద్వారా మేము తరిస్తాం".

"మీ చొక్కాలకంటె నాడెమే. ఒకొక్క చొక్క వారంరోజులు తొడగడానికి."

"అదిసరే చొక్క అంటే జ్ఞాపకంవచ్చింది. నిన్న తొడుక్కున్న చొక్క వంకెకు తగిలించా కనుపించదేం."

"నిన్న ఉతికి ఆరేశా".

"నా ప్రాణం తీశావు. ఉన్న ఇస్త్రీ చొక్క అది ఒక్కటేగదటే.దానితో ఈవారంవెళ్ళిపోతుంది అనుకున్నా".

"తెల్లగావుంటే సరిపోతుందా ఏమిటి. చెమటవాసన వేసుకుంటూ".

"నీవు ఉతికిన ఆ చొక్కా రేపు ఆఫీసుకు ఎట్లా వేసు కెళ్ళనే".

"ఏం. శుభ్రంగా వుంటుంది. అ కంపు చొక్కాకంటే నాణెమే".

"కంపోగింపో, నా ఇస్త్రీ చొక్కా కాస్తా తగల పెట్టావు. ఆ ఘనకార్యం చేసేముందు నాతో చెప్పి తగలపడ కూడదూ".

"ఏమో నాకు తెలియదు. ఎలాగూ నాచీర ఉతుక్కుం

టున్నాను కదా అని దానినికూడా ఉతికిపెట్టాను. సంతో పించక పైగా అట్లా కేకలేస్తారెందుకు".

"నీ చీరతో కలిపిఉతికావా?...నా ప్రాణంతీశావే... ఏదీ ఎక్కడ" అంటూ శీనయ్య ఒక్కపరుగులోపోయి ఆర వేసిన చొక్కా చూసుకున్నాడు. ఆ చీరకు వేడినీళ్ళలోపెడితే కొంచెం రంగువెలిసే గుణముంది. ఇంక చెప్పవలసిందేముంది, శీనయ్య చొక్కాసంగతి. సాయంకాలం నీరెండలో ఆకాశం మీద ఇంద్రధనుస్సు వెలిసినట్లూ, పంచరంగుల ముఖచిత్రం లాగా, చంటిపిల్లవాడువేసిన రంగులడ్రాయింగులాగా తయా రయింది.

"ఇదుగో ఇలారా. ఇదేనా నా చొక్క..."

"ఏం. దానికేమయింది. కొద్దిగా చీరరంగు అంటింది కాబోలు దానికింత రాద్ధాంతం చెయ్యాలా".

"పైగా ఇంకా నాది రాద్ధాంతమంటున్నావా. రేపు దీనిని ఆఫీసుకు తొడిక్కెళ్ళితే దారిలో కాకులూ గద్దలూ తన్నటమేకాకుండా ఆఫీసులోవాళ్ళు అంతా నా వెంటపడ తారు".

"ఎందుకు".

"మాచొక్కాలుకూడా మీ ఆవిడతో ఉతికించిపెట్ట మని. పోనీ ఆ చేత్తోనే కాస్త ఆ బనీనన్నా ఉతికావుకాదు".

"మీ బనీనా? ఏంబనీనండి అది. వళ్ళుమండి తగల పెడదామనుకుని ఎన్నిడజనుల అగ్గిపెట్టెలు తగలేసినా మండిచావ లేదు. చివరకు దీపంబుడ్లు, లాంతరు తుడుచుకోడానికి కిరస నాయిలు డబ్బామీద పడేశాను".

"కొంపతీశావు. అదొక్కటేనే నాకున్న బనీను."

"మరేం ఫర్వాలా. రేపు చందాలు ప్రోగుచేశి ఇంకొకటి కొనిపెడతా".

"సంతోషించాం తెలివితేటలకు".

"ఆ చొక్కా ఆరినట్లుంది. పోనీ ఇస్త్రీమడతలాగ మడత పెట్టి, పరుపుక్రిందపెట్టండి. రేపటికి చక్కగా అణుగుతుంది".

"ఇంకా నయం చెంబుఇస్త్రీ చేయమన్నావుగాదు".

ఒక్కొక్కరోజున సంభాషణ ఇలా జరిగేది.

సుబ్బులమ్మకు పూజా పునస్కారం అలవాటుంది. సరిగ్గా తొమ్మిదిగంటలకు తులిశమ్మముందు ముక్కుమూసుకు కూర్చునేది. ఆ పూజకు అంతువుండేదికాదు. అలా పూజ చేస్తూనేవుండేది. శీనయ్య ఆఫీసుకువెళ్ళాలి. పది అవుతున్న కొద్దీ అతనికి గుండె దడదడలాడుతూ వుండేది. ఈవిడగారు ఎంతసేపటికీ ముక్కువదిలేదికాదు.

"పోనీ మధ్యాహ్నం రెండుగంటలకువస్తా. అప్పటికయినా నీపూజ అయితే భోజనంచేసి వెళ్తా".

"ఎందుకండీ. అయిపోయిందిగా వచ్చేస్తున్నా. అదిగో చంటివాడు లేచినట్లున్నాడు. కాస్త ఎత్తుకోండి ఈలోపల" అనేది. దాంతో ఆఫీసుకు వెళ్ళాలనుకుంటున్న శీనయ్య చచ్చినట్లు పిల్లవాడిని ఆడించటానికి వెళ్ళేవాడు. వాడు ఎంతసేపటికీ ఏడుపు మానేవాడుకాదు.

"కాస్త ఎత్తుకోండీ. వచ్చేస్తున్నా".

"ఇప్పుడే పెట్లోబట్టలుతీసి వేసుకున్నానే... వాడిప్పుడే నిద్దరనుంచి లేచాడు. నా బట్టలు కాస్తా పాడుచేస్తాడు..."

ఓయి ఓయి ఓయి. ఊరుకోరా నాయనా ... ఎంతగొంతుక పెట్టాడురా భగవంతుడు నీకు... సినిమాలో ప్లేబాకులు పాడ తావ్రా పోనీ." అని జోలపాట పాడేవాడు.

"మీరు పాడకండీ నామాటవిని. వాడు జడుసు కుంటాడు" అనేది సుబ్బులమ్మ.

"ఏమీ జడుసుకోడు. ఇదేపాట రేడియోలో పాడితే నిమిషానికి రూపాయి ఇస్తారు".

"ఏమీ ఇవ్వరు... పైగా అద్దెసైకిళ్ళు వేసుకొచ్చి బాదుతారు".

"ఇంతకీ ఈసరసమేనా. అన్నంపెట్టేది ఉందా లేదా".

"వచ్చేస్తున్నాగా. మీదగ్గరఉన్నదదే. ఆసాంతం ఉండి చివరిలో తొందరపడతారు. క్షణంలో ఇద్దరికీ వడ్డించే స్తాను. కలిసి కూర్చుందాం".

"నీతో కూర్చుంటే అయినట్లే. ముద్ద ముప్ఫయిరెండు సార్లు నములుతూ".

"ఆరోగ్యసూత్రం ప్రకారం చాలా మంచిదది".

"నా జాతకసూత్రం ప్రకారం మంచిదికాదు".

ఇలా జరిగి అతను ఆఫీసుకు వెళ్ళేసరికి గంటన్నరలేటు కావడం, కడుపునిండా తిట్లుతినడం జరిగేది.

సినిమా చూడ్డానికని సుబ్బులమ్మకు మహాయిదిగా వుండేది. కాని ఆవిడకు ఈ పోకిరీ సినిమాలంటే నచ్చవు. పుణ్యం పురుషార్థం ఉండేసినిమాలకు వెళ్ళాలనేది. శీనయ్యకు తెలుగుసినిమాలంటేనే నచ్చవు. ఒకసారి ఒకసినిమాచూస్తే నాల్గుగేళ్ళవరకూ మళ్ళీ సినిమా చూడక్కర్లేదంటాడు.

"పేర్లుమార్పుగాని, అదే నటీనటులూ, అదేకథ. మళ్ళీ డబ్బులు దండగచేసుకుని చూడటం ఎందుకు" అంటాడు. అదీ కాక సుబ్బులుతో సినిమాకు వెళ్ళాలంటే అతనికి భయం... ఎందుకంటే ఆ సినిమాలో ఎక్కడన్నా దేముడు ప్రత్యక్ష మయినట్లుగానీ, వెంకటేశ్వరస్వామి వేషంగానీ, రాములవారి వేషంగానీ కనుపిస్తే కటిక్కున లేచి నిలబడి కళ్ళుమూసుకుని దండంపెట్టి లెంపలేసుకుంటుంది. ఆ చుట్టుపక్కల కూర్చున్న వాళ్ళు గొల్లుమని నవ్వడం. శీనయ్య ముఖంమాడిపోవడం ఒక్కసారి జరిగేవి... ఒకసారి హరిశ్చంద్ర సినిమాకు వెళ్ళాడు... అక్కడికీ శీనయ్య సుబ్బులుతో అనేకవిధాల నచ్చచెప్పి, సిని మాలో జాగ్రత్తగా ప్రవర్తిస్తానని మాటతీసుకుని ఆమెను సినిమాకు తీసుకెళ్ళాడు...

హరిశ్చంద్రుడు చంద్రమతిని అమ్మివేశాడు. లోహి తాస్యుడు చంద్రమతీ ఒకపక్కన నిలబడిఉన్నారు హరిశ్చం ద్రుడు మరోపక్క విచారంగా నిలబడివున్నాడు. చంద్రమతి, భర్తను వదలివెళ్ళలేక వెక్కి వెక్కి ఏడవటం సాగించింది. ఆ ఏడుపుతోపాటు జనానికి ఆడియన్సుమధ్యనుంచి మరో ఏడుపు బిగ్గరగా వినిపించటం మొదలుపెట్టింది. జనమంతా తెల్లపోయి శీనయ్య ఉన్నవైపుగా చూశారు. శీనయ్యకుకూడా మతిపోయి ప్రక్కకు తిరిగిచూశాడు... సుబ్బులమ్మ ... మనలోకంలో లేదు. వెక్కి వెక్కి అదేపనిగా ఏడుస్తోంది.

"ఏమిటే ఇది. తేలుగీలూ ఏమన్నా కుట్టిందా. కడుపు నొప్పిగావుందా. ఎందుకు ఏడుస్తావు" అని అడిగాడు శీనయ్య.

"పాపం! ఆ ఇల్లాలుకు చూడండి ఎన్ని కష్టాలో"

అన్నది సుబ్బులు. విషయం అర్థచేసుకున్న శీనయ్యకు నవ్వాలో, ఏడవాలో తెలియలేదు. "నీ పిండాకూడు. నా పసుపుతీయడానికి తయారవుతావు. ఇందుకే నిన్ను వెంట పెట్టుకువెళ్ళాలంటే నాకు భయం...డబ్బులుపోతే పోయాయి గాని, సినిమావద్దు, నా పిండాకూడువద్దు ఇంటికిపోదాం పద" అని సుబ్బులమ్మను రిక్షామీద కూర్చోపెట్టుకుని జాగ్రత్తగా ఇంటికి తీసుకొచ్చాడు. మధ్యలో ఫిట్టువచ్చి బిగుసుకుపోనం దుకు సంతోషించాడు శీనయ్య... "సుబ్బులమ్మ ... పాపం జాలిగుండెకలది" అనుకున్నారు అంతా...

ఈ విషయాలమాట అలావుంచి ఈ మధ్య అన్నమ్మ గారిస్థితి ఏమీ బాగుండటంలేదు. పెద్దదయిపోయింది. కళ్ళు సరిగ్గా కనిపించవు చెవులుకూడా సరిగ్గా వినిపించటంలేదు. మనుమడిని దగ్గరకు తీసుకుని కూర్చోటంతప్ప ఇంక ఏపనీ చేయలేకపోతోంది. ఇంటెడుచాకిరీ సుబ్బులే చేసుకుపోతోంది. అన్నమ్మగారు ఇంకొక శుభవార్తకూడా విన్నది. మనుమడికి చెల్లెలో, తమ్ముడో పుట్టబోతున్నారని... ఉద్యోగంలో ఇంక్రి మెంట్సు లేకపోయినా సంసారంలో ఇంక్రిమెంట్సు చూసి శీనయ్య మరికొంచెం విచారపడ్డాడు... చాలీచాలనిజీతం. ఏదో లాక్కువస్తున్నాడు సంసారం. సుబ్బులుకు బలం తక్కువన్నారు డాక్టర్లు. ఎక్కువపనిచేస్తే చలీ, ఆయాసం. మందులు ఎన్నని కొంటాడు. కొనడానికి డబ్బేదీ? ఇది ఇలావుండగా అన్నమ్మ గారి పరిస్థితి ఏమీ బాగుండటంలేదు. ఏది తిన్నా ఇముడటం లేదు. వంట్లో నెత్తురులేక కాళ్ళూ చేతులూ కొద్దిగా నీరు చూపి ఉబ్బటం సాగించాయి... మందులు వాడాలి...

తరువాత ఎలాగోలా తీర్చవచ్చని కనబడ్డవాడిదగ్గరల్లా అప్పుచేసి. తల్లికి, మందులు తెస్తున్నాడు. కాని ఆ మందు లేవీ ఆవిడకు పట్టేస్తున్నట్లు కనపడటంలేదు. పెద్దడాక్టరును తెచ్చే తాహతులేదు. చిన్నడాక్టర్లనే కాళ్ళా గడ్డం పట్టుకు తీసుకొచ్చి చూపెడుతున్నాడు. పోనీ రెండురోజులపాటు తల్లిదగ్గర కూర్చుని ఆమెకు మనసుతీర సేవచేద్దామంటే ఆఫీసులో శలవు దొరకటంలేదు. అక్కడికీ, రాత్రుళ్ళు చాలాసేపు తల్లిదగ్గర కూర్చుని కావలసిన ఉపచారమంతా చేస్తున్నాడు. సుబ్బలక్ష్మికూడా అత్తగారిని తన స్వంతతల్లిగా చూసుకుంటోంది.

డాక్టర్లు శీనయ్యకు సలహా యిచ్చారు "ఆవిడకు ఇక మందులు పట్టేవ్వాపు పెద్దదయిపోయింది. ఆవిడకు ఏదికావాలంటే అదిచేస్తూ ఆవిడమనస్సుకు సంతోషం చేకూర్చడమే చేయవలసినపని" అని దానితో శీనయ్య బావురుమన్నాడు. అతనికి, తండ్రి ఎలాఉంటాడో తెలియదు. తనకు బుద్ధి తెలిసినప్పటినుంచీ తల్లిగానూ, తండ్రిగానూ అన్నమ్మగారు చేసిన సంరక్షణ, చూపినప్రేమా, వాత్సల్యం అన్నీ అతనికి గుర్తు వస్తున్నాయి. అతనికి తోబుట్టువులు లేరు. చెప్పుకోతగ్గ దగ్గర బంధువులు లేరు. స్నేహితులు లేరు. హితాభిలాషులు లేరు. అన్నీ అతనికి అన్నమ్మగారే. తల్లిగాపెంచింది. తండ్రిగా పోషించింది. తోబుట్టువుగా ఆదరించింది. స్నేహితుడుగా సలహాలిచ్చింది. కష్టాల్లో సుఖాల్లో ఆదుకుని ఇంతవాడిని అంతవాడినిగా చేసింది. తాను పస్తులుపడుకుని శీనయ్యను చదివించింది... అతనిలోని అణువు అణువు ఆమెపోషణలో పైకివచ్చినవే... అటువంటి తల్లి తననుంచి తప్పుకుని వెళ్ళి

పోతోంది. ఇక తనకు కనిపించదు. శీనయ్య అన్నం తినడు. ఆఫీసుకు తప్పనిసరి కాబట్టి ఏదో వెళ్ళాలనిపించి వెళ్ళి తిరిగి రాగానే తల్లి మంచందగ్గరే తిష్టవేసుక్కూర్చుంటున్నాడు. భార్యతో సరిగా మాట్లాడడు. కొడుకుని దగ్గరకు తీసుకోడు. తల్లి దూరమయిపోతోందే అనే బెంగ ... ఆవేదన...భయం... దుఃఖం... సుబ్బులు అనేకసార్లు ధైర్యంచెప్పి చూసింది కాని లాభంలేకపోయింది.

ఆనాడు భీష్మయేకాదశి. అన్నమ్మగారికి మాట ఎప్పుడో పడిపోయింది. రెండురోజులనుంచీ చూపూకూడా లేదు... ధారకం బొత్తిగా పోవటంలేదు. ఉద్యోగంపోయినా సరేనని ఆఫీసుకు యింటిదగ్గరనుంచే శలవు-చీటీ వ్రాసి పంపించాడు. కామేశ్వరరావుగారు ఆఫీసరుకు తాను నచ్చచెప్పుతాననీ, అవసరమయితే తనకు వెంటనే కబురుపంపమనీ చెప్పి ఆఫీసుకువెళ్ళాడు...

సరిగ్గా రాత్రి ఎనిమిదిగంటలయింది. అన్నమ్మగారు కొద్దిగా కళ్ళు తెరిచింది.ఏకాదశి మధ్యాహ్నమే ప్రవేశించింది. కళ్ళు తెరిచిన తల్లినిచూడగానే శీనయ్యకు ఎక్కడలేని సంతోషం వచ్చింది. ఇక తన తల్లికి ఫరవాలేదనుకున్నాడు. గండం గడిచిందని మురిసిపోయాడు. కళ్ళు తెరిచిన అన్నమ్మగారు కొడుకు చేతిని తనచేతిలోకి తీసుకుని దేనికోరకో అటూ యిటూ చూడటం మొదలుపెట్టింది.

"ఏం కావాలమ్మా. ఎలావుంది వంట్లో" అన్నాడు శీనయ్య గద్గదిక స్వరంతో. అది ఏడుపో నవ్వో ఎవరికీ అర్థం కాలేదు.

అన్నమ్మగారు జవాబు చెప్పలేదు. దిక్కులుమాత్రం చూస్తోంది. సుబ్బులుకోసం ఒక్క కేక పెట్టాడు. సుబ్బులు పరు గెట్టుకొచ్చింది మంచందగ్గరికి, ఏం కొంపమునిగిందోనని. అన్నమ్మగారి కంటివెంట నీళ్ళు కారుతున్నాయి. కళ్ళుమాత్రం దేనికోసమో వెతుకుతూనేవున్నాయి.

"మనుమడికోసమేమోనత్తా" అన్నారు ఎవరో...

శీనయ్య ఒక్కఅంగలో పరుగెత్తికెళ్ళి నిద్దరపోతున్న కొడుకును ఎత్తుకొచ్చాడు. అన్నమ్మగారి ముఖం వేయి పద్మాలు విచ్చుకున్నట్లు విచ్చుకుంది. నాయనమ్మనుచూసి వాడు చిరునవ్వు నవ్వాడు. వాడిచేయి తనచేతిలోకి తీసు కున్న అన్నమ్మగారుకూడా నవ్వినట్లనిపించింది. అంతే... మనుమడిచేతిలో నాయనమ్మ చెయిమాత్రం మిగిలింది... నాయనమ్మ ఇకలేదు...శీనయ్యా, సుబ్బులూ ఒక్కసారి బావురుమన్నారు. ఇంటిమీద గుడ్లగూబ కేరుకేరున అరుచు కుంటూ లేచిపోయింది. దూరంగానక్క కూతలు విని పిస్తున్నాయి.

* * *

అన్నమ్మగారు పోయినతర్వాత శీనయ్యలోనూ శీనయ్యజీవితంలోనూ చాలామార్పులు వచ్చాయి. ఇప్పుడు శీనయ్య ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడడు. ఎప్పుడూ ఏదో ఆలోచన... తాను ఇక ఎక్కువకాలం జీవించలేనం టాడు... ఏదో చెప్పలేని నిరాశ, నిస్పృహ అతనిలో ప్రవేశిం చాయి... ఈ వైరాగ్యంచూసి సుబ్బులమ్మ హడలిపోతోంది. వీలుదొరికినప్పుడల్లా భర్తకు అనేకవిధాల ధైర్యంచెపుతోంది.

ఆఫీసుకు సరిగ్గా వెళ్ళనందున చేస్తున్న ఉద్యోగం కాస్తా పోయింది. కామేశ్వరరావుగారుకూడా అనేకవిధాల నచ్చ చెప్పి చూచారు. కాని లాభంలేకపోయింది. ప్రొద్దుననగా స్నానంచేసి బట్టలువేసుకుని వీధిమీదపడతాడు. ఎక్కడెక్కడ తిరుగుతాడో, ఎందుకు తిరుగుతాడో తెలియదు. సరిగ్గా పన్నెండూ, వంటిగంటకల్లా వచ్చి నాలుగుమెతుకులు నోట్లో వేసుకుని గదిలోకిపోయి తలుపు బిగించుకు కూర్చుంటాడు. సుబ్బలక్ష్మి పిలిచినా తలుపు తీసేవాడుకాదు. సాయంత్రం లేచి, మళ్ళీ వీధిలోకి పోయేవాడు.

సుబ్బలక్ష్మి హడలిపోతోంది, భర్తకు పిచ్చిగాని ఎక్కి పోతుందేమోనని. ఇంటిలో బొత్తిగా జరుగుబాటు తక్కువగా ఉంది. తనవంట్లోనూ ఏమీబాగుండటం లేదు. భర్త చూడ బోతే ఆవిధం. తల్లికీ తండ్రికి చాటుకుండా ఉత్తరం వ్రాయించింది. ఒక శుభముహూర్తాన వాళ్ళూ వచ్చారు. కాని అల్లుడు పరిస్థితి వాళ్ళకూ అర్థంకాక అనేకవిధాల చెప్పి చూశారు. డాక్టర్లను పిలిపించి చూశారు, కాని అతనిలో జబ్బు ఏమీలేదంటారు ... ఒక్కమేలు ఏమిటయ్యా అంటే శీనయ్య మామగారు రావటంవల్ల సంసారం ఇబ్బందులు పడకుండా ఒకమాదిరిగా సాగిపోతోంది..."ఇలా ఎంతకాలం సాగుతుంది...ఎన్నాళ్ళని ఒక సంసారం మరోసంసారాన్ని ఆదుకోగలుగుతుంది. ఆయనకు నిజంగా ఏ పిచ్చయినా ఎక్కితే ఇక తనగతి ఏమిటి" ఇవే ఆలోచనలు సుబ్బలక్ష్మికి అహర్నిశలూ...

ఇలా వుండగా ఒకరోజు మధ్యాహ్నం ఒంటిగంట

ఘుమారున భోజనానికి వస్తున్న శీనయ్య మరొకరిని కూడా వెంటపెట్టుకు వచ్చాడు. ఆ వచ్చినాయన బాగా డబ్బుగల వాడుగా ఉన్నాడు. ఆయనకు బహు అందమైన చిన్నకారు కూడావుంది. ఇద్దరూ కలిసి ఆ కారులో వచ్చారు... సుబ్బ లక్ష్మికి మొదటిలో ఏమీఅర్థంకాలేదు, ఈయనెవరో. ఎందు కొచ్చారో... శీనయ్య ఆరోజు కొంచెం హుషారుగా కనిపిస్తు న్నాడు. "ఒరేయ్. ఇదేరా నాభార్య. పేరు సుబ్బలక్ష్మి. వీడు మాపెద్దవాడు. రెండోది కొడుకో, కూతురో ఇంక రెండునెల లకుగాని బయటపడదనుకో... హై డిహై నీ కుటుంబమంతా క్షేమమేనా" అని, భార్యను అతనికి పరిచయంచేసి అతని యోగక్షేమాలు అడిగాడు. ఇన్నాళ్ళకు భర్తముఖంలో కొత్తవెలుగుచూసి సుబ్బలక్ష్మి లోలోపల ఎంతో సంతో షించింది. "ఈయన ఎవరో తన పాలిట దేముడిలాగ వచ్చాడు. ఈయన ఇలాగే కొన్నాళ్ళపాటు ఇక్కడుంటే తన భర్త మామూలుమనిషి అవవచ్చు. కాని అది సాధ్యపడే విషయమేనా. ఆయన తన పనులన్నీ వదులుకుని ఇక్కడెందు కుంటాడు. అయినా ఆయన తాహతు ఎంత. మన తాహతు ఎంత" అని సుబ్బలక్ష్మి లోలోపల అనుకుంటూవుండగా శీనయ్యే తన భార్యతో అన్నాడు.

"ఓయ్. వీడెవడో తెలునా. పెద్దఆఫీసరనుకుంటున్నా వేమో. వీడూ నేనూకలిసి చదువుకున్నాం... అల్లరిచేశాం... నాటకాలేశాం... ఒకటేమిటి మా చదువుకునేరోజుల్లో ఏ ఏ అల్లరులుచేసినా కలిసే చేశాం. తెలుసా... వాడికి బాగా డబ్బుంది కాబట్టి వాడు తప్పాడు. నాకు డబ్బులేదు కాబట్టి

నేను వ్యాసయ్యాను. తప్పితేమటుకేం వాడు లక్ష్మీపుత్రుడు. వ్యాసయి నేను వరగపెట్టినదేమిటి" అని మామూలు పూర్వపు ధోరణిలో చెప్పుకుపోతున్నాడు. ఆనాటి తన భర్త ప్రతి మాటా ఆవిడ చెవులకు ఒక్కొక్క అమృతబిందువులాగ వినిపిస్తోంది.

"ఒరేయి ఆరోజు నాటకం నీకు బాగా గుర్తుందా. ఆ ఎటక్ ప్రక్కచేసేటప్పుడు పడ్డ చప్పట్లు".

"నీకింకా గుర్తున్నాయిటరా... అది సరేగాని ఇప్పుడు నువ్వు ఏంచేస్తున్నట్లు" అని మిత్రుడయిన కుమార్ శీనయ్యను అడిగాడు. ఏమయితే అయిందని సుబ్బలక్ష్మి మధ్యలో అందుకుంది.

"ఈమధ్య మా అత్తగారు పోయినప్పటినుంచీ ఏపనీ చెయ్యటంలేదన్నగారూ. ఇవాళ మీరు వచ్చారుకనుక అంత ఉత్సాహంగా కనుపిస్తున్నారుగాని లేకపోతే ఈమధ్య బొత్తిగా మనగోడవ పట్టకుండా ఉంటున్నారు" అని అంది.

సమయంకనిపెట్టి పరంధామయ్యగారు కుమార్‌తో అన్నివిషయాలూ వివరించి చెప్పాడు.

భోజనాలయిపోయాయి... కుమార్ వెళ్ళిపోతానన్నా భోజనంచేసి వెళ్ళవలసింగా అందరూ పట్టుపట్టటంవల్ల అతను ఆగిపోయాడు. తరువాత కుమార్ కూడా శీనయ్యకు తను చేయగలిగిన సాయంచేసి ఆ సంసారాన్ని పైకి తీసుకురావా లనే సంకల్పంకలిగి రెండువిధాల కలిసివస్తుందని, మాట్లాడటం కోసం ఆగిపోయాడు.

"అమ్మా, చెల్లాయి. వీడు ఇక్కడుంటే ఎలాగూ పిచ్చి

నాపత్రతాలనుగాని నాతో మద్రాసు పంపించివేయి. నాకు పెద్దసినిమాకంపెనీవుంది. వాడి వాడి పెద్దనటుడు. ఇన్నాళ్ళూ చీకటిలోవుండిపోయాడు. వాడి అదృష్టం ఎలావుందో నాతో తీసుకుపోతాను. కొన్నాళ్ళయినతర్వాత మీరూ అక్కడికి వచ్చేద్దురుగాని. ఏమిటి మీ అభిప్రాయం" అని అడిగాడు సుబ్బలక్ష్మిని కుమార్. ఎలాగోలాగ అతను మామూలు ప్రపంచంలోపడితే బాగుండుననుకున్న సుబ్బలక్ష్మి అందుకు వెంటనే వప్పుకుంది. శీనయ్యకూడా వప్పుకున్నాడు. వెంటనే కుమార్ తన పర్సులోనుంచి రెండువందలుతీసి సుబ్బలక్ష్మి కిచ్చి శీనయ్యను తనతో ప్రయాణంచేసి తీసుకు వెళ్ళాడు.

ఎలాగూ పురుడుపోయటానికి తనవూరు తీసుకువెళ్ళా లనుకున్న పరంధామయ్యగారు సుబ్బలక్ష్మి ఒక్కతే ఇక్కడ ఉండటం మంచిదికాదని అల్లుడి అనుజ్ఞతీసుకుని కూతురుతో సహా తనవూరికి ప్రయాణమయ్యాడు.

ఈ మబ్బులు ఇంతత్వరలో విడిపోతాయని సుబ్బ లక్ష్మి కలలోకూడా అనుకోలేదు. "ఎలా వచ్చినమబ్బులు అలాగే విడిపోయాయి. అంతా భగవానునిలీల" అన్నాడు పరంధామయ్యగారు ప్రయాణసన్నాహాలుచేస్తూ...

మద్రాసులో కృష్ణకుమార్ ఇల్లు చాలా అందంగా, అధునాతనపద్ధతుల్లో కట్టబడింది. కృష్ణకుమార్ మద్రాసు సినిమాలోకంలో పేరుపడ్డ నిర్మాత... కొన్నిటికి స్వంతదర్శ కత్వంకూడా. మద్రాసు ఫిలింఫీల్డులో కృష్ణకుమార్ పేరు తెలియనివాళ్ళు లేరు. కాలేజీలో చదువుకునేరోజుల్లో అతని పేరు కృష్ణమూర్తి. కృష్ణమూర్తే కృష్ణకుమార్ గా అవతరిం

చాడనీ, అతనికి సినిమాప్రపంచంలో అంత పేరుప్రతిష్ఠలున్నాయనీ శీనయ్యాకు తెలియదు. కాలేజీరోజుల్లో మాత్రం శీనయ్యే కృష్ణమూర్తి, కృష్ణమూర్తే శీనయ్యాగా ఉంటూ ఉండేవారు. ఆర్థికంగాకూడా కృష్ణమూర్తి అనేకసార్లు శీనయ్యాను ఆదుకున్నాడు.

కృష్ణమూర్తి చదువులో కొంచెం తరుగు. తల్లితండ్రుల పోరుపడలేక చదువుమాని ఎవరితో చెప్పకుండా మద్రాసు పారిపోవడం, అక్కడ ఫిలింఫీల్డులో డక్కా-మొక్కలకు అలవాటుపడటం జరిగింది. అతనికి మొదటినుంచీ చదువుమీద కన్న ఈ నాటకాలూ, సినిమాలమీదే ఎక్కువ అభిరుచిగా ఉండేది. ఆ అభిరుచితోనే అతను మద్రాసు పారిపోయిందికూడా. కొన్నాళ్ళవరకూ కృష్ణమూర్తి, కృష్ణకుమార్‌గా మద్రాసులో చలామణీ అవుతున్నసంగతి, అతని స్వంత తల్లితండ్రులకే తెలియదు. మొత్తంమీద కృష్ణకుమార్ మద్రాసులో రికామీగా తిరగకుండా సినిమారంగంలో మంచి అనుభవమే సంపాదించాడు. ఈ సంగతి తెలిసిన అతని తల్లితండ్రులు చేసేదిలేక ఆ రంగంలోనే అతనికి ప్రోత్సాహమిచ్చారు. వాళ్ళు బాగా డబ్బున్నవాళ్ళు. ఒక్కగానొక్క కొడుకు. అతనిని అసంతృప్తిపరచటం వాళ్ళకిష్టంలేదు. ఒకవేళ దానిలో వారికి నష్టంవచ్చినా అది వారికి అంత పెద్ద చెప్పుకోదగ్గ విషయంకాదు. అయినా కృష్ణకుమార్ హస్తవాసిమంచిది. అతనిబొమ్మలు మార్కెట్‌లో బాగానే పోతున్నాయి. రెట్టింపుకు రెట్టింపు సొమ్ముచేసుకుంటున్నాయి. మద్రాసులోనే అందమైన స్వంతఇల్లు ఏర్పాటుచేసుకున్నాడు.

ఆ కృష్ణకుమార్ యింటిలో అందమైన ఒకగది ప్రత్యేకం శీనయ్యకు ఏర్పాటుచేయబడమయింది. మద్రాసు వెళ్ళ గానే శీనయ్యకు అందమైనబట్టలు ఆధునికపద్ధతిలో కుట్టించేశారు. భోజనం, కాఫీ, ఫలహారం సమస్తం కుమార్ కంటి లోనే అతనితోపాటు, అతనికారులో అన్నిస్థలాలకూ తిరుగుతూవుండటం శీనయ్యపని. శీనయ్యశకం మారింది. ఇప్పటి శీనయ్యకూ నెలరోజులక్రితం శీనయ్యకూ సంబంధంలేదు. ఒక్కొక్కప్పుడు అద్దంలో చూసుకొని తనకుతానే గుర్తుపట్టలేకపోతున్నాడు. వేషమోసిన నటీనటులందరికీ పరిచయం చేయబడ్డాడు. అందరికీ బాగా పరిచయస్థుడయ్యాడుకూడా.

ఇలా బాగానే సాగిపోతోంది. భార్యదగ్గరనుంచి కులాసాగా ఉన్నట్లు ఉత్తరాలు వస్తూనే వున్నాయి...

"ఒరేయి కృష్ణా. నాకు ఒక్కవిషయం చెప్పు. ఈ అడ్డగాడిదను ఇలా ఎందుకు మేపుతున్నావో కాస్త వివరించి చెప్పు".

"మూటలు మోయించడానికి".

"విడిచినవా, ఉతికినవా ఆ మూటలు".

"అప్పటికి సిద్ధంగానే ఉండాలిమరి. అయినా అది మోయించేవాడిపైన ఆధారపడి ఉంటుంది".

"అలాగా చాకలీ".

"అవునురా అడ్డగాడిదా".

ఇద్దరూ పకపకానవ్వుకున్నారు. కొన్నాళ్ళు గడిచిపోయాయి. ఒకనాడు మామగారిదగ్గరనుంచి ఉత్తరం

వచ్చింది. సంబ్బులు ప్రసవమయ్యేనట్లూ కూతురు పుట్టి నట్లూనూ... ఆ పత్రం ముందు కృష్ణకుమార్‌కు అందెంద.

"ఒరేయి గాడిదా...నాకు కోడలు పుట్టిందట... ఉత్తరమొచ్చింది మా చెల్లెలుదగ్గరనుంచి...ఏమిటిరా అల్లా కొట్టావు ముఖం ఉత్తఇస్పేటుజాకీలాగ".

"ఏంచేయమంటావు. నేనేమో నీధర్మమా అని ఇంటి మనసుమువు అల్లుడులాగ ఇక్కడ మేస్తూ కూర్చున్నా—"

"శహబాస్. గాడిదచెయ్యవలసిందే చేస్తున్నావ్. తర్వాత—"

"మరి అక్కడవాళ్ళు ఏమేమి ఇబ్బందులు పడుతు న్నారో ఏమో".

"ఓరి దామోదరచక్రవర్తీ. మరేంభర్వాలేదు. నేనం ఆమాత్రం తెలియని శుంఠనుగాను. మొన్ననే మళ్ళీ రెండు వందలు పంపించా ఇదిగో ముట్టినట్లు రశీదుకూడా".

"ఒరేయి ఒరేయి. నన్ను చాలాఋణానపడేస్తున్నావు. ఈ ఋణం ఎలా తీర్చుకోగలనురా. ఎందుకురా నామీద నీకింతదయ".

"ఏంభయపడకురా... దీనికంతా చాలాఉంది. చెప్తాగా. నా ఋణాన నీవుపడవు. నీ ఋణానే నేనుపడతా నేమో".

"ఏడిశావు వెధవమాటలూ నువ్వూనూ".

"పదపద స్టూడియోకుపోదాం. ఈ సరికే వచ్చేస్తానని చెప్పాను" అని యిద్దరూ డ్రెస్సుచేసుకుని స్టూడియోకి వెళ్ళారు.

"ఒకేయ్ శీనప్పా. మనకాలేజీలో ఆనాడు యాక్ట చేశావే, అది ఒక్కసారి యాక్టుచేసి చూపించాలిరా. చూడా లనిఉంది. చాలారోజులయిందిగా. నామాటచెల్లించవూ" అని అడిగాడు కుమార్ బుంగమూతిపెట్టి శీనయ్యగడ్డం పట్టుకుని.

"అటులనే ప్రియతమా" అని పకపక నవ్వుతూ శీనయ్య అక్కడేఉన్న ఒక స్టేజిమీదికి వెళ్ళబోయాడు.

"అదికాదోయ్ శీనప్పా. ఇది నాటకం అనుకున్నావా. ఉండుచెప్తా. ఇదిగో ఇది ఇల్లుసెట్టింగు. ఈపరిస్థితిలో నీవు యాక్టుచేయాలి తెలిసిందా" అని శీనయ్యను ఒకస్టూడియో సెట్టింగుమీదవదలి, లైటింగుఎఫెక్ట్సు అన్నీ యిచ్చి కెమేరా స్విచ్ ఆన్‌చేయమన్నాడు.

శీనయ్య మూడ్‌లోకివెళ్ళాడు. అయిదునిమిషాలు సీను యాక్టుచేసి చూపించాడు. అక్కడున్నవారంతా శీనయ్య నటన చూసి ఆశ్చర్యపోయారు. "కుమార్‌గారూ, ఇంత మంచి నటుడ్ని మీదగ్గరపెట్టుకుని దేశమంతా గాలిస్తు—"

"ఇస్సా. అరవకండి. మావాడు సిగ్గుపడి మెలికలు తిరిగిపోగలడు" అని వాళ్ళను వారించాడు కుమార్.

అసలువిషయమేమిటంటే కృష్ణకుమార్ కొత్తగా ఒక పిక్చరుతీయబోతున్నాడు. దానిలో, ఒక క్లిష్టమైనపాత్రకు నటుడు కావాలి. ఆ పాత్రనుగురించి ఆలోచించినా, ఆ పాత్ర ధారినిగురించి ఆలోచించినా అతనికి తన కాలేజీజీవితంలో అలాంటిపాత్ర నిర్వహించిన శీనయ్యే కళ్ళకు ఎదురుగా కనిపి స్తున్నాడు. దీనికి శీనయ్యనే ఎందుకు తీసుకురాగూడదూ అని

అతనికితోచి అతనికోసం బయలుదేరి తిరిగి తిరిగి అతనిని పట్టుకున్నాడు.

శీనయ్యా ఏ పెద్దఉద్యోగంలో ఉన్నాడో, అతను సినిమాలో నటించడానికి ఇష్టపడతాడో, ఇష్టపడడో అని ఊహించుకునే కృష్ణకుమార్‌కు, శీనయ్యా అప్పటిస్థితి బాగా అనుకూలించి వెంటనే వాళ్ళకు కొంత రొక్కమిచ్చి, శీనయ్యాను మద్రాసుకు తీసుకువచ్చాడు. ఇప్పుడు ఈ స్థితిలో మిత్రుడికి సాయపడగలిగానుకదా అని అతనికి ఒకవిధంగా తృప్తిగాకూడావుంది. ఈ పాత్ర నటించగల పాత్రధారికి ఎంత అడిగితే అంతా యిచ్చి బుక్ చేయాలనుకున్నాడు. అది శీనయ్యే అయినందువల్ల మరింత సంతోషంతో వాళ్ళకు డబ్బుపంపుతూ తృప్తిపొందుతున్నాడు. ఇంకొకనటుడైనా అతనికి అడ్వాన్సుగా యింతడబ్బు యిచ్చితీరాలి...

శీనయ్యా మొదటిలో కంగారుపడకుండా కొన్నాళ్ళ పాటు తనతో తిప్పుకుని, నటీనటుల్ని, సినిమా వాతావరణాన్ని అతనికి అలవాటయేలా చేశాడు. మొదటిసారిగా సినిమాతీస్తున్నానని చెపితే అతను కంగారుపడవచ్చు. సినిమా టెస్టుకట్ తీస్తే అతను తెరపై ఎలాఉంటాడోకూడా చూసుకోవచ్చు. అందుకని, సరదాగా ఏక్టుచేసి చూపెట్టమని చెపుతూ టెస్టుకట్ తీసి చూసుకున్నాడు అక్కడున్నది తన మిత్రుడే కదా అని. ఎంతో ఫ్రీగా ఏక్టుచేసిన శీనయ్యానటన ఎంతో బాగుంది. కుమార్ ఆనందానికి అంతులేదు. తన ప్రయత్నం ఫలించింది. తనకోరిక సిద్ధించింది. అక్షరాలా తాను అనుకున్న నటుడు ఆ పాత్రకు దొరికాడు. అంతేకాకుండా అతడు తన

కత్యంత ఆప్తుడు. కష్టకాలంలో తన మిత్రుడివి తానే అయ్యే గలిగాడు, అవసరమైన సమయంలో ఆ మిత్రుడు తనకు సాయ పడ్డాడు. కేమేరామాన్ ఓ. కే. అన్నాడు. సౌండు ఇంజనీరు ఓ. కే. అన్నాడు. తాను ఓ. కే. అనుకున్నాడు. ఈ విష యం చెప్పగానే శీనయ్యకూడా డబల్ ఓ. కే. అన్నాడు. ఇక యిచ్చిపుచ్చుకోవడాల ప్రసక్తిలేదు. అద్భుతమైన నూతన నటు డ్ని తానుగా వెండితెరకు పరిచయం చేయబోతున్నందుకు, ఆ కీర్తి తనకే దక్కబోతున్నందుకూ కృష్ణకుమార్ అమితా నందపడ్డాడు. తనకష్టాలు గట్టెక్కబోతున్నందుకూ, ఇక తన జీవితానికి ఒక నూతనమార్గం దొరికినందుకూ శీనయ్య మురిసి పోయాడు.

"ఒరేయ్ శీనప్పా. ముందు ఈ వెయ్యిరూపాయలూ నీదగ్గర ఉంచుకో... అలా అని నిన్ను హోటలుకు గెంటు తున్నాననుకోకు. నీవు మేయవలసింది ఇక్కడే. నిన్ను కట్టేయ వలసిందికూడా ఆ గదిలోనే... తెలిసిందా. ఇందులో నా స్వార్థంకూడా లేకపోలేదు. ఈ గాడిదను మరొకళ్ళు తన్నుకు పోకుండా చూచుకోవాలి" అన్నాడు కుమార్ ఒకరోజున.

"ఒరేయ్ అంత కృతఘ్నుడ్ని కాదులేరా, ఇంకో కళ్ళు తన్నుకుపోతే పోయేందుకు. నాకు వెయ్యీవద్దు, రెండు వేలూవద్దుగాని నీచెల్లెలికి కావలసినప్పుడు కొద్దో గొప్పో పంపు. అంతవరకూచాలు" అన్నాడు శీనయ్య.

ఆ మరునాడే ఆ వెయ్యిరూపాయలూ శ్రీనివాసరావు పేరిట బ్యాంకులో వేశాడు కృష్ణకుమార్ ...

తరువాత కొద్దిరోజులకే కృష్ణకుమార్ పిక్చరు సెట్సు

మీటకు వెళ్ళింది. కృష్ణకుమారి, ఒక కొత్తనటుడిని వెండి
తెరకు పరిచయం చేయబోతున్నాడన్న సంగతి మద్రాసులో
అన్ని స్టూడియోలకూ పాకింది. అంతేకాదు అతను అద్భుత
మైన నటుడన్న వార్తకూడా పాకిపోయింది.

అప్పటిపరిస్థితి ఎలావుందీ అంటే మద్రాసు ఫిలింఫీల్డు
ఏ కొద్దిమందిమీదో ఆధారపడివుంది. కొత్తనటులు వస్తు
న్నారో అసలు రావటంలేదో తెలియదుగాని పాతమొహా
లతో మొహంమొత్తిపోయారు. అదీకాక ఆవున్న ఇద్దరు
ముగ్గురూ అనేకసినిమాలతో ఇరుక్కుపోయి కొత్తవారితో
సహకరించడానికి వీలులేకుండావుంది. పేరుమోసిన ఆ నటీ
నటులు కొత్తవారికి ఏ రెండుమూడు నెలలకో ఒకసారి డేటు
యిచ్చేవరకూ ఆ నిర్మాతలు నోట్లో వేళ్ళుపెట్టుకు కూర్చో
వలసిందే. ఆ రోజుకు ఆ హీరోకో, హీరోయినుకో తలనొప్పి
వస్తే మళ్ళీ కొన్నాళ్ళవరకూ వాళ్ళకు డేటు దొరికేదికాదు.
బోలెడంతడబ్బు ఖర్చుచేసుకుని వృధాగా కూర్చోవలసి
వస్తోంది. పాతనటుల దయాధర్మాలపై ఆధారపడివుంది
ఫీల్డంతా. వాళ్ళను బ్లాకులో కొనుక్కోవాలి, వాళ్ళ సెక్రట
రీలను ఆకట్టుకోవాలి. ఆ హీరోకు అనుకూలురను మిగతా
పాత్రలకు, నిర్మాతలకు యిష్టమున్నా లేకపోయినా బుక్ చేసు
కోవాలి. ఈ ఎగస్ట్రానటులకుకూడా యివ్వవలసిన కిరాయి
పెద్దనటులే నిర్ణయిస్తారు. దీనితో నూతననిర్మాతలు నానా
అవస్థలూ పడిపోతున్నారు. తనవూళ్లో బియ్యానికి బ్లాకు
మార్కెట్టు, కిరసనాయిలుకు బ్లాకుమార్కెట్టు చూశాడుగాని
శీనయ్య, ఇక్కడ నటులకు బ్లాకుమార్కెట్టు చూస్తున్నాడు.

అంటే ఆ నటికిగానీ, నటుడుకిగానీ కాంట్రాక్టులో వ్రాసిన పది వేలో, ఇరవై వేలో కాక, చాటుగా ఏభయివేలో, వందవేలో సమర్పించాలి. ఆ పదివేలూ తెల్లడబ్బు. ఈ వందవేలూ నల్లడబ్బు... కొంతమంది మధ్యలో ఆగిపోయిన నిర్మాతలు వేగంగావచ్చే రైళ్ళకోసం పరుగెత్తుతున్నారు, సునాయాసంగా దానిక్రింద తలపెట్టడానికి. నిర్మాతలస్థితి ఇలావుంది.

ఎక్కడో గౌరవకుటుంబంలో పుట్టి సినిమాల్లో నటించాలనే గ్లామర్‌తో, డబ్బు సంపాదించవచ్చుననే దురాశతో ఎంతోమందియువకులు మద్రాసు పారిపోయి వస్తున్నారు. ములగచెట్టుకు గొంగళిపురుగుల్లా వాళ్ళంతా స్టూడియోలచుట్టూ అతుక్కుని తిండిలేక ఎండిపోయి, నానా అగచాట్లూ పడుతున్నారు. ఇదే వ్యామోహంతో పరువుగల కుటుంబంలోని యువతులు, ఏ కుఱ్ఱవాడితోనో కలిసి మద్రాసుకు చేరుకుని, తర్వాత ఆ పురుషపుంగవుడు మళ్ళీ కనుపించక, అటు మళ్ళీ యింటికివెళ్ళడానికి మొఖంచెల్లక, తమ బ్రతుకులను తివాసీలుగా పరచటమో, సముద్రంపాలుకానడమో జరుగుతోంది. ఇలా అనేకరకాలుగా నాశనమయిన వారినీ, అదృష్టం కలిసివస్తే తారాపథంలోకి పోయినవారినీ, బికారులనూ, లక్షాధికారులనూ, ఇంకా మాట్లాడితే కోటీశ్వరులనూ, అందరినీ చూస్తూ వచ్చాడు శీనయ్య.

ఇంతకూ చెప్పొచ్చింది కొత్తముఖాలకోసం అలమటిస్తున్న నూతన నిర్మాతలు శీనయ్యనటన చూడటంకోసం, శీనయ్యను చూడటంకోసం మూగటం ప్రారంభించారు. అందులో కొంతమంది కృష్ణకుమార్ ద్వారా శీనయ్యను

ఆకట్టుకోవడానికికూడా ప్రయత్నిస్తున్నారు. ఈ సినిమా ప్రపంచమంతా శీనయ్యకు ఒక పెద్దలాటరీలాగ కనుపించడం మొదలుపెట్టింది. ఇది ఒకరకమైన సర్కసు, ఒకరకమైన మాయ, ఒకరకమైన వ్యాపారం, ఒకరకమైన ఇంద్రజాలం.

ఎందుకూపనికిరాడనుకున్న వ్యక్తి ఈ రంగంలో బాగా రాణిస్తున్నాడు: నయాపైసా విలువచేయనివాడు లక్షాధికారి అవుతున్నాడు. ఇవాలిటి లక్షాధికారి మరునాడు బజారులో కాఫీడబ్బులకోసం కక్కుర్తిపడుతున్నాడు. తాను తీసినబొమ్మ అదృష్టవశాత్తూ బాగాపోతే కుబేరుడవుతున్నాడు. దురదృష్టముండి మరునాటికే డబ్బాలు తిరిగివస్తే భికారి అవుతున్నాడు. తాను నటించిన మొదటిచిత్రం శతదినోత్సవాల లిస్టులోవుంటే ఆ నటుడు తారాపథంలోకి వెళ్తున్నాడు. తిరిగివచ్చే డబ్బాలలిస్టులోఉంటే ఎగ్స్ట్రాలలో ఒక ఎగ్స్ట్రాగా పొట్టపోసుకుంటున్నాడు. అంతా అదృష్టం! అంతా దురదృష్టం!!

ఇదంతా చూస్తున్న శీనయ్య ఒక్కసారి బరువుగా నిట్టూర్చి పరిశ్రమలో పాతుకుపోయి, పేరుప్రఖ్యాతులు గడించిన కృష్ణకుమార్ లాంటివ్యక్తి తనకు అండగా దొరకటం తన పూర్వజన్మసుకృతం అనుకున్నాడు. ఫీల్డులో ఒకేఒక విషయముంది. అదృష్టమున్నా పైకిరావాలి. లేకపోతే పైకి తోయగల నిర్మాత, దర్శకులలాంటివారి అండన్నా దొరకాలి. ఇందులో రెండవది - అంటే నిర్మాత అండదొరకటం - శీనయ్యకు దొరికింది. ఇక అదృష్టదేవత ఏచూపు చూస్తుందో

మరి. ఇంతవరకూ చల్లటిచూపే చూస్తున్నట్లు అనుకో వాలి మరి.

నాటకాలవిషయం వచ్చినప్పుడు తనవూరి కురుక్షేత్ర నాటకం జ్ఞాపకంవచ్చి శీనయ్య ఎంతనవ్వుకునేవాడో ఇటీవల ఒక సినిమాలో ఒకవిషయం జ్ఞాపకంవచ్చినప్పుడల్లా శీనయ్య అదేపనిగా నవ్వుకునేవాడు.

సినిమాషూటింగు చూడటం మొదట్లో శీనయ్యకు సరదాగావున్నా, రానురాను అది మరీ జోక్ క్రింద కనిపిస్తూ వచ్చాడు సినిమా చూసేటప్పుడు కన్నుమూసి కన్ను తెరిచే టప్పటికి జరిగిపోయేభాగం, సినిమా షూటింగుసమయంలో ఒకటి రెండురోజులు తీసుకుంటుంది. లైట్లువేయడం, తీయడం, కెమేరా మార్చుకోవడం, నటీనటుల రీహార్సలు, వాళ్ళు సరిగ్గా పలకలేకపోతేనో, ఉచ్చరించలేకపోతేనో, మళ్ళీ మళ్ళీ చేయించడం, ఇవన్నీ చాలా విసుగ్గా ఉంటాయి.

ఒక స్టూడియోలో ఒకసీను షూటింగు జరుగుతోంది. అది జానపదచిత్రం. దాని ప్రొడక్షను మేనేజరుపేరు అప్పల రాజు. జరుగుతున్న సీను ఏమిటయ్యా అంటే పెద్దరాణీగారు తులశమ్మదగ్గర పూజచేసుకుంటూ వుంటుంది. ఆ రాణీగారికి నాలుగుపక్కలా నలుగురుదాసీలు విసురుతూ నిలబడివుంటారు. ఇంతలో ఒకదాసీ పరుగెత్తుకొచ్చి అమ్మా, అమ్మా, యువ రాజాగారు వస్తున్నారని చెప్పాలి. యువరాజావారు శత్రు రాజులతో యుద్ధంచేసి విజయోత్సాహంతో వస్తున్నారన్న మాట. ఈ విజయం సిద్ధించి యువరాజు రావడానికి అంతకు

ముందు రాణీవారు అనేకనోములు నోచారు, పూజలుచేశారు అని మనం అనుకోవాలి... అదీ పూర్వపుకథ.

ఇక ఆరోజు షూటింగు తులశమ్మచెట్టు, ప్రక్కన పెద్ద రాణీ, చుట్టూ నలుగురు పరిచారికలూ - రాణీగారిచేతిలో వెలుగుతున్న హారతి కర్పూరపుపళ్ళెం... పూలూ, పళ్ళూ పసుపు కుంకుమ, ఇంకా బోలెడు కొబ్బరికాయ వగైరా వగైరా.

రెడీ అన్ లైట్సు అన్నాడు డైరక్టరు. దీపాలన్నీ వెలిగాయి. కెమేరామాన్ వచ్చి మీటరువేసి చూసుకున్నాడు. క్లాపుబోయి క్లాపుకొట్టాడు. కెమేరా క్లిక్ మంది... దాసీ పరుగెత్తుకొచ్చి "అమ్మా అమ్మా యువరాజావారు వస్తున్నారు" అని చెప్పింది.

"వచ్చాడా, నాతండ్రి వచ్చాడా, నానోములఫలం ఈనాటికి ఫలించిందా" అని అంటూ హారతికర్పూరం పళ్ళెం గిరగిర చక్రంతిప్పినట్లు తిప్పింది రాణీగారు. డైరక్టరు హడిలిపోయి "కట్" అన్నాడు. లైట్లన్నీ మళ్ళీ ఆర్పించి (కరెంటు ఖర్చు పండగ) పెద్దరాణీగారిదగ్గరకువెళ్ళి "ఏమమ్మోయ్, నీవెప్పుడూ పూజచేసుకోలేదూ, ఆ స్టైలేమిటి అంటూ నెంపాదిగా దేముడికి పూజచేస్తున్నట్లు పళ్ళెం చూపెట్టు, అంతేగాని అలా చక్రంతిప్పినట్లు గిరగిర తిప్పుతావేం" అని చెప్పి మళ్ళీ "ఆన్ లైట్సు" అనుకుంటూ వెళ్ళాడు. ఈలోపల పళ్ళెంలో హారతి కర్పూరం మండిపోయింది. మళ్ళీ ఇంత హారతికర్పూరం అందులోవేసి మళ్ళీ షూటింగు ప్రారంభించారు. ఈసారి ఆ మహారాణి పాత్రధారికి నోరువిప్పి మాట్లాడితే చెయ్యితిరగటం లేదు. చెయ్యితిరిగితే నోటమాటరావటంలేదు. ముందు

డైలాగు అని, తర్వాత గిరగిర పళ్ళెంతిప్పేసింది... డైరక్టరు గొల్లున గోలపెడుతూ తాపాయంపెట్టానికి లేచాడు. రెండూ ఒకేసారి జరగాలని. ఆవిడ హడలిపోతూ ఈసారి సరిగ్గా చేస్తానంది. కాని ఏంలాభం. తెచ్చిన హారతికర్పూరం అయిపోయింది. డైరక్టరు ఒక్క గావుకేక పెట్టాడు ప్రొడక్షను మేనేజరుకోసం. "అప్పలరాజూ-హారతికర్పూరం" అంటూ. దగ్గరలో షాపులులేవు. అందుకని అప్పలరాజు కారువేసుకొని నాలుగుమైళ్ళదూరంలోవున్న షాపుకువెళ్ళి హారతికర్పూరం తెచ్చాడు. గంటన్నరతర్వాత షూటింగు మళ్ళీ ప్రారంభం. మహారాణీ తప్పులుచేయడం మానలేదు. కాని అప్పలరాజు మాత్రం జాగ్రత్తగానేవుండి, "కట్" అన్నప్పుడల్లా ముందు ఎగిరిగంతేసి హారతికర్పూరం ఆర్పివేయడం మొదలుపెట్టాడు. ఎందుకంటే అదికాస్తా మళ్ళీ తగలపడితే తాను కారువేసుకు మళ్ళీపరుగెత్తాలి. షూటింగు ఆగిపోతుంది. అందుకని అప్పలరాజు హారతికర్పూరంకోసం జాగ్రత్తపడటం మొదలుపెట్టాడు. ఎలాగయితేనేం ఆ కాస్త సీను షూటుచేసేటప్పటికి రాత్రి పది అయింది. ఆ డైరక్టరు ఓపికకు మెచ్చుకున్నాడు శీనయ్య... ఆ తర్వాత అప్పలరాజు ఎక్కడ కనుపించినా శీనయ్యకు హారతికర్పూరం జ్ఞాపకంవచ్చేది. దాంతో అప్పలరాజుకూ హారతికర్పూరానికి అవినాభావసంబంధం ఏర్పడింది.

అటువంటి తప్పులేమీ చేయకుండా శీనయ్య జాగ్రత్తపడుతూ మంచిపేరు సంపాదించుకుంటున్నాడు. శీనయ్యపేరు స్టూడియోలలో మారుమ్రోగిపోవటం మొదలుపెట్టింది. కృష్ణ

కుమార్ తనకునచ్చిన మంచికంపెనీలతో శీనయ్యకు కాంట్రాక్టు ప్రాయించాడు. ఇప్పుడు శీనయ్య మామూలు శీనయ్యగారు, శ్రీనివాసరావు అంతకంటెకాదు. మిష్టర్ రావు. వెంటనే భార్యా పిల్లలను రమ్మని టెలిగ్రామ్ ఇచ్చాడు మిష్టర్ రావు.

మిష్టర్ రావు మద్రాసు మహానగరంలో ఉజ్వలంగా ప్రకాశిస్తున్న ఒక తార అయికూర్చున్నాడు. ఎక్కడ పల్లెటూరి శీనయ్య. ఎక్కడ మద్రాసు మహానగరంలో మహోజ్వలతార ... కాలచక్రం తిరుగుతూవుంటుంది. చీకటి కొన్నాళ్ళు. వెలుతురు కొన్నాళ్ళు. జీవితగమనంలో కష్టకాలం అనుకున్కోపోయి సుఖమైనరోజులు పైకిరావచ్చు. సుఖమైనరోజులు ముందుగడిచి ఆ సాంతంలో కష్టకాలం పైకిరావచ్చు. పరంధామయ్య చెప్పినట్లు అంతా భగవత్ లీల.

శీనయ్యజీవితంలో ఎదుర్కొన్న సమశ్యలూ, సంఘటనలూ మనమందరంకూడా ఎప్పుడో ఒకప్పుడు ఎదుర్కొన్నవే. మనమధ్య అనేకమంది శీనయ్యలున్నారు. అనేకమంది సుబ్బులమ్మలూ ఉన్నారు. అంతేకాదు మనసంసారాల్లో శీనయ్య సంసారం ఇమిడేవుంది.

ఇంతకూ చెప్పవచ్చింది శీనయ్యకు ఎంతఅదృష్టం తన్నుకువచ్చినా, శేషవర్జ్యంలాగ, వాన వెలిసినతర్వాత చూరునీళ్ళలాగ, కొద్దిగా కష్టాలులేకపోలేదు. అంతపెద్ద అదృష్టజాతకుడికి ఇంకా ఏం కష్టాలబ్బా అని మీకు ఆశ్చర్యం గలగొచ్చు. వచ్చినచిక్కల్లా అక్కడేవుంది... శీనయ్య-తప్పు తప్పు - శ్రీనివాసరావు... అదీకాదండీ... మిష్టర్ రావు సినీ

ఆర్టిస్టుగారు భార్యాపిల్లలను రమ్మనమని టెలిగ్రామిచ్చాడు కదూ... అదే చేసిన పెద్దతప్పు. తనకుటుంబాన్ని తెచ్చుకోవడం తప్పెలాఅవుతుందీ అని మీకు అనుమానం కలగొచ్చు... సావకాశంగా వినండి... కబురంపగానే బాబూ, సుబ్బులక్ష్మీ, సుబ్బులమ్మతోపాటు కడుపులోఉన్న పాప (కొడుకో కూతురో తెలియదుగామరి) వస్తారని అనుకున్నాడుగాని అత్తగారూ, మామగారూ, మరదళ్ళూ, బావమరుదులూ, పక్షేశ్వరరావు, ఆండాళ్ళమ్మత్తయ్యా, [illegible] (ఆండాళ్ళత్తయ్యపిల్లలు) అంతాకలిసి ఒక వానరసమూహంలా దిగుమతి అవుతారనుకోలేదు. అసలే తానుఉంటున్నది కృష్ణ కుమార్ ఇంటిలో ... కుటుంబం వచ్చేటప్పటికి వేరేఇల్లు చూసుకుంటానంటే కృష్ణకుమార్ శీనయ్యను తంతానన్నాడు... పిచ్చిబాగులవాడు— తెలియదు పాపం కృష్ణకుమారుకి... ఏదో మిత్రుడికుటుంబం చిన్నదేకదా, తన బంగళాలోనే ఒకభాగంలో ఉంటారు, వేరే మళ్ళీ ప్రత్యేకంగా ఇల్లెందుకూ అని భావించాడు. కాని "సిరికిం జెప్పడు" అన్నట్లు మొత్తం బంగళాకు సరిపడ దిగుమతి అవుతారని అతనికేం తెలుసు. స్నేహితుడిని, ఆరోజున ఇల్లు వెతుక్కుంటానన్నా అంటే తంతానన్నాడుగానీ, రెండురోజులుపోతే వీళ్ళ నిజస్వరూపాలు బయటపడినరోజున నిజంగా ఇల్లు వెతుక్కునేదాకా తంతాడేమోనని శ్రీనివాసరావు లోలోపల బిక్కుబిక్కుమన్నాడు.

ఆరోజు శుభముహూర్తాన శ్రీనివాసరావు, కృష్ణ కుమార్ స్టూడియోనుంచి వచ్చేసరికి చిన్నకొల్లాయికట్టుకుని మడిబట్ట గాలిలోఊపుతూ ఆరేసుకుంటున్న పరంధామయ్యా,

బంతిపువ్వురంగు ప్యాంటులో నెట్ బనీను వేసుకుని బీడీకాలుస్తూ పచార్లుచేస్తున్న పిలకాక్రాపింగు పక్కీరేశ్వరరావు, ఇంటిచుట్టూ మడీబట్టలు ఆరేసిన శీనయ్య అత్తగారూ, గోలీలాడుకుంటున్న బావమరుదులూ, లాన్‌లో వున్న పూలూ, మొగ్గలూ, తుంచి పోస్తున్న పిల్లమరదళ్ళూ అంతా కనుపించారు. శీనయ్యకు ఈ దృశ్యం చూచేసరికి పూర్తిగా మతిపోయింది. ఆంధ్ర ప్రాంతంలో — అనగా తన అత్తగారి ఊళ్ళకేసి — ఏమైనా ధాతనామసంవత్సర కరువులాటిది రాలేదుకదా, ఈ క్షామ బాధితులు తన ప్రాణాలకు ఎన్నాళ్ళుంటారిక్కడ" అని ఏడుపులాటి నవ్వుముఖంతో ఆలోచించుకుంటున్నాడు.

"ఎవట్రా వీళ్ళంతా ... పొరపాటున ఏదైనా కాందిసీకుల కుటుంబాలను తెలియక గవర్నమెంటువారు నాయిల్లు విడిదికి ఇవ్వలేదుకదా" తెల్లబోతూఅన్నాడు కృష్ణకుమార్ ...

"భయపడకు ... వీళ్ళంతా నాతాలూకు పటాలమేలే..." అని పైకి అన్న శీనయ్య లోలోపల సుబ్బలక్ష్మికి సహస్రనామజపం చేయటం మొదలుపెట్టాడు.

"హాహోయ్ అల్లుడూ... అమ్మాయి కొత్తకాపురం — అందులోనూ పట్నంలో — ఏమేమి ఇబ్బందిపడుతుందోనని నేనూ మీ అత్తగారూ కలిసివచ్చాం. ఈ కుట్టవెధవలు ఊరుకుంటేనా, తీరా బయలుదేరేసరికి ప్రాణాలుతీయటం మొదలుపెడితే, పోనీలే, పట్నంచూస్తారని బయలుదేరతీసి తీసుకొచ్చా" అని విడమరిచి చెప్పాడు పరంధామయ్య తనకాపట్టణం కొట్టినపిండన్నట్లుగా. శీనయ్య నోటివెంట "అలాగా" అన్న మూడక్షరాలు అప్రయత్నంగా వెలువడ్డాయి...

"ఏం శ్రీనివాసరావూ ... పట్నవాసం ఎలాగుంది? మేము జ్ఞాపకం ఉన్నామా ... సినిమాస్టుడియోలు చూపి స్తావేమో అని నేనూ, మాఫ్యామిలీ అంతా కూడా ఏకంగా బయలుదేరి పిల్లలతోసహా వచ్చేశాము" అన్నాడు వెంకటేశ్వరరావు బీడీపొగ వదులుతూ...

"ఏడవలేకపోయారు" అని బలవంతంగామీసం లోలో పలే అనుకున్నాడు శ్రీనివాసరావు. ఇంతలో శీనయ్య చిట్టి మరదలూ "ఒస్సే అక్కయ్యా, ఈ బొమ్మచూడు ఎంత బాగుందో. దీనితో బొమ్మలపెళ్ళిళ్ళు చేసుకుందాం" అను కుంటూ కృష్ణకుమార్ డ్రాయింగురూంలోనుంచి టేబుల్ మీద పెట్టుకున్న ప్లాష్టర్ ఆఫ్ పారిస్ బొమ్మ లాక్కువచ్చింది. ఆ బొమ్మను ఎక్కడినుంచో ఎంతోకష్టపడి ఎంతోఖర్చుపెట్టి తెప్పించుకున్నాడు కృష్ణకుమార్ ... ఆ బొమ్మకు ఈగతి పట్టింది. ఒక్కఅంగలో శీనయ్య ఆ చిట్టిమరదలిమీదపడి బొమ్మను లాక్కుని అది ఇంకా పగలగొట్టనందుకు ఎంతో సంతోషపడ్డాడు... ఒక్కమాటలో చెప్పాలంటే ఆ దృశ్యం ఎలాఉందంటే... నేవళంగావచ్చే, ఆకుమడిమీద గొడ్లమంద పడి మేస్తున్నట్లనిపించింది. శీనయ్యకు మతిపోయింది. ఏదో "సుబ్బలక్ష్మివస్తుంది, సరదాగాఉందాం" అనుకున్నాడుగాని అది ఇలా పరిణమిస్తుందనుకోలేదు. ఈ దృశ్యంచూసి మిత్రుడు ఏం అనుకుంటున్నాడోనని బాధపడుతున్నాడు శీనయ్య. వీళ్ళు వచ్చినందుకంటే కృష్ణకుమార్ లోలోపల ఏమనుకుంటున్నాడో అనే బాధే అతనికి ఎక్కువయింది...

'సరాసరి లోపలికి వెళ్ళేసరికి మరిద్దరు మరదళ్ళు పేము

కుర్చీలు బోర్లపక్కలుగా ఆ పాలరాతి గచ్చుమీదపడేసి, లాగుతూ, రైలాట ఆడుకుంటున్నారు. సుబ్బులు తాను తెచ్చిన వడియాలూ, అప్పడాలూ, ఊరుమెరపకాయలూ డబ్బాల్లో సర్దుతోంది. ఏదో పనిఉండటంవల్ల తాను స్వయంగా రైలుదగ్గరకు సుబ్బలక్ష్మిని రిసీవు చేసుకునేందుకు వెళ్ళలేకపోయాడు. అదీకాకుండా వాళ్ళు వస్తానన్న రైలుకు గాక ఇంకో బండికి వచ్చారు... అందుచేత సీనయ్య స్టేషనుకు వెళ్ళడం పడలేదు. నిజంగా వెళ్ళిఉంటే ఆ స్టేషనులో అమాంతం మూర్ఛపోవడం, స్టేషనుమాష్టరూ, గార్డూ వగైరావచ్చి యింజనులో చల్లటినీళ్ళు తన ముఖంమీద జల్లటంవరకూ జరిగేది. వెళ్ళకపోవడమే మెరుగయింది.

"ఏం. మీరంతావస్తుంటే మీ మేనత్తగారిపిల్లలూ, మీ బాబాయిగారి పిల్లలూ వస్తాననలేదూ" సుబ్బులమ్మను పలకరించాడు శీనయ్య.

"వాళ్ళు రేపుదసరాకు వస్తానన్నారు" సుబ్బులమ్మ బోలెడు ఇదయిపోతూ సమాధానం చెప్పింది. ఆ చెప్పటంలో తనయింటికి ఎంతమంది వచ్చినా ఫర్వాలేదనీ, తనభర్త రెండుచేతులా సంపాదిస్తున్న సంపాదన స్వయంగా తన పుట్టింటివైపు నలుగురికీ చూపెట్టవచ్చుననీ ఆవిడ ఉబలాటం.

"రైలుపొగ పడలేదుకాబోలు, మా అమ్మకు రాత్రి నుంచీ ఎట్లాగో ఉంటోంది. ఇక్కడ ఎవరయినా డాక్టర్లున్నారా" సుబ్బులమ్మ అడిగింది.

"ప్రారంభమా" అని లోలోపల అనుకుని శీనయ్య

"ఈ ఊళ్ళో డాక్టర్లు ఎవరూ ఇంకా ప్రాక్టీసుపెట్టలేదు" అని ప్రకటించాడు...

నాలుగయిదురోజులు గడిచాయి ... పేళ్ళంతా శీనయ్యకు ఒక పెద్ద ప్రాబ్లెము అయికూర్చున్నారు. తనకోసం పెద్ద పెద్ద ప్లీడర్లూ, డైరెక్టర్లూ, డబ్బుబాగాఉన్న స్నేహితులూ వస్తూండేవారు. చిన్నకారులు అనేకం వస్తుండేవి... వాళ్ళు వచ్చేసరికి మండువాలో చిరిచాపలుపరుచుకునో, చిన్నగా మంచాలుకట్టుకునో పెద్దవాళ్ళూ, మట్టలాగూలతో చొక్కాలన్నా లేకుండా మడ్డివెధవల్లాగ గోలీలు, సిగరెట్టుముక్కల బెచ్చాలు ఆడుకుంటూ మరదళ్ళూ బావమరదులూ కనిపిస్తుంటే అతనికి తలతీసినట్లనిపించేది. ఒకరోజున ఒక చిన్న గొడవ జరిగింది. శ్రీనివాసరావును కొత్తపిక్చరులో బుక్ చేయడానికి ఒక పెద్దడైరక్టరు వచ్చికూర్చున్నాడు. ఆయనతో మాట్లాడుతున్నాడు శ్రీనివాసరావు. ఆ డైరక్టరు చేతిలోని సిగరెట్‌ప్యాకెట్టులో ఒకేఒక సిగరెట్ ఉంది. బావమరదులు ముగ్గురు, పకీరయ్యపిల్లలు ఇద్దరూవచ్చి ఆ సిగరెట్ డొక్కువైపే చూస్తూ గోతికాడనక్కల్లాగ నిలబడ్డారు. ఒక క్షణం అయినతర్వాత ఆ డైరక్టరు ఆ ఒక్కసిగరెట్టూ తీసుకుని డొక్కు దూరంగా విసిరేశాడు. ఈ అయిదుగురుపిల్లలూ అమాంతం దానిమీదపడి "నాదంటే నాది" అని తన్నుకోవడం మొదలుపెట్టారు. శీనయ్యకు అసహ్యమేసింది. వాకిట్లోకి పెద్దమనుష్యులు వచ్చినప్పుడన్నా పిల్లల్ని అదలించరు పెద్దవాళ్ళు. తనకు ఏమీసంబంధంలేనట్లు వదిలేసి ఊరుకుంటారు. వెంటనేలేచి వాళ్ళను నాలుగు అంటించి లోపలికి పొమ్మ

న్నాడు. ఆ రాత్రి పకీరయ్యా పెళ్ళాం అండాళ్ళుకు కోపం వచ్చి - తనకొడుకుని కొట్టినందుకు భోజనం మానేసిందిట.

కాని ఆరాత్రే శీనయ్య సుబ్బులుమీద విరుచుకు పడ్డాడు వీళ్ళందరినీ తోలుకొచ్చినందుకు...

"ఏంచేయమంటారు. నేను రమ్మన్నానా. వాళ్ళంతట వాళ్ళే మీరేదో పెద్దపదవిలో ఉన్నారుకదా, పట్నం, స్టుడి యోలు చూస్తామని వచ్చారు" అని బుంగమూతిపెట్టుకుంది.

"ఎప్పుడు వెళ్తారు వీళ్ళు".

"ఏమో. నాకేంతెల్సు ... మీకు కష్టంగాఉంటే మీరేచెప్పండి వెళ్ళమని ... వాళ్ళకేం గతిలేకరాలేదు. ఇన్నాళ్ళనుంచి వచ్చి మీయిళ్ళమీద కూర్చున్నారా. ఏదో చుట్టంచూపుగా ఒక్కసారివస్తే అంతబెంగపడిపోతున్నా రేమిటి".

ఇక శీనయ్య ఏమీమాట్లాడలేదు. "తనను అంత వరకూ అర్థంచేసుకున్నందుకు" విచారిస్తూ వెళ్ళిపోయాడు.

శీనయ్యకు ఇంటికి రావడమంటే నరకంలో అడుగు పెడ్తున్నట్లుంది. రాత్రింబవళ్ళు షూటింగులో అవస్థపడి, కాస్త నిద్దరబోవచ్చుకదా అని యింటికివస్తే ఇంటిదగ్గర రావణా గోల పిల్లలూ. తనవిషయం కొంతవరకూ ఫరవాలేదు. తనకు తప్పదు ఎలాగోలా సర్దుకుంటాడు. చుట్టమైచూడవస్తే దెయ్యమైపట్టింది అన్నట్లు కుమార్ సంగతేమిటి. కారణం తెలియదుగాని, అతనిగదికి తాళంపెట్టి అసలు అతను యింటికి రావడమే మానుకున్నాడు.

"ఒకేయ్ ... నాయంత్రంలోగా నేను మరోయిల్లు చూసుకు వెళ్ళిపోతానురా" అన్నాడు శీనయ్య కుమార్‌తో.

"ఏమొచ్చిందిరా నీకు. ఇప్పుడేమయిందని".

"దేనికయినా కొద్దిగా మార్దవం ఉండాలి. మామూలుగా నువ్వు ఇబ్బందిపడటం నాకు బాగుండలేదు. నామీద గౌరవంతో నీవేమీ మాట్లాడలేకుండా ఉన్నావు. ఇలా ఎంత కాలం? నా గ్రహబలం ఎలా ఉందో - నాతోపాటు నిన్ను కూడా అవస్థపెట్టడమెందుకు".

"మరేం ఫర్వాలేదు. నాలుగురోజులుండీ వాళ్ళు వెళ్ళిపోతారులే. నీవేం తొందరపడకు".

"వస్తే వెళ్ళరు. వాళ్ళఅబ్బనాడెరుగనట్లూ, వాళ్ళ తాతనాడెరుగనట్లూ, ఈ చిన్నకార్లూ, సిండిపంటలతో భోజనాలూ, రెండుపూట్లా ఫలహారాలూ... మనుగుడుపు పెళ్ళికొడుకుల్లాగే ఎంతకాలమయినా ఉంటారు".

"అంతబాధపడిపోతున్నావేమిటిరా" పకపకా నవ్వాడు కుమార్.

"తినిపోతున్నందుకు కాదురా. బొత్తిగా మేనర్సులేని జంతువులు. ఆ వంటవాడు గోల... మనిషికొకరకమైన వంట కావాలిట. పిల్లలేడుస్తున్నారని మొన్న అర్ధరాత్రి వంటవాడిని లేపి అటుకులు వేయించమన్నాట్ల పకీరుగాడు".

"ఆయన బలే దేవాంతకుడులాగున్నాడు. మాట మెదిత్తే కారువేసుకు షికార్లుకొడతాడేరా".

"డ్రైవరుతో చెప్పు ఖచ్చితంగా. కారుయివ్వవద్దని. నీకెందుకు నేనే చెపుతానుండు ఇవాళ".

ఈ విధంగా స్నేహితులిద్దరూ మధనపడిపోతున్నారు.

ఒకరోజున సుబ్బులు ఒక పెద్ద పట్టుచీర తీసుకొచ్చి "ఆండాళ్ళత్తయ్యోయి. ఈ చీర చూశావా రెండువందల ఏభయిట... సాయంత్రం ఎవరో స్నేహితులయింటికీ, అటు బీచీకీ వెళ్దాం. కట్టుకుని సిద్ధంగా ఉండమని మావారు కొన్నారు".

"చాలా బాగుందే అమ్మా... కొందరిఅదృష్టం.అలా కలిసివస్తుంది. నిన్నటిదాకా ఏమీ లేనివాడేనా, మీ ఆయన. ఇవాళచూడు ఎంత ఐస్వర్యమో. మీమామయ్య ఉన్నారు ఎందుకూ" అని పుల్లవిరిచి మూతిముడిచింది.

ఆ మాటలధోరణి చూస్తే సుబ్బులమ్మకూ కొంచెం కష్టమేసింది "అంత అసూయపనికిరాదు" అని మనసులో అనుకుంది.

"చూడమ్మా సుబ్బులూ. ఇంకో చీర ఇటువంటిది తెస్తారేమో కనుక్కో మీ ఆయన్ని. రేపు యింటికివెళ్ళి డబ్బు ఎంతయితే అంతా పంపిస్తాను" అని అంది ఆశగా ఆండాళ్ళమ్మ. సుబ్బు లేమీ మాట్లాడలేదు. ఒక అరగంట గడిచినతర్వాత, "అక్కయ్యోయి బావ, చిన్నకారు తెచ్చాడు. నిన్ను రమ్మంటున్నాడు" అంటూ పాతికమంది పిల్లలు బిలబిలలాడుతూ పరుగెత్తుకొచ్చారు. సుబ్బులు భర్త తెచ్చిన చీరకట్టుకుంది. బాబిగాడికి టెర్లిన్ చొక్కా లాగూ తొడిగి బూటు వేసింది. బయలుదేరబోతూ ఉండగా పిల్లలంతా తలా ఒకమూలా గోల తాముకూడా వస్తామని...

“మీరెవ్వరూ వద్దు. నేను క్షణంలో వచ్చేస్తాగా” అని అందరినీ సముదాయించేసరికి తలప్రాణం తోకకువచ్చింది.

“పోనీ తీసుకుపోరాదుటే, పిల్లవెధవలు ముచ్చటపడుతున్నారు. నీవేమన్నా మోయాలా వాళ్ళను. ఆ కారులో పడేస్తే వాళ్ళేవస్తారు” అంటూ సాగదీసుకుంది సుబ్బులుతల్లి.

“ఏమోనే బాబూ. వారు కేకలేస్తారు” అని సుబ్బులు అంటూవుండగా ఆండాళ్ళత్తయ్య చీరమార్చుకుసిద్ధమయింది. ఆండాళ్ళత్తయ్యను చూడగానే సుబ్బులుప్రాణం నిలువునా ఎగిరిపోయింది. పిల్లలనయితే ఆపగలిగిందిగాని ఈవిడగారినెట్లా ఆపగలుగుతుంది. అసలే తాను మంచిచీర తెప్పించుకోనందుకు మూతిముడుపుగావుంది. ఇప్పుడు తావద్దనిచెపితే ఏం రాద్ధాంతం చేస్తుందో ఏమో ... బయటనుంచి శీనయ్యా కేకలువినిపిస్తున్నాయి త్వరగా తెమిలిరమ్మని... బిక్కుబిక్కులాడుతూ బాబిగాడిని తీసుకుని. “ఆవునూ, కాదూ” అనకుండా కారుదగ్గరకు వెళ్ళింది సుబ్బులు. వెనకాలే ఆండాళ్ళత్తయ్యకూడా చిట్టిచిట్టి పాదాలతో కారుదగ్గరకు నడిచింది. శీనయ్యకు మతిపోయింది.

“అదేమిటి వారుకూడా వస్తున్నారా” తిరునాళ్ళప్రభల్లే ముఖంపెట్టాడు.

సుబ్బులుకు ఏంచెప్పటానికి ఏమీతోచటంలేదు. “ఏమోమరి” అని మాత్రం అంది.

“వాళ్ళింటికి ఈవిడగారుకూడా ఎందుకే” అనబోయి లోపలే ఆపేసుకున్నాడు శీనయ్య.

"బీచీ చూపలేదురా అబ్బాయి" అండాళ్ళత్తయ్య అంది కేమను ఎల్లోసిల్కుచీర చూసుకుంటూ.

"రేపు మిమ్మల్నీ పకీరుబాబయ్యగారినీ కారిచ్చి పంపిస్తాలెండి ఇవాళ ఏదోపనిమీద మరోచోటికి పోతున్నాం" అన్నాడు శీనయ్య.

అప్పటికయినా ఆవిడ సర్దుకోవచ్చు. ససేమిరా అని ముఖభంగిమమార్చి "వాడితోనా... ఛా. ఛా. నేను వెళ్ళను" అంది.

"ఏం స్వంతభర్తతో వెళ్ళడం ఈవిడకు నామోషీ కాబోలు. దానికి మనమేం చేయగలమని" మనసులో అనుకుని ఆవిడ ఎక్కకుండానే ఏమయితే అయిందని "పోనీయవోయ్ డ్రైవరూ" అన్నాడు శీనయ్య. కారు వెళ్ళిపోయింది. వెళ్ళేకారువెనక పిల్లలంతా ఒక్కసారి బావురుమని మేళం వాయించారు. అంతకంటే వేగంగా అండాళ్ళత్తయ్య రుసరుస లాడుకుంటూ యింట్లోకి బయలుదేరింది. ఆవిడకెదురుగా బెట్టుసరిచేసుకుంటూ ఆదరాబాదరా పకీరేశ్వరరావు "ఏమిటి వెళ్ళిపోయిందా కారు... అరరే... నేనూ అలా బీచీవరకూ వెళ్దామనుకున్నానే" అనుకుంటూ వచ్చాడు.

"అయ్యో ... మీ మొహానికీ, నా ముఖానికీ అంత మాత్రం అదృష్టంకూడాను. వాళ్ళు డబ్బుగలవాళ్ళూ, ఐశ్వర్యంగలవాళ్ళూ, మనమే తిండికిలేక, కార్ల మొహం ఎరక్క యిక్కడికి వచ్చాం... ఈనాడంటే ఈ మిడిసిపాటు ఐశ్వర్యం వచ్చిందికాని, నిన్నటిదాకా మూతుళ్ళునాకిన వారే... గతిలేక మనయింట్లోనుంచి, చింతకాయ, ఉసిరికాయ

పచ్చళ్ళు తీసికెళ్ళినరోజులు మరచిపోయారు. అని ఊరోని యేటట్లు అరవటం మొదలుపెట్టింది.

"పోనీయునమ్మా వదినా. వాళ్ళేదో ముచ్చటపడి చేసితే నీవెందుకలా బాధపడతావు. అమ్మాయితో చెప్తాలే. రేపు మనం వెళ్దాం కాలేసుకుని" అని సుబ్బులుతల్లి ఎంతో చెప్పి వారించబోయింది. ఆవిడగారు వింటేనా...

ఆరాత్రి సుబ్బులూ శీనయ్యా యింటికి వచ్చేసరికే ఆండాళ్ళత్తయ్య ఫిట్ వచ్చి తన్నుకుంటోంది. పకీరయ్యా, పరంధామయ్యా ఆవిడచేతికి ఇనపతాళంచెవులు యిచ్చి ముఖంమీద నీళ్ళుపోసి విసురుతున్నారు. సంగతంతా తెలుసుకున్న శీనయ్య "ఇదెక్కడిసంతరా భగవంతుడా" అని గదిలోకిపోయాడు.

"దానికది మామూలే ... మనస్సుకు బాగా దెబ్బ తగిలినప్పుడల్లా ఇలా ఫిట్సు వస్తాయ"ని పకీరేశ్వరరావు అందరికీ నచ్చచెపుతున్నాడు. ఇప్పుడు అంత మనస్సుకు తగిలిన పెద్దదెబ్బ ఏమిటో ఎవరికీ తెలియలా... అసలు జరిగినవిషయం సుబ్బులు తల్లికీ, ఆండాళ్ళత్తయ్యకూ ఈ విషయంమీద రామరావణయుద్ధం జరిగిందిట ... పనిబాగులవాళ్ళూ చుట్టుపక్కలవాళ్ళూ సాయంత్రం పొద్దుకూకేవరకూ వినోదంగా వీధుల్లో నిలబడిచూస్తూనే ఉన్నారుట. చివరికి కుమార్ ఇంటి నౌకరు కల్పించుకుని పెద్దపెట్టున అరవడంతో ఇద్దరినోళ్ళూ కట్టుబడి యిళ్ళలోకి వెళ్ళారుట...

ఈ సంగతంతా తెలిసి శీనయ్య చాలా బాధపడి సుబ్బులుతో చెప్తున్నట్లు నటిస్తూ అందరికీ తలవాచేలా ఇన్

డైరెక్టరుగా చివాట్లుపెట్టాడు. ఇష్టంలేనివాళ్ళు వెంటనే దయ చేయవచ్చుననీ, అలగాజనంలాగ ఈ యింట్లో ఎవరూ పోట్లా డటానికి వీలులేదనీ చెప్పాడు ... తర్వాత మూడునాలుగు రోజులవరకూ మామూలుగా సాఫీగానే గడిచింది. ఎవ్వరూ భోజనాలు మానలేదు. ఎవ్వరూ ప్రయాణం కాలేదు ఇంత జరిగినా...

ఒకరోజున శీనయ్య ఒక పిక్చరుతాలూకు కాలు షీటుకు వెళ్తూంటే పకీరయ్యకూడా బయలుదేరి వచ్చాడు. వాస్తవానికి పకీరయ్య ఆవేశంలో అలారావడం శీనయ్యకు యిష్టంలేదు. కాని ఏంచేస్తాడు. ముఖంమీద నిష్కర్షగా చెప్పటం అతనికి చేతకాక, చేసేదిలేక ఊరుకున్నాడు.

సినిమాస్టుడియో వాతావరణమే అదొక తమాషాగా ఉంటుంది. ఆడా మగా వివక్షత అక్కడ ఆట్టే పాటించరు. అట్లా అని ప్రతివాళ్ళనుగురించి ఇంకోలా అనుకోవడానికి కూడా వీలులేదు ... ఆడా మగా అంతా విచ్చలవిడిగా రాసుకు పూసుకు తిరుగుతారు. మాట్లాడుకుంటారు. జోక్సు వేసుకుంటారు. క్రిందామీదాపడి నవ్వుకుంటారు. ఆ వాతా వరణమే వేరు. ఆ వాతావరణానికి అలవాటుపడనివాడికి అంతా కొత్తగానే ఉంటుంది.

శీనయ్య మేకప్ చేసుకుంటున్నాడు...అతని ప్రక్కనే హీరోయిన్ ప్రేమలతకూడా మేకప్ చేసుకుంటోంది. హీరో యిన్ కొంతవరకూ అర్ధనగ్నంగా వుంది. ఇతరుల నెవ్వరినీ అక్కడికి రానీయరు. కాని పకీరేశ్వరరావు ముందుగానే ఒక స్టూలుబల్ల తెచ్చుకుని వాళ్ళకెదురుగా కూర్చున్నాడు. అలా

కూర్చోవడం శ్రీనివాసరావుకే నచ్చలేదు. ఆవిడ ఏమయినా అనుకుంటుందేమో...

ఆవిడగారు ఒక్కసారి అనుమానంగా పకీరునుచూచి "ఎవరితాలూకండీ మీరు" అని అడిగింది. బీడీకాలుస్తున్న పకీరు శ్రీనివాసరావును చూపెట్టేడు...

"సారీ శ్రీనివాసరావుగారూ. మీతాలూకు అని అనుకోలేదు. ఏమీ అనుకోకండి" అని అలా అడిగినందుకు క్షమార్పణలాంటిది చెప్పుకుంది.

అప్పుడయినా పకీరేశ్వరరావు సభ్యత తెలుసుకుని వెళ్ళవచ్చునా. వెళ్ళలా. అలాగే కూర్చుని జీవితంలో ఆడ వాసన ఎరగనట్టు అలా తీక్షణంగా హీరోయిన్‌ను చూపు లతో తినేయటం మొదలుపెట్టాడు. ఆవిడ లోలోపల చాలా బాధపడిపోతోంది ఆతని ప్రవర్తనకు...

"ఏమండీ. మీకిక్కడ గాలిసరిగ్గా వేయటంలేదను కుంటానే" అని లౌక్యంగా అంది. అటుకులతుచి ఎద్దుకేం తెలుసు ... ఒక్కసారి ఇకిలించి "బాగానే గాలేస్తోంది" అన్నాడు పకీరు...

"శ్రీనివాసవావు గ్రహించి స్టూడియోబోయ్‌ని పిలిచి పిరికి మన స్టూడియో అంతా ఒకసారి చూపెట్టు" అని లౌక్యంగా చెప్పాడు తానుకూడా...

"తర్వాత చూస్తానులే శ్రీనూ" అన్నాడు పకీరు తన పక్కడికి శ్రీనివాసరావుమీద డొక్కపగిలే చనువుంది అని చెప్పుకుంటున్నట్లుగా... శ్రీనివాసరావుకు అసహ్యమేసింది... "కాదులెండి. డైరక్టరుగారువస్తారు. ఆయన చాలా కోపిష్టి.

ఇతరులెవరైనా ఇక్కడుంటే చాలా విసుక్కుంటారు" అని కుండపగలగొట్టినట్లు చెప్పాడు. అప్పటికి, చేసేదిలేక, తానక్కడ కూర్చోటం వాళ్ళిద్దరికీ ఎందుకో యిష్టంలేదని లోలోపల అనుకున్నవాడై ఆ పురుషపుంగవుడు బయటికి వెళ్ళాడు. ఆరోజు సదరు హీరోయిన్, శ్రీనివాసు, ఇద్దరూ ప్రేమఘట్టం నటించాలి. పాపం బాగానే నటించారు ... మధ్యలో అకారణంగా పకీరుమామయ్య తలవనితలంపుగా విలన్‌గా మారిపోయాడు. వుక్రోషంపట్టలేక శ్రీనివాసుడితో చెప్పకుండానే పదిహేనుపైసలిచ్చి సిటీబస్‌లో వెళ్ళిపోయాడు యింటికి.

పకీరేశ్వరరావు అండ్ పరంధామయ్య కంపెనీవచ్చి ఇప్పటికి నెలదాటింది. జరిగటము ఒకనెలే అయినప్పటికీ ఎన్నోసంవత్సరాలయినట్లుగా ఉంది శీనయ్యదృష్టిలో. నానాటికీ వీళ్ళచర్యలు శ్రీనివాసరావుకు తలకొట్టినంత పనవుతున్నాయి ...

ఇటీవల సుబ్బులు నాలుగురోజులుగా తనతో సరిగ్గా మాట్లాడటంలేదు. ఏదడిగినా ఆన్సర్ టుది పాయింట్‌గానే ఉంటోంది సమాధానం. తాను బయట నానాఅవస్థాపడి ఇంటికొస్తే వీళ్ళగోలమాట అలావుంచి ఆదరించే దిక్కులేక మూతిముడుపులూ, రుసరుసలూ... దీనికి కారణం ఎంత ఆలోచించినా శ్రీనివాసుడికి అర్థంకాలేదు. ఒకసారి సుబ్బుల్ని నిలదీసి అడిగాడు. కాని ఆవిడదగ్గరనుంచి సరయిన జవాబు రాలేదు. "సత్యభామాదేవి అలకగృహంబున శయనించెను" అన్నట్లుంది సుబ్బులుస్థితి...

ఆరోజు బాబిగాడి పుట్టినరోజు. ఒక్కగానొక్క కొడుకు పుట్టినరోజు ఘనంగానే చేసుకోవాలని సంకల్పించారు. అందులోనూ భగవంతుడు కాస్తాకూస్తో యిస్తున్నప్పుడుకూడా తక్కువ ఎందుకు చెయ్యాలి... సాయంత్రం పార్టీకి అనేకమంది స్నేహితుల్ని, పెద్దలనూ ఆహ్వానించాడు శ్రీనివాసరావు. పకీరేశ్వరరావు, పరంధామయ్య సుబ్బులుదగ్గర అప్పుతీసుకుని పిల్లవాడిచేతిలో చెరిరెండు రూపాయలూ పెట్టారు. ఆ సాయంత్రం పార్టీలో ఎన్నో రకరకాల కానుకల ప్రెజెంటేషన్సు పిల్లవాడికి రావడంచూసి సుబ్బులుకళ్ళు తిరిగిపోయి, ఈ వేడుక చేసుకోవడం మంచిదనే అనిపించింది. ప్రతి సంవత్సరం తనకొడుక్కే కాకుండా, వీలుగా ఉంటే తానూ తనభర్తాకూడా పుట్టినరోజులుచేసుకుంటే బాగుంటుందనుకుంది. కుమార్ తన మేనల్లుడికి పెద్ద వెండికంచం తీసుకువచ్చాడు. ఆ పార్టీకి అందరితోపాటు హీరోయిన్ ప్రేమలతకూడావచ్చింది. అందమైన కారులోంచి ఆవిడ కాలుక్రిందపెట్టగానే కుమార్, శ్రీనివాసరావు ఆవిడను ఆహ్వానించి లోపలికితీసుకువచ్చారు. వస్తూవస్తూ శ్రీనివాసరావు ఒక్కసారి తలెత్తిచూచేసరికి పకీరేశ్వరరావు సుబ్బులు వేపుచూస్తూ కనుబొమ్మలూ, ముక్కుపుటాలు ఎగరేసుకుంటూ ప్రేమలతవైపు చూపుతున్నాడు.

"నేను చెప్పానే ఆవిడే ఈవిడ" అన్న సౌంజ్ఞ అందులో యిమిడివుంది. వెంటనే సుబ్బులు తక్కువని ముఖభంగిమ మార్చేసింది. శ్రీనివాసుడు తెల్లబోయాడు. సుబ్బులు ఇంతవరకూ చూపిన అనాదరణదీక్షకు కారణం యిప్పుడర్థమయింది. ఇదంతా పకీరుగాడు ఆడిననాటకం...

"ఏమిటి పరధ్యానంగా ఉన్నారు" ప్రేమలత అడిగింది.

"అబ్బే ఏమీలేదండి... ఈవిడ నాభార్య లక్ష్మి... (సుబ్బలక్ష్మికి ముద్దుపేరు) ఇదిగో వీడే వంశాంకురం".

"అబ్బా, సినిమాషై లాగులు ఇంటివద్దరకూడా వాడేస్తుంటారే".

ఇంతలో సుబ్బలక్ష్మి అందుకుని "వారు యింటికొచ్చినా ధ్యాసంతా అక్కడే ఉంటుందిలెండి"అని కొంచెం కోపంగా వ్యంగ్యంగా ప్రేమలతమీాద విసిరింది.

అందులోని అంతరార్థం ప్రేమలతకు తెలియదుకాబట్టి భర్తమీద విట్టువేసింది కాబోలనుకుని నవ్వి ఊరుకుంది. శ్రీనివాసరావుమాత్రం కలుక్కుమన్నాడు సుబ్బలక్ష్మి ప్రవర్తనచూసి, ప్రేమలత కుఱ్ఱవాడిచేతిలో రెండు వంద రూపాయల కాగితాలూ చిన్న వెండిగ్లాసుపెట్టి పిల్లవాడిని ఎత్తుకుని ముద్దెట్టుకుంది.

"శ్రీనివాసరావుగారూ. ఇంతముద్దొస్తున్నాడు మీా వాడిని నాకిచెయ్యకూడదూ" అన్నది.

సుబ్బులు ధర్మమా అని పైకిఏమీా అనకుండా ఒక్కసారి ప్రేమలతకేసి కోపంగాచూసి ఛట్టుమని లోపలికి వెళ్ళిపోయింది. టీపార్టీ అంతా ఒకవిధంగా బాగానే జరిగింది ఎవరియిళ్ళకువాళ్ళు వెళ్ళిపోయారు. కాని శ్రీనివాసరావు మనస్సుమాత్రం ఒక స్థిరంగాలేదు. కోపంతో అట్టుడికినట్లు ఉడికిపోతున్నాడు. అతనికోపమంతా పకీరుగాడిమీాదకంటే సుబ్బులుమీాద ఎక్కువగాఉంది. ఆ ఎంగిలిబీడీ వెధవ చెపితే

మటుకు దీనికెందుకు జ్ఞానంలేకపోవాలి. తన మిత్రులముందు తనని అవమానంచేస్తుందా ... ఈ సమస్యను త్వరలో పరిష్కారంచేసి వీళ్ళను సాగనంపకపోతే ఇల్లుగుల్లకావడమే కాకుండా, తనపరువు గంగలో కలవడమే కాకుండా, చివరికి సంసారంలో కలతలుకూడా బయలుదేరేటట్లున్నాయి ... ఎప్పటిదాకా యెందుకూ ఇప్పటికే బయలుదేరాయికూడాను.

"అవును చెప్పాను. తప్పా ... మేనగోడలు సంసారం పాడయిపోతుంటే చెప్పటం తప్పా" ఆ రాత్రి శ్రీనివాసుడి ప్రశ్నకు రుసరుసలాడుతూ సమాధానం చెప్పింది సుబ్బులు.

"నా సంసారం సజంగా పాడుచేసుకోవాలని నాకుంటే ఈ ఉల్లుగాడు రక్షిస్తాడా. నాకంటే నీకు నీ మేనమామమీదే ఎక్కువనమ్మకమూ సరే అన్నమాట. అటువంటప్పుడు వాడి యింటిదగ్గరే ఉండక నాయింటికెందుకొచ్చావు. వెళ్ళు. వెళ్ళి వాడింటిదగ్గరే ఉండు".

"ఆయన మీయిద్దరిమధ్యా అడ్డుగా ఉన్నాడనేగా ఆయన అక్కడినుంచీ వెళ్ళేదాకా ఏవో కారణాలుచెప్పి నాగ నంపారు అక్కడినుంచి".

పకీరుచెప్పిన మాటలన్నీ చిలకలాగ వప్పచెబుతున్న సుబ్బులక్ష్మికి ఏంచెప్పాలో ఎలాచెప్పాలో శ్రీనివాసుడికి తెలియడంలేదు.

పైగా కొడుకుని తీసుకుపోతుందట. అడగటానికి సిగ్గు కూడాలేదు. భర్తను తనవశం చేసుకుందిగా. భార్యాభర్తలను వేరుచేయడంతో తృప్తిపడలేదు కాబోలు తల్లీ కొడు

కత్తిస్తూనా వేరుచేయాలని ఉందికాబోలు. దీనిబుద్ధులు మండా".

"ఛా. నోర్ముయ్. పిచ్చికుక్కలాగ అరవకు. సభ్యత తెలియని వాళ్ళతో వేగటమే కష్టం".

"అవును. నాకేం సభ్యత తెలుస్తుంది. నేను పల్లెటూరి మొద్దును. భార్యాకళ్ళల్లో మట్టిగొట్టి పరాయి ఆడ వాళ్ళతో కులకటం సభ్యతకాబోలు".

"నీతో మాట్లాడటం నాదే బుద్ధితక్కువగాని నీకు పుణ్యముంటుంది గట్టిగా అవరకు. ఎవళ్ళయినా వింటే—"

"విననీయండి. ఏంతప్పు ... పిల్లిపాలుతాగుతూ ఎవళ్ళూ చూడటం లేదనుకుంటుందట. నానోరుమూయటం గొప్పకాదు. ఊళ్ళోవాళ్ళనోళ్ళు మూయడం—"

"ఓసి నీదుంపతెగ. నీనోరు తెగరెచ్చిపోతోందేం యివ్వాళ... పుట్టింటివారంతా అండగా ఉన్నారనా—"

"మాటమెదిత్తే వాళ్ళమీదపడిపోతారెందుకూ ... వాళ్ళేలేకుండాపుంటే మీ ఆటలు బాగా సాగించవచ్చు ననా?"

"అయితే వాళ్ళు నాకు కాపలా అన్నమాట..."

శీనయ్య అట్టుడికినట్లు ఉడికిపోయాడు...

"ఛీ. ఛీ... ఇంక ఈ యింట్లో ఒక్కక్షణం ఉండను. మీచావు మీరుచావండి" సీనయ్య లేచాడు.

"పొండి పొండి. నేనూ పోతాను. నేనుపోయిన మర్నాడు హాయిగా దానితోనే కులకండి... ఓరిబాబిగా..."

ఇక నీకు దిక్కెవ్వరోయ్" అని శాపనమని శోకాన్నాలు మొదలుపెట్టింది...

శీనయ్యకేంచేయడానికీ తోచడంలేదు. శోకాన్నాలు ఎక్కువయి నలుగురూ వింటారేమో... అంటే తనపరువేం కావాలి. తెల్లారిలేచి వాళ్ళమొహాలు ఎలాచూస్తాడు. పోనీ నాలుగుచరి స్తే... ఛీ. ఆడదానిమీద చేయిచేసుకోవడమా... అంతకంటే యిల్లువదలి ఏ సన్యాసుల్లో అయినా కలవడాని కయినా ఒప్పుకుంటాడుగాని, ఆ వెధవపని తనవల్లకాదు... మరి అంతకంతకూ రెచ్చిపోతున్న సుబ్బులును ఏంచేయాలి? పోనీ నచ్చచెపితే ... ఛీ. అంతదిగజారిపోయి నచ్చచెపితే లోకువకట్టేయదూ ... మరి ఏంచేయాలి? ... ఏమిటో ఏం తోచటంలేదు. అట్లా గుడ్లప్పచెప్పి ఆకాశంవైపు చూస్తూ కూర్చున్నాడు కిటికీలోనుంచి... పది ... పదిహేనునిమిషాలు గడిచాయి...

సుబ్బులు టెంపరేచరు కొద్దిగాదిగింది. "ఛీ... వారెంత బాధపడిపోతున్నారో... దిక్కుమాలినదాన్ని వారి మనస్సు కష్టపెట్టాను. అనవసరంగా రెట్టించడమెందుకు ... అలా రెట్టించబట్టే దిక్కుమాలిన తామసంతో రెచ్చిపోయాను. అసలు వారిదగ్గిర ఆ దుర్బుద్ధి ఉందోలేదో... పకీరుమామయ్యే కల్పించాడేమో. కాపురానికొచ్చినప్పటినుంచి వారిసంగతి చూస్తున్న నాకు తెలియదా ఏమిటి. ఎప్పుడూలేనిది ఈనాడు ఈ దుర్బుద్ధి పుట్టుకొస్తుందేమిటి...? ఏమో అందమైనఆడది సిగ్గులేకుండా దగ్గరకొస్తే మనస్సు చలించకూడదా ... అయినా దానికదేంబుద్ధి? అంతసిగ్గులేకుండా... వాళ్ళవృత్తే

అదయినప్పుడు వాళ్ళననాల్సిన పనేముంది..." ఏమిటో సుబ్బులుబుఱ్ఱ తిరిగిపోతోంది...

చీకట్లో ఆకాశాన్ని చూస్తున్న శీనయ్యా జుట్టులోకి ఏవో నాలుగువేళ్ళు చొరబడి చల్లగా తగిలాయి. శీనయ్యా ఉలిక్కిపడి పక్కకుచూశాడు ... సుబ్బులు వెక్కి వెక్కి ఏడుస్తూ దగ్గరగావచ్చి కూర్చుంది.

"ఎవరు చచ్చారని. ఎందుకట్లా ఏడుస్తావు".

"ఏమండీ... ఇంకెప్పుడూ మిమ్మల్ని ఏమీ అనను. మీయిష్టంవచ్చినట్లు దానితో మాట్లాడుకోండి, మీమనస్సు నాకు తెలియదూ ... ఇన్నాళ్ళనుంచీ లేనిది మీ కివ్వాళ ఈ పాడుబుద్ధి పుడుతుందా ఏమిటి...నలుగురూ మిమ్మల్నిచూసి నవ్వుతారేమోనని అలా అన్నాను. అంతకంటే వేరే ఏమీ లేదు".

"సంతోషించాంలే, నా మనస్ససలు బాగుళ్ళా పోయి పడుక్కో..."

"అదికాదండీ...నిజంగా నామీద ఒట్టేసుకుచెప్పండి. మీరు నన్ను అన్యాయంచేయరుగా".

"ఇదగో. నన్ను నమ్ముతావానమ్ము, లేకపోతేలేదు. ఇట్లా నన్ను అపార్థాలు చేసుకున్నావంటే మనం ఒక్కక్షణం కాపురం చేయలేము".

"సరే. మీమాటంటే నాకు నమ్మకమే. ఇంకెప్పుడూ మిమ్మల్ని ఏమీఅనను. బాబిగాడు నవ్వుతున్నాడు. ఒక్కసారి ఎత్తుకోండి".

"బాగానేఉంది సరసం. ఇప్పుడేనా అర్ధరాత్రివేళ ముద్దులూ ముచ్చట్లూను".

"తీసుకోండి... కోపంపోయిందని చెప్పండి... చెప్పండి. చెప్పకపోతే నామీదవొట్టే".

శీనయ్య కెంపరేచరూ చాలావరకూ దిగజారింది.

"ఒట్టనిచెప్పండి ... కోపంపోయిందా" గడ్డంపుచ్చుకుని తనవేపు తిప్పుకుంది సుబ్బులు.

"ఒట్టేలే... పోయిపడుకో. పో".

"మజ్జిగలో కాస్తపుప్పేసి పట్టుకురానా".

"ఎందుకు?"

"కడుపులో చల్లగాఉంటుంది"... ఏదోవిధంగా రాజీపడి శీనయ్య కోపంతగ్గించాలని పిచ్చిసుబ్బులమ్మ ఉబలాటం.

సుబ్బులుకు ఎప్పుడు ఆగ్రహమొస్తుందో తెలియదు. ఎప్పుడు దిగజారి అనుగ్రహంవస్తుందో అంతకంటే తెలియదు. అనవసరంగా మాటపడటమంటూవస్తే ఉత్తమం, మధ్యమం లేకుండా తారాజువ్వలాగ ఒక్కసారి "ఛర్"మని ఎగిరి వెంటనే దిగిపోతుంది...

"అదిసరే, నేనులేనప్పుడు కుమార్ కు టిఫెన్, కాఫీ యిస్తూవుంటావుటగా".

సుబ్బులు "ఛర్"మనిలేచింది. "ఏం, ఇస్తే. అన్నగారులాంటివారు. స్వంతతోబుట్టువుకంటే ఎక్కువగా ఉంటున్నాడు. మరీ ఇంత మీకు మతిపోతోందేం?" పిల్లవాడి వీపుమీద ఒక్కటిచరిచి మంచంమీదనుంచి లేచిపోయింది సుబ్బులు...

"ఉండవే. ఉండవే. అంతకోపమెందుకు".

"సిగ్గులేకపోతేసరి. ఇంకా కోపమెందుకు అని అడుగుతున్నావా".

"ఏం ... నిన్నన్నందుకు నీకంతకోపమొచ్చిందే. నన్నన్నందుకు నాకెంతకోపంరావాలి".

"అయితేమటుకు అటువంటిమాటలనేందుకు మీకు నోరెలావచ్చింది".

"నన్ను తగలేటానికి నీకెలా నోరొచ్చింది".

"మా మామయ్య స్వయంగా చెప్పాడుగనక."

"అదే అయితే నేనిప్పుడు చెపుతున్నా. ఇవేమాటలు మీ అత్తయ్య నాతో అన్నది".

"ఏమని?"

"నేను లేనప్పుడు నీవు కుమార్‌కు కాఫీ ఫలహారాలు స్వయంగా యిస్తున్నావనీ, ఆడదానికి అంతచనువివ్వటం మంచిదికాదనీ, తర్వాత నేను విచారించాల్సివస్తుందనీకూడా చెప్పింది".

"నిజంగానేనా".

"అడుగు కావాలంటే. ఆవిడ యిక్కడే ఉందిగా".

"బుద్ధిలేక ఆవిడ అంటే మాత్రం మీరెలా నమ్మారూ".

"నీవు నమ్మలా నీమామయ్యమాట ... అలాగే నేనూ నమ్మాను".

"ఉండండి. ఇప్పుడే వాళ్ళను కాళ్ళూ చేతులు విరగ్గొట్టి బయటికి గెంటుతాను. ఇంట్లోతిని యింటివాసాలు

లెక్క పెడతారా వీళ్ళదుంపలు తెగ. ముఁదనష్టపుచచ్చి నాళ్ళు".

"ఉండుండు మరి. అంత తొందరయితే ఎలా మరి... నీకూ నాకూ ఉన్న తేడా చూశావా... మగవాడికీ ఆడదానికీ ఉన్న తేడా అక్కడేఉంది. మగవాడు కొంచెం బుద్ధి ఉపయోగించి మంచీచెడ్డా విచారించి అందులో ఎంతవరకూ సత్యముందోనని తర్కించుకుని, దానిప్రకారం నడుచుకుంటాడు. కాని మీమాదిరిగా దున్నపోతు ఈనిందంటే దూడను కట్టేయమని మూర్ఖంగా బయలుదేరడు".

"నిజమేనండీ. మీరుకాబట్టి సరిపోయిందిగాని మరొకళ్ళయితేనా".

"అదే. నీలాటివాళ్ళయితే..."

"అబ్బా ఊరుకుందురూ..."

ఇంతలో బయట ఎవరో తలుపుకొట్టిన చప్పుడయింది. ఇద్దరూవెళ్ళి తలుపుతీశారు. ఎదురుగా కుమార్ నిలబడి ఉన్నాడు, కుమార్‌ను చూచేసరికి ఇద్దరికీ మతులుపోయాయి. కొంపతీసి ఇంతకుముందు వీరనుకున్నమాటలు వినలేదుగదా. అతనిముఖంకూడా అదోమాదిరిగాఉంది.

"ఏమిట్రా ఇలావచ్చావు" శీనయ్యా బిక్కుబిక్కుమనుకుంటూ అడగలేక అడగలేక అడిగాడు. కొంపతీసి ఇంతక్రితం వీరనుకున్నమాటలు విన్నట్లయితే ఆతనికిక తనముఖం ఎలా చూపించగలడు. తను ఊరికే సుబ్బులుతప్పు తెలియచెప్పేందుకు అడిగాడుగాని, అతనికి కుమార్‌మీదగానీ సుబ్బులు మీదగానీ ఎటువంటి దురభిప్రాయంలేదు. అదేకనుక నిజంగా

ఆతను వినిఉంటే... అమ్మో... ఇంతకంటే అప్రదిష్ట ఇంకే మన్నా ఉందా? ... వినేఉంటాడు లేకపోతే ముఖం అలా అదోలా ఎందుకుంటుంది...

"లోపలికి రండన్నయ్యా" సుబ్బులే ధైర్యంచేసి అంది.

"వస్తానుగాని. ఒక్కవిషయం అడుగుతా మీరేమీ అనుకోరుకదా" కుమారే అదోవిధంగా అడగలేక అడగలేక అడిగాడు.

ఆతడు తప్పకుండా వినేఉంటాడు. ఎంతో లోలోపల మథనపడిపోతున్నట్లు ఆ ముఖమే చెబుతోంది... ఛీ-ఛీ- దిక్కు మాలినసంత వీళ్ళమూలంగా తమకెంత అప్రదిష్టవచ్చింది. క్షీరనీరప్రాయంగాఉన్న స్నేహంలో ఎంత అప్రదిష్టవచ్చింది.

"ఏమిట్రా అది. ఏమిటి. అదోలాఉన్నావు చెప్పరా" ఆదుర్దా నటిస్తూనే అడిగాడు శ్రీనివాసరావు.

"ఏంలేదు. మీకేమయినా అవసరముండి నాడ్రా యర్లో డబ్బుతీశారా".

"హమ్మయ్య" ఇద్దరిప్రాణాలూ తేలికపడ్డాయి. విష యం అదికాదుకదా ... అదిసరే. అంతకుమించినవిషయం ఇది ... డబ్బుపోవడమేమిటి? లోలోపల అనుకున్నారు దంప తులు...

"డబ్బా... ఎంత? ..."

"ఎంతోలేదులే... అయిదువందలు ... ఒక అవసరమైన పనిమీద, తెచ్చి డ్రాయర్లోపెట్టాను. తీరాచూస్తే లేదు... 'ఏదైనా అవసరముండి తీశావేమో...' అని అడుగుతున్నా.

నీవు నిజంగా తీయకపోతే బాధపడతావేమో అని సంశ
యిస్తున్న" శేఖరం మాట్లాడలేదు.

"పోనీలే. ఇంకా ఎక్కువయినాపెట్టి మరచిపోయా
రేమో. అడిగినందుకు ఏమీ అనుకోకు వస్తా" అని బయలు
దేరబోయాడు... సుబ్బులుకు తళుక్కున ఒకవిషయం జ్ఞాప
మొచ్చింది... ఆ మధ్యాహ్నం అంబాళ్ళ త్రయ్య పకీరేశ్వర
రావుతో "డబ్బిస్తా. సుబ్బులు కొనుక్కున్న చీరలాటిది
తెచ్చిపెట్టమని అడగటం" జ్ఞాపకమొచ్చింది. ఆవిషకంత
డబ్బెక్కడిది. ఇది ఆవిడపనే అయివుంటుంది. ఆపని ఎవరు
చేసినా అప్రదిష్టపని తమకే. తమకింత మేలుచేసిన,తన అన్న
గారులాటి కుమార్‌కు కూడని జరిగినందుకు సుబ్బులు చాలా
బాధపడింది.

"ఓహో. అయిదువందలరూపాయలేనా... డ్రాయర్లో
ఉన్నవేగా?" అని అడిగింది కుమార్‌ను.

"అవునమ్మా. అవే..."

"ఏమిటన్నయ్యా. తాళంవెయ్యకుండా అలా అంత
డబ్బు డ్రాయర్లోపెడితే ఎలాగ ... నలుగురూ తిరిగేకొంప.
ఎందుకయినా మంచిదనితీసి నాపెట్టెలోపెట్టి తాళంవేశా...
నీతో చెబుదామనుకున్నా. నీవు ఎప్పుడూ ఇంటికివచ్చింది
చూడలేదు" అని కటిక్కన ప్లేటుమార్చింది సుబ్బులు...

"నేనూ అదే అనుకున్నా...ఏదైనా అవసరముండి
బావగారినీ, నీవుగానీ తీశారేమోననే అనుకున్నా ... తీరా
మీరుకనుక నిజంగా ఎరక్కపోయిఉంటే అడిగినందుకు ఏమ
యినా అనుకుంటారేమోనని లోలోపలమధనపడిచస్తున్నా".

"ఒరేయ్. నాదగ్గరకూడా నీకీ సందేహమేనా" అన్నాడు శీనయ్యా.

"సందేహం లేదుకనుకనే అడగగలిగా ... మరొకళ్ళయితే అడుగుతానా ఏమిటి. దిక్కుమాలిన అయిదొందలు పోతేపోయాయిగాని" అన్నాడు కుమార్.

"ఇప్పుడివ్వనా రేపివ్వనా అన్నయ్యా" సుబ్బులు అడిగింది...

"పోనీ రేపుఉదయం తీసుకుంటాలే అమ్మా" అంటూ కుమార్ వెళ్ళిపోయాడు. సుబ్బులు గబగబాపోయి చెంబుడు మంచినీళ్ళు త్రాగింది గటగటా ... శీనయ్యాముఖం జేవురించి ఉంది.

"ఏయ్. ఇలారా...ఏమిటి నీకాస్వతంత్రం. అతని ఇంట్లోడబ్బు నీవెందుకు తీయవలసివచ్చింది" కటువుగా అడిగాడు శీనయ్యా. కొంతవరకూ సుబ్బులునుకూడా అనుమానించాడు శీన్యయ్యా.

"చాల్లెండి. ఏమిటా అనుమానం...ముందు కట్టు ఒకటి తీసుకురండి. వీళ్ళదుంపలుతెగ వీళ్ళబ్రతుకు ఇవాల్టితో తేల్చేస్తాను" అని కాళికావతారం ధరించింది సుబ్బులు.

"ఏమిటిసంగతి...ఏయ్...సుబ్బులూ, సుబ్బులూ" అని తెల్లబోయాడు శీనయ్యా. విషయమంతాచెప్పి, మర్యాద కాపాడుకోవడానికి తనేతీసినట్లు నటించానని చెప్పింది. సుబ్బులు సమయస్ఫూర్తికి శీనయ్యా ఎంతో సంతోషించాడు.

ఈపని తప్పకుండా అందాళ్ళ త్తయ్యాపనే. శీనయ్యా తనకు అప్పుడప్పుడూ యిచ్చిన డబ్బులో ఆ అయిదువందలూ యిచ్చివేద్దామనుకుంది.

* * *

మరునాడు శీనయ్యా నిద్రలేచేసరికి యిల్లు నిశ్శబ్దంగా ఉంది. పెళ్ళివారు వెళ్ళిపోయిన రెండింతోసులభవనంలాఉంది. లేచిచూసిన శీనయ్యా తనకళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఇంట్లో ఎవ్వరూ-ఒక్కపిట్టకూడా-కనిపించటంలేదు ... పడక గది - హాలు - మండువా - వసారా... అన్నీదాటి వంటిం ట్లోకి వెళ్ళాడు. సుబ్బులు కాఫీకుంపటిముందు కూర్చుని కాఫీ ఫలహారం తయారు చేస్తోంది.

"ఏయ్. ఇటొకసారివచ్చి నన్నుగిల్లు" అన్నాడు శీనయ్యా.

సుబ్బులు ముసిముసినవ్వులు నవ్వుతూ దగ్గరకువచ్చి "ఎందుకూ" అని ఎదురు ప్రశ్నించింది.

"ఇది కలా? నిజమా?".

"నిజమే...త్వరగా మొఖం కడుక్కురండి. బాత్ రూమ్‌లో పేస్టూ బ్రష్షూ పెట్టివచ్చాను. బాయిలర్‌లో వేడి నీళ్ళున్నాయి".

"అది సరేలేవే...ఏరీ వీళ్ళంతా".

"తెల్లారుకట్ట బండిలో వెళ్ళిపోయారు".

"అసలేం జరిగింది".

"చెప్తతా తీరుబడిగా తర్వాత — ముందు ముఖం కడుక్కురండి".

# తిరుగుబాటు

## కె. రామలక్ష్మి

ప్రేమంటే
ఒకరి కళ్ళల్లోకి యింకొకళ్ళు చూసుకోవడం కాదు.
ఇద్దరి చూపులూ ఒకే పక్క సాగడం.

ప్రేమంటే
పారి పోయి ఓడిపోవడం కాదు.
నిలబడి పోరాడి గెలవడం.

ప్రేమంటే
లేని దాన్ని గురించి బాధ పడ్డం కాదు.
ఉన్న దాన్ని అనుభవించడం.

ప్రేమంటే
బెంగ పెంచుకోవడం కాదు.
బెంగ పంచుకోవడం.

అందుకే—
ప్రేమ క్షమకు మారు పేరు
రక్షణ కింకో పేరు.
అందుకే
ప్రేమ
ఈ పూట శాశ్వతం అనుకున్నది
రేపు కనుమరుగై పోతుంది.
అందుకే
కాలం కలపి రావడంకోసం ఆగదు ప్రేమ.

విశిష్ట లేఖినిగా పేరుగాంచిన కె. రామలక్ష్మి
కలంనుండి వెలువడిన ఓ చక్కటి ప్రేమ గాథ

**తప్పక చదవండి!**

Wrapper Printed at S...